# అన్వేషణ

# 2

## విశ్వనాథ, జాషువా
## శతజయంతి ఉత్సవ ప్రసంగాలు
## 1994-'95

తెలుగు ప్రాచ్య భాషా విభాగం
నాగార్జున విశ్వవిద్యాలయం
నాగార్జుననగర్ - 522 510

**అన్వేషణ**

[తెలుగు ప్రాచ్య భాషావిభాగం పత్రిక 1995
విశ్వనాథ జాషువా శతజయంతి ఉత్సవ ప్రత్యేక సంచిక]


ప్రథమ ముద్రణ : డిశంబర్ 1995

ప్రతులు : 500

వెల : 50/-

ప్రతులకు :
అధ్యక్షులు
తెలుగు ప్రాచ్యభాషావిభాగం,
నాగార్జున విశ్వవిద్యాలయం,
నాగార్జుననగర్-522 510
గుంటూరు.

---

ము ద్ర ణ :
శ్రీ లక్ష్మీగణపతి ప్రింటర్స్,
మునిసిపల్ కాంప్లెక్స్,
5వ లైన్, బ్రాడీపేట, గుంటూరు.

## సంపాదకమండలి

1. ఆచార్య టి. నిర్మల
2. ,, ఎస్. గంగప్ప
3. ,, ఏ. పున్నారావు
4. ,, వై. బాలగంగాధరరావు
5. ,, జి. కృపాచారి
6. ,, ఎన్. ఏ. రామశాస్త్రి
7. డా॥ టి. సత్యవతి
8. డా॥ జి.వై. ప్రభావతీదేవి
9. డా॥ పి. వరప్రసాదమూర్తి
10. శ్రీ కె. సత్యనారాయణ

# విషయసూచిక

V

# ఒకవరాటు ! ఒక్క వరాటు !

ఆంధ్ర మహాభారత రచనకు నన్నయ పూనుకొని, ఆంధ్రభాషకు, ఆంధ్ర జాతికి సాహితీ జగత్తున స్థానమును కల్పించినాడు. తదాది ఎందరెందరో మహానుభావులు దానిని సుసంపన్నము గావించినారు. అందును ఎంతో వైవిధ్యము, ఇతిహాసపురాణానువాదములు, ప్రబంధములు, చారిత్రిక, మతైకవిషయప్రాధాన్యములు. శతక, గేయ, పద, అధిక్షేపములు– ఇట్లెన్నో అన్ని. ఈ నాటికాలమున 'భావ కవిత్వము' కథలు, కథానికలు, నవలలు, విప్లవ, దళిత, స్త్రీవాదములు ఇంకెంత వైవిధ్యము రానున్నదో!

ఈ తరంవారికి అపరిచితులు, నేటికి శతజయంత్యుత్సవమునకు అర్హమైన మహానుభావులును పెద్ద సంఖ్యలో గలరు. అందు విశ్వనాథ, జాషువాగారలు ప్రముఖులు. వారిని సంస్మరించుకొను నుద్దేశముతో విశ్వవిద్యాలయ ప్రాంగణమున, మా శాఖ ఆధ్వర్యవమున, వారి జయంత్యుత్సకాల వేడుకలు ఘనముగా జరుప బడ్డాయి. నేల నాలుగు చెరగుల నుండి కాకపోయినా మా పరిధి పరిమితించిన మేరకు, కొందరు సాహితీవేత్తలను మా ప్రాంగణానికి రాబిలిచి, వారివారి ఉపన్యాస ములను ఏర్పాటు చేయగలిగినాము. ఈ కార్యమునకు ఎందరో సహకరించినారు. వారందరికి కృతజ్ఞతాభివందనములు.

ఈ కార్యక్రమము తలపెట్టినపుడు, "రెండు విభిన్న దృక్పథములు గల వారి సంస్మరణము ఒక వేదికపై ఏకకాలమున జరుపతలపెట్టినారు. ఇబ్బందులపాలగుదు రేమో ఆలోచింపు డని కొందరు మామేలుగోరి హితబోధచేసినారు. దానికి "మేము తటస్థులము. మాలోను విభిన్న దృక్పథములు గలవు. అయినను కవులుగా వారిపై మాకు గలది సమభావన" అట్లని మా సమాధానము. మొదలు ఒకే వేదికపై వారిని గూర్చివినగోరుటయే మేలంటిమి. మా ప్రయత్నము ఫలించినది.

నాటి వాగ్వ్యవహారమున కిది అక్షరాకృతి, అయినా ఇందులో అందరివీ రాలేదు. దానికి కారణము మేముకాదు. ఆయా వక్తల నుండి వారివారి ప్రసంగ ములు మాకందకపోవటయే తప్ప అన్యముకాదు. ఎందుకీ ఉత్సవములు అన్నవారును లేకపోలేదు. వారికి మేమిచ్చిన సమాధానమిది. గతించిన మన కుటుంబ సభ్యులను, వారి చేతలను మననము చేసికొని ఎట్టి పారిత్రిక శిక్షనలవరచుకొనుచున్నామో, అట్లే సాహితీ విద్యార్థులమైన మాకు, మా పూర్వులను సంస్మరించుకొనుట, ఉత్తేజము

పొందుట, కర్తవ్యమును బోధపరచుకొనుట విధియంటిమి. ఇట్టి ఈ మా ప్రయత్నము, ఇతరులకును ఇట్టి స్పందనే కలుగజేసిన, దీనికి మరింత కృతార్థత్వము ఒనగూరును. దీనికి లోకము సాక్షి. ఇది ఈ విధంగా రావడంలో ప్రముఖ పాత్ర వహించినవారు యావత్ కార్యక్రమము పట్ల నన్నుత్సాహపరచినవారు ఆచార్య శ్రీగంగప్పగారు, వారి సహకారము లేకున్న ఇది ఇట్లు రూపొందెడిదికాదు. వారికి నా కృతజ్ఞతాపూర్వక వందనములు ఈ ఉత్సవములు నేను శాఖాధిపతిగానుండగా జరుగుట నా అదృష్టముగా భావించుచున్నాను. ఇది మద్గురువుల కంకితమగుట మరియొక అదృష్టము.

**ఈ కార్యక్రమ నిర్వహణకు ఆర్థికంగా సహకరించినవారు.**

(1) నాగార్జున విశ్వవిద్యాలయం
(2) శ్రీ సోమూరి వెంకట్రామయ్యగారు
(3) శ్రీ ధనేకుల రవీంద్రనాథ ఠాగూరుగారు
(4) శ్రీ కొసరాజు ఉమావరమూర్తిగారు
(5) విద్వాన్ శ్రీ గోగినేని కనకయ్యగారు
(6) వి. టి. జె. యం. డిగ్రీకళాశాల, మంగళగిరి
(7) సిద్ధార్థ ఎకాడమీ ఆఫ్ టెక్నికల్ & జనరల్ ఎడ్యుకేషన్,విజయవాడ
(8) శారదా కళాశాల, విజయవాడ
(9) శ్రీ జాగర్లమూడి కోటేశ్వరరావుగారు, కారంచేడు
(10) రాజావాసిరెడ్డి వెంకటాద్రినాయనింగారి [అమరావతి]కళాశాలాధ్యాపకులు
(11) శ్రీ మోతుకూరి మాలకొండయ్యగారు [మంగళగిరి]
(12) వికాస విద్యాసంస్థలు, గుంటూరు
(13) విద్వాన్ రెసిడెన్షియల్ కళాశాల, గుంటూరు
(14) కృష్ణవేణి డిగ్రీకళాశాల, విజయవాడ
(15) బాపట్ల డిగ్రీకళాశాల, తెలుగు అధ్యాపకులు
(16) కాకాని వెంకటరత్నం కళాశాల, నందిగామ
(17) విక్రం పబ్లికేషన్స్, విజయవాడ
(18) వి జి.ఎస్. పబ్లికేషన్స్, విజయవాడ
(19) ఎ.యం జి. కాలేజి, చిలకలూరిపేట

వీరందరికీ కృతజ్ఞతాభివందనాలు
యార్లగడ్డ. బాలగంగాధరరావు
కార్యదర్శి

# ఆనందదాయకం

నిరంతర రచనా వ్యాసంగం పరిశోధనాన్వేషణాసక్తులకు పరమానంద మయితే వినూత్న విషయ జిజ్ఞాసువులకు అమృత సేవనం అవుతుంది. ఇది యిద్దరు మహాకవుల శతవత్సర జయంత్యుత్సవ వ్యాసాల సంపుటి.

అన్వేషణ మొదటి సంపుటి ఆనాటి తెలుగు శాఖాధ్యక్షులు ఆచార్య తూమాటి దొణప్పగారితో ఆరంభమయింది. దశాబ్ది అనంతరం ద్వితీయ సంపుటి వెలువరించే అవకాశం లభించింది. ఏటేటా ఒక సంపుటి వెలువరించాలనే సంకల్పం.

వట్టిమాటలకన్నా
గట్టిమేల్ మంచిది కదా!

ద్వితీయ సంపుటి అద్వితీయం కావడానికి నాగార్జున విశ్వవిద్యాలయ తొలి తెలుగు శాఖాధ్యక్షులు ఆచార్య తూమాటి దొణప్పగారికి అంకితం చేయడంకన్నా మాకు ఆనందమేముంది.

—కృపాచారి.

అధ్యక్షులు, తెలుగు ప్రాచ్యభాషా విభాగం

# రెండుమాటలు



మళ్ళీ ఇన్నాళ్ళకు తెలుగు ప్రాచ్యభాషావిభాగం పరిశోధన పత్రిక 'అన్వేషణ' ఈ రూపంలో ఈనాడు వెలుగు చూడడం చాలా ఆనందదాయకం. 1994 నవంబరు 16,17,18, 19 తేదీలలో 'విశ్వనాథ జాషువా' మహాకవుల శత జయంత్యుత్సవాల సాహిత్య సదస్సులో సమర్పించిన పత్రాల సంపుటీకరణమే ఈ గ్రంథం.

ప్రూఫులు దిద్దడం సులభమైన పనికాదు. మిత్రులు ఆనాటి శాఖాధ్యక్షులు సదస్సుకార్యదర్శి ఆచార్య వై. బాలగంగాధరరావుగారు నన్ను సదస్సు అధ్యక్షునిగా చేసి ఈ పనిచేయమని కోరగా నాశక్త్యనుసారం చేశాను. అయినా ముద్రణలో అక్కడక్కడా దొసగులు తప్పలేదు. సహృదయులు మన్నింతురుగాక.

ఆనాటి సభలకు ఆచార్య బాలగంగాధరరావుగారి కృషి, ఈనాటి శాఖాధ్యక్షులు ఆచార్య గుజ్జర్లమూడి కృపాచారిగారి ప్రయత్న ఫలితము మూలాన ఈ గ్రంథం వెలువడగలిగింది. ఇలాంటి 'అన్వేషణ' సంపుటాలు మరిన్ని రావాలని మనసారా ఆకాంక్షిస్తున్నాను. ఇది ఆచార్య తూమాటి దొణప్పగారికి అంకితమివ్వడం ఎంతో ముదావహం.

ఎస్. గంగప్ప
అధ్యక్షులు
పాఠ్యనిర్ణాయక సంఘం



నిరంతర పరిశోధనాన్వేషి
నిత్యసత్య గ్రంథరచనా విభూషి
నాగార్జున విశ్వవిద్యాలయం
తొలి తెలుగు శాఖాధిపతికి
ఆచార్య తూమాటి దొణప్ప గారికి
భక్తిశ్రద్ధలతో "అంకితం"

తెలుగు ప్రాచ్య భాషా విభాగం

అధ్యక్షోపన్యాసం

# శత వసంతాల విశ్వనాథ

డా॥ యం. ఆర్. అప్పారావు, M.A;D.Litt;

ఇది విశ్వనాథ శతజయంతి సంవత్సరం. కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు 1895 సెప్టెంబరు 10వ తేదీని జన్మించారు. 1976 అక్టోబరు 18న పరమపదించారు.

వేయి పున్నమలను (సహస్రచంద్రదర్శనోత్సవం) జరిపించుకొన్న మహావ్యక్తి. వారి సాహిత్య వ్యాసంగం సుమారు 70 సంవత్సరాలు విస్తరించింది.

మహా ప్రతిభాశాలి. అఖండపాండితీ సంపన్నులు. నిరంతర రచనా నిష్ఠలో ఆంధ్రసాహిత్యంలోని అన్ని ప్రక్రియలను పరిపుష్టం చేసిన సాటిలేని మహామనీషి. ఆరంభదశలో ఒడుదుడుకులు పాలైనవారి కుటుంబ జీవితం సాఫీగ జరిగి వారి సాహిత్యకృషి దశదిశల వ్యాపించడానికి వీలుగ మా తండ్రిగారు వేంకటాద్రి అప్పారావుగారు స్థాపించిన విజయవాడ S.R.R. కాలేజీలో అతికష్టంమీద ఆంధ్రోపన్యాసకులుగ చేరారు.

నేను బందరులో వారిని కలిసికొని మాట్లాడాను. వారు మొదట్లో కాలేజీలో చెరడానికి నిరాకరించారు. నేనే బలవంతంగా ఒప్పించి మీరు కాలేజీలో ఉంటేనే చాలు. మీరు మా కళాశాలలో ఉండటమే మాకు గర్వ కారణం అని అంటే వచ్చి చేరారు. ఆ తరువాత వారు ఎంత ప్రసిద్ధి పొందారో మీకు తెలుసు. ఈ విషయాన్ని ఎపుడూ వారు మరువలేదు. దానికి కృతజ్ఞతగా కాలేజి మా తండ్రిగారి దివ్యస్మృతికి చిహ్నంగా 1975 లో గోలోకవాసి అనే కావ్యాన్ని వెలయించారు. అంతకు పూర్వమే వారు 'అనార్కలీ' అనే నాటకాన్ని శ్రీరామచంద్ర అప్పారావుగారికి అంకితం ఇచ్చారు. 'మా బాబు' అనే నవలని నాకు కృతి ఇచ్చారు.

వారి మాట వజ్రంలాగ పరుషంగా ఉండొచ్చు ... వారిది నవనీత హృదయం. ఈ సంగతి ఆయనకి అతి సన్నిహితులైన ... శిష్యులకు, వారివలన ఉపకారాల్ని పొందిన అపుడు ఈ విషయం అనుభవం కావచ్చు.

శ్రీ విశ్వనాథవారు సాహిత్యంలో పద్యం, గద్యం, గేయం, నాటకం, నవల మొదలైన అన్ని ప్రక్రియల్ని చేపట్టారు. పట్టిన ప్రతిక్రియ బంగారం చేశారు. 50 సంవత్సరాలకు పూర్వమే ఆయన మహాకవిగా కీర్తింపబడ్డారు.

వారు శతాధిక గ్రంథకర్త. ఆంధ్రపౌరుషం, ఆంధ్రప్రశస్తి, ఋతు సంహారం, మాస్వామి, శ్రీకృష్ణసంగీతం, ప్రద్యుమ్నోదయం లాంటి ఎన్నో లఘుకావ్యాల్ని రాశారు.

నర్తనశాల, వేనరాజు, ధన్యకైలాసం లాంటి అనేక నాటకాల్ని రాశారు.

చెలియలికట్ట, ఏకవీర, స్వర్గానికి నిచ్చెనలు, తెఱచిరాజు, ప్రోయు తుమ్మెద,సముద్రపు దిబ్బవంటి సుమారు 60 నవలల్ని నన్నయగా పసన్న కథాకవితార్థయుక్తి, అల్లసానివానిఅల్లిక జిగిబిగి, శాకుంతలంలోని అభిజ్ఞానత, ఒకడు నాచనసోమన్న వంటి విమర్శ గ్రంథాల్ని రాశారు.

వారు తమ రచనల్ని తొలిరోజుల్లో సొంతంగా రాసుకున్నారేగాని మిగిలిన అన్నిటిని భావుకులైన స్నేహితులు రాస్తూఉంటే డిక్టేట్‌చేశారు. వారికి అలా వ్రాయసకాండ్రుగా పనిచేసినవారిలో శ్రీ విశ్వనాథ వెంకటేశ్వర్లు, శ్రీ పేరాల భరతశర్మ, శ్రీ గౌతమరావు మొదలైన వారెందరో ఉన్నారు.

విశ్వనాథవారు సంస్కృతాంధ్ర సాహిత్యాల్ని జీర్ణింపజేసుకొన్నవారు. పాశ్చాత్యవాఙ్మయాన్ని ఆకళించుకొన్నారు. ఆధునిక నాగరికతలోని ప్రతి అంశాన్ని నిశితదృష్టితో పరిశీలించినవారు.

చెప్పదలచుకొన్న విషయాన్ని వారు స్పష్టంగ, గాఢంగ పలకడానికి వీలైనట్లుగ ఒక శిల్పంగా రూపొందించుకోవడంలో కృతకృత్యులయ్యారు.

మహావేగంతో పోయే వారి భావతీవ్రత శబ్దాన్ని ఎన్నుకోవడానికి అందదని వారే తమ కల్పవృక్ష కావ్యంలో పేర్కొన్నారు. చివరిరోజుల్లో నవలల్ని కేసెట్‌కి డిక్టేట్ చేసేవారట

వారు రాసిన సంస్కృతరూపకాలు గుప్తపాశుపత, అమృతశర్మిష్ఠలు అఖిలభారత ప్రాశస్త్యాన్ని పొందాయి.

What is Ramayana? అనే వారి ఆంగ్లరచన సాహిత్యంలో చాలా ప్రసిద్ధి పొందింది.

విశ్వనాథవారి మధ్యాక్కఱలకీ కేంద్ర సాహిత్య అకాడమీ బహుమతి లభిస్తే శ్రీ మద్రామాయణ కల్పవృక్షానికి జ్ఞానపీఠ బహుమతి 1971లో వచ్చింది. 1933లో కవిసమ్రాట్‌గా బందరులో గౌరవింపబడిన విశ్వనాథకు ఎన్నెన్నో గౌరవాలు జరిగాయి.

ఆంధ్రాయూనివర్శిటీ కళాప్రపూర్ణతో వారిని గౌరవించింది. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం D. Litt. తో సత్కరించింది. ఆంధ్ర సాహిత్య అకాడమీకి ఆయన కొంతకాలం ఉపాధ్యక్షులుగా ఉన్నారు. కరీంనగర్ కాలేజీ ప్రిన్సిపాల్‌గా వ్యవహరించారు.

వారు లెజిస్లేటివ్ కౌన్సిలు సభ్యులుగా నామినేట్ చేయబడ్డారు. ఇలా ఆయన అనేక గౌరవాల్ని పొందారు.

ఆంధ్రప్రభుత్వ ఆస్థానకవిగా అపూర్వ గౌరవాన్ని పొందారు.

ఈ గౌరవాలన్నీ సార్థకాలే. అవన్నీ వారిని వరించి వచ్చినవే.

తెలుగుకవికి ఒక నిరంకుశత్వాన్ని నేర్పిపోయిన గొప్పవాడు. ఆయన ఎవరికీ తలవంచలేదు. సహృదయ హృదయాలన్నీ ఆయన్ని ఆరాధించాయి.

ఆయన రాసిన ప్రతిరచన దేనికదే ఒక జాతిరత్నం. ప్రతి తలపు తనది. ప్రతి పద్యమూ భావశిల్పబంధురమే.

విశ్వనాథవారు అనగానే అన్య ప్రాంతీయులకు కూడా స్ఫురించే మహా రచనలు రెండు. వేయిపడగలు, శ్రీమద్రామాయణ కల్పవృక్షం.

మొదటిది ఒక మహాబృహత్‌గద్యకావ్యం. 27 రోజుల్లో అఖండ నిష్ఠతో సోదరుడికి చెప్పి వ్రాయించారు.

భారతీయ సంస్కృతికి అది నిలువుటద్దమే. ఆధునిక నాగరికతా వ్యామోహంలో తనని తన సర్వస్వాన్ని కోల్పోతున్న సమయంలో ఒక భావుకుడు నిస్సహాయుడై విడిచిన నిట్టూర్పు అది. అయినా ఈ చిరకాల సంప్రదాయం ఎన్ని తుఫానులకైనా నిలువద్రొక్కుకొని నిలుస్తుందన్న విశ్వాసాన్ని ప్రకటించిన రచన వేయిపడగలు.

రాజు, మంత్రి, ప్రజలు ఒక్కటిగా ఆనందమయ జీవనాన్ని సాగించిన పురాతన మధురదృశ్యం కాలపురుషుని హేలలో ఏ విధంగా చెదిరిపోయినదీ ఈ వేయి పడగలలో చక్కగా చిత్రింపబడింది.

కృష్ణమనాయుడు రాజు. రామేశ్వరశాస్త్రి దివాను, ఇది వ్యవహారములో మాత్రమే తాదాత్మ్యముతో అభేదముతో మెలగిన అరాజు- దివాను ప్రజా సంక్షేమాన్ని ధర్మోజ్జ్వలంగా నిర్వహించారు. అదే సంప్రదాయము హరప్ప దర్మాగ్రావులపట్లకూడ కొనసాగినది. ఇది ఇందలి సంస్కృతి ప్రతిబింబానికి మచ్చుతునక.

వేయిపడగలు కాళహస్తిమాహాత్మ్యం ఛాయలో ఉన్నట్లుగాచెప్పవచ్చు. ఇందు గోవు చాల ప్రాముఖ్యం వహించింది. పేదవాడైన ఒక కాపు దగ్గర కపిలగోవు ఉన్నది. అది అడవిలో రోజూ ఒక పుట్ట దగ్గరకు వెళ్ళి ఒక సర్పానికి పాలు ఇచ్చేది. ఆ సర్పం మొదటిరోజు ఒక తలతోను, రెండవ రోజు రెండుతలలతోను అట్లా వేయిపడగలు విప్పి పాలు త్రాగింది. అందుకని దానిమీదే ఆధారపడ్డ ఆ కాపు ఒక యోగినిని అభయం కోరగా ఆమె ఆశీర్వదించింది. ఆ స్థల మాహాత్మ్యం అందరికి తెలిపింది. గుడిగోపురాలు అక్కడ ఏమియును లేవు. జబ్బుతో సందర్శించిన రోగికి స్వస్థత చేకూరింది. ధనవంతుడైన సంతానహీనునికి సంతానప్రాప్తి కలిగింది. ఈమాహాత్మ్యంతో ధనవంతుడు అక్కడ ఆలయం నిర్మించి విగ్రహప్రతిష్ఠ చేశాడు.

ఈ వృత్తాంతం ప్రాధాన్యం వహించడంతో దీనికి వేయిపడగలు అను పేరు సార్థకం అయింది. ఒక్కమాటలో చెప్పాలంటే ఇలాటి కావ్యం నభూతో నభవిష్యతి.

మన నేటి ప్రధానమంత్రి గౌ. శ్రీ పి. వి. నరసింహారావుగారు సహస్ర ఫణ్' అనుపేరుతో దీనిని హిందీలోకి అనువదించి పురస్కారములను పొందినారు.

రెండవది శ్రీమద్రామాయణ కల్పవృక్షం. తంత్రి ఆజ. జీవుని వేదన ఒక్కటి కాగా సుమారు 30 సంవత్సరాలు నిర్మించిన మహాకావ్యరాజం. ఇందు సుమారు 12 వేల పద్యాలు ఉన్నాయి. కవీశ్వరులు చింపివేసిన పద్యాలే కొన్నివేలట,

"నా సుకలోహ వైభవ సనాథము" అని ఈ కల్పవృక్షాన్ని గురించి ఆయనే చెప్పుకొన్నారు. వాల్మీకి రామాయణానికి ఒక భాష్యం లాంటిది ఈ కల్పవృక్షం. ఛందోవైవిధ్యంలో, అపూర్వ శిల్పంతో, అద్వైత దర్శనంలో అజరామరమై నిలిచిపోవు మహాకావ్యం కల్పవృక్షం.

వాల్మీకి రచనతో కైకగురించి దుర్మార్గురాలుగా ఊహపోహ చెందవచ్చు. విశ్వనాథవారు కైకను కారణజన్మురాలుగా చిత్రించారు. దుష్టదానవ సంహరణార్థమై జన్మించిన అవతారపురుషునిగా రాముని ఎఱిగి ఆమె నిమిత్తమాత్రంగా రాముని వనవాసం, భరతుని పట్టాభిషేకం కోరిందేగాని స్వార్థపూరిత వాంఛ కాదది. రామచంద్రుడుకూడా ఆమెను భక్తితో మాతృమూర్తిగా గౌరవించాడు కదా!

కల్పవృక్షంలో కైక సవతి తల్లిలా కాకుండా, దేవతల కార్యాన్ని సాధించడానికి తానొక సాధనమై రాముణ్ణి అడవికి పంపింది. లోన ప్రేమ ఉంచుకొని, అసూయాగ్రస్తవలె కనబడింది. ఒక ఉన్నతాశయానికి తన వ్యక్తిత్వాన్ని, ప్రతిష్ఠను బలిపెట్టింది. ఈ సత్యాన్ని విశ్వనాథవారు తన కల్పవృక్షంలో నిరూపించారు.

విశ్వామిత్రుడు క్రతు సంరక్షణార్థమై రాముణ్ణి తనతో పంపమని కోరాడు. కైక రాముణ్ణి వనవాసానికి పంపవలసిందిగా కోరుతుంది. అప్పుడు దశరథుడు—

రాముఁడు నాకు స్నానముగు
  రాముఁడు నాకు జపంబు ధ్యానమున్
రాముఁడె యెల్ల నా బ్రతుకు
  రాముడు( నన్నును గన్నతండ్రి యీ
రాము వినా నిమేషమున్నరా!
  మనజాలను....................

—(బాల. ఖం. అహల్య-33,
అయోధ్యాఖండం-అభిషేక-217)

ఇక్కడ విశ్వనాథవారు తన మనోభావాన్ని దశరథునిద్వారా పలికించినట్లుగా భావించవచ్చు. అహల్యా శాపవిమోచన సందర్భంలో శ్రీరామ

చంద్రుని దివ్యప్రభావాన్ని తన్మయుడై వర్ణించి సాక్షాత్కరించుకొన్నాడు. దాశరథి రాతిని నాతిగా చేసినప్పటి కవీశ్వరుని కల్పన అపూర్వము గదా!

సీ. ప్రభుమేనిపై గాలిపై వచ్చినంతనే
పాషాణ మొకటికి స్పర్శవచ్చె
ప్రభుకాలి సవ్వడి ప్రాంతమైనంతనే
శిలకొక్కదానికి చెవులు గలిగె
ప్రభుమేని నెత్తావి పరిమళించిన తోన
యశ్మంబు ఘ్రాణేంద్రియంబు జెందె
ప్రభునీల రత్నతోరణ మంజులాంగంబు
గనవచ్చి ఆరాతికి కనులుగలిగె

ఆ ప్రభుండు వచ్చి యాతిధ్యమును స్వీక
రించ నంత నుపల హృదయ వీధి
నుపనిషద్వితాన మొలికి శ్రీరామ భ
ద్రాభిరామమూర్తి యగుచు తోచె.

ఈ విధమగు మధురోహలు అనంతములు. కవిత్రయ భారతానికి, పోతన భాగవతానికి సరసన నిలుపదగిన కావ్యం శ్రీమద్రామాయణ కల్పవృక్షం. చిన్ననాట వారు రచించిన ఏకవీర, కిన్నెరసాని పాటలు మధురాతి మధురాలు. అవి తెలుగువారికి ప్రీతిపాత్రాలు.

అత్త అరడికి, భర్త మెత్తదనానికీ నడుమ నిలువలేక కరగి సురిగి పోయిన తెలుగుపడుచు ఉద్విగ్న హృదయమైనదిగా జాలువారిన కథనే తమ కిన్నెరసాని పాటలలో అత్యంత మనోహరంగా, మృదుమధురంగా వెలువరించారు విశ్వనాథవారు.

కిన్నెరసాని నడకల కులుకులతో పందెం వేసినట్లు సుందరంగా సాగే రీతిలో ఈపాటలు రూపొందాయి.

కదలగా కదలగా కాంతకిన్నెరసాని
పరువు కట్టినవేళ కదుపులా తోచింది
కదలు తెల్లని పూలనదిలోనె కదిలింది
తరలు తెల్లన్నిత్రాచు పడగలా విరిసింది

జలదేవతలవెంట సాగి కిన్నెరసాని
తెలితారకల వెంట వెలుగులా తోచింది
తలిరు పూవులవెంట తావిలాతోచింది
తెనుగుపాటలవెంట తేనెలా తేలింది

కులకాంతలను చెరపట్టే కామాంధుడుగా అవతరించిన కడలిరాజు బారినుండి గోదావరిమాత కిన్నెరను తన కడుపులో పెట్టుకొని కాపాడిందట. తెలుగు దైవమ్ము భద్రాద్రిపై నెలకొన్న రామయ్య దర్శనముతోనే త్రోవకాంచింది కిన్నెరా అంటుముగిస్తారు కవిసమ్రాట్టులు.

ఈ పాటలన్నీ తెలుగువారికి ప్రీతిపాత్రాలు.

ప్రతిభాపాండిత్యాలు, సత్యతత్పరత ఒక మహాతపస్సుగా జ్వలించి విశ్వనాథ సాహిత్యసృష్టికి కారణాలయ్యాయి.

ఆయనికి తెలుగుజాతి ఎంతో ఋణపడి ఉంది. ఆయనకు నా జోహార్లు.



# జాషువా కవితాత్మ

—ఆచార్య ఎస్ గంగప్ప

రాజు మరణించె నొక తార రాలిపోయె
కవియు మరణించె నొకతార గగనమెక్కె
రాజు జీవించె రాతి విగ్రహములందు
సుకవి జీవించె ప్రజల నాలుకలయందు.

రాజు చేతికత్తి రక్తంబు వర్షించు
సుకవి చేతికలము సుధలుగురియు
అతడేలగలుగు భావప్రపంచంబు
నీతడేలగిలుగు ఇహము పరము

(క్రొత్తలోకము - 2)

ఇవి మహాకవి జాషువా పల్కులు. మహాకవికి మరణంలేదు. కలంతో సుధలు గురిపించే ఆ మహాకవి అమరుడు. ఉల్కాపాతమైనపుడు ఎవరో మహావ్యక్తి జీవితం ముగిసిందని భావిస్తాము. అలాగే రాజు మరణిస్తే నక్షత్రం రాలిపోవచ్చుగాక. కానీ కవి మరణిస్తే కవిత్వ జగత్తులో ఆ కవి సంపాదించిన యశఃకాయంతో చిరకాలం ఆకాశంలో ధ్రువ తారలా నిలిచి ఉంటాడు. రాజుగారు చేసిన ఘనకార్యాలకు రాతివిగ్రహమో కాంశ్యవిగ్రహమో భూమిమీద నిలిచిపోవచ్చు. కానీ మహాకవి వాక్కు ప్రజలలో జీవిస్తుంది. రాజు చేతికత్తికంటె కవి చేతికలం గొప్పది. కత్తి రక్తం చిందుతుంది. కవి కలం అమృతం గురుస్తుంది. అందుకే "సుకవితా యద్యస్తి రాజ్యేనకిమ్" అనే ఆభాణకం వచ్చింది.

నవయుగ కవిచక్రవర్తి జాషువా కురిపించిన కవితాసుధ మనమీనాడు గ్రోలుతున్నాము. ఏనాటికైనా అది అలా తాజాగా, పసందుగా విందు చేయ గలదు. జాషువా తాను పుట్టిపెరిగిన సమాజంలో తాననుభవించిన అనుభవాల మూలంగ తన కవితాసుధ గురిపించారు. అవి సుధలేగాని అవి వేడిగా వాడిగా ఉండి ప్రజలను జాగృతం చేయజాలినవిగా ఉండటం విశేషం.

తాను దారిద్ర్యంలో పుట్టిపెరిగి తదనుభూతిని పొంది ఉన్నాడు. దారిద్ర్యానికి తోడు అస్పృశ్యతా రాక్షసి కోరలకు ఎరలవుతూన్న తోటి ప్రజలను చూసి ఎదరగిలి తనమాటలు కవితలయ్యాయి. ఆనాటి సాంఘికార్థిక అసమానతల్ని చూసి భరించలేకపోయాడు. వర్ణవ్యవస్థలో ఉన్న లొసుగును గుర్తించాడు. ఆర్తి చెందాడు. ఆవేదన చెందాడు. ఆర్తి కవితగా మారింది. తన హృదయాన్ని ఆవిష్కరించాడుమధురకవితలో. వర్ణవ్యవస్థపై తిరుగుబాటు చేసి దారిద్ర్యమొకపక్క, అస్పృశ్యత మరోపక్కా పీడిస్తూ ఉంటే తట్టుకోలేక పోయాడు. సంప్రదాయరీతిలో తాను చదివి తెలుసుకొన్న వాటిపై విప్లవించాడు తన విప్లవం ఎవరికీ ఏనాడు బాధకలిగించలేదు. సరికదా!కాదు తన మాటలతో సంప్రదాయబద్ధుల్ని నిలదీసి అడిగినప్పుడు వారు సైతం తలఊపక పోలేదు. ఇలాగని దుయ్యబట్టడం, ఎండగట్టడం అనేవి జాషువా లక్ష్యం తన ప్రజలబాధ ప్రచారంకోసం కాదు. హృదయపుకోతను కవిత ద్వారా ఆవిష్కరించడమే ముఖ్యం. తన బాధ, తన ప్రజలస్పందన తన స్పందన తన వారందరికీ తాను ప్రతినిధి జాషువా. అంతమాత్రంచేత కేవలం తన ఆవేదనని మాత్రం చెప్పడం కాదు. లలిత సౌకుమార్యాలతో, మధుర మోహనంగా ఆవిష్కరించడమే జాషువా కవితా విశిష్టత. అనల్పకల్పనా వైభవంతో జాషువా కవితావధూటి పరవళ్ళు తొక్కినా, శిల్పసౌందర్యంతో, సహజ వైవిధ్యంతో ఒప్పారడమే దాని నైజ స్వరూపం. సమాజంలో ఒక భాగమైన పంచములను అస్పృశ్యులుగా భావించి అలా పరిగణించడం సభ్యసమాజానికి మాయనిమచ్చ. నాగరిక జాతిలోని అనాగరిక లక్షణం- అట్టడుగు బడుగుజీవులను అణచిపెట్టడం అన్యాయం, అమానుషం. అందుకే అస్పృశ్యతను తొలగించి మానవతా దృక్పథంతో అందరూ సమానులనే అంశాన్ని గ్రహించి సమసమాజం- హెచ్చుతగ్గులులేని సమాజం-స్థాపించడమే జాషువా కోరుకున్న మహత్తరమైన కోరిక; అది వారి మానవతా దృక్పథం.

ఏవంవిధ గుణ విశిష్టమైన జాషువా కవితా కామనీయకం, అభివ్యక్తి శబ్దభావచిత్ర కవితా వైవిధ్యం ప్రపథమంగా ఆస్వాదయోగ్యాలు. జాషువా కవితలో భావుకత భవ్యమూ నవ్యమేగాదు హృద్యం గూడా! భావుకత అనల్పకల్పనా శిల్పవైభవంతో ఒప్పారుతూంది. భావుకతకు తగ్గ భావన,

భావనను అభివ్యక్తీకరించే భాష సహజసుందరమై, అనన్యసామాన్యమై ఒప్పారుతుంటాయి. తద్వారా జాషువా వర్ణనావైదగ్ధ్యం స్పష్టమవుతుంది.

సంజకెంజాయలో జలకంబు సవరించి
పఱతెంచు సూర్యబింబమ్ములోన
పదునాఱు దినముల పరువు వచ్చిననాటి
చంద్రుని ధవళ హాసములలోన
పూలతోటల తోడ ముద్దుముచ్చట చెప్పి
చెఱలాడు మొలక తెమ్మెరలలోన
నీలిమేఘంబుల నెఱియలలో గుల్కి
పఱువెత్తు మెఱపు గర్భములలోన
హాయిగా బవ్వళించి బ్రహ్మాండములను
బల్కరించుచు నున్న దివ్యస్వరూప
హృదయమును జీల్చి పూజలర్పించుకొందు
నందుకొనిపొమ్ము, వ్యవధి లేదనక రమ్ము.
(ఫిరదౌసి పు. 23)

అద్భుతవర్ణన, అనన్య సామాన్య మా భావుకత. అభివ్యక్తి అనితరసాధ్యం. భావం, భావన, భాష మూడు ముప్పిరిగొన్నాయి. ఆ మహాకవి ప్రతిభా పాటవానికి ఇంతకంటె నిదర్శనమవసరమా? ఉదయిస్తున్న సూర్యబింబంలో రాకాసుధాకరునిలో, పూలపరిమళాల్లో, చెరలాడుతున్న పిల్లగాడ్పుల్లో, కారు మేమాల్లో తళుక్కున మెరిసిపోయే సౌధామినిలో హాయిగా పవ్వళించి ఉన్నాడట దివ్యస్వరూపుడైన పరమాత్మ. జాషువా కవిత్వమహత్వం స్పష్టమవుతుంది. సంజకెంజాయలో సూర్యుడు జలకమాడాడట! పదహారు కళలతో సంపూర్ణుడైన పున్నమినాటి చంద్రుని తెల్లని వెన్నెలట. పూలతోటలో ముద్దుముచ్చటలాడి విహరిస్తున్న మొలకతెమ్మెరలట! నీలిమేఘాల్లోని నెరియల్లో కులికి పరిగెత్తే మెరపట! ఇంత నూతనంగా అపూర్వంగా అభివ్యక్తీకరించిన కవులెందరు గలరు? పైగా సీసపద్యరచనలోని నడక, తూగు, ఒయ్యారం, అంతకుమించి ప్రతిపాద సమతావైభవం మొదలైన అంశాలగూర్చి ఎంతని వర్ణిస్తే మనం సంపూర్ణంగా జాషువాకు న్యాయం చేకూర్చగలము?

ఇలాగే ముంతాజ్, షాజహాన్ల దాంపత్య జీవితంలోని పరమమధుర ప్రణయాన్ని వ్యతిరేకభావవైవిధ్య వ్యక్తీకరణతో మనోహరంగా వర్ణించిన తీరు అనితరసాధ్యం.

ఆ సతీపతుల గాఢాశ్లేషములనుండి
జారిపోయిన నిమేషంబులేదు,
ఆ దంపతులకు ఆహ్లాదంబుగూర్పక
తొలగిన వెన్నెలఁతునకలేదు
ఆ ప్రేమజీవుల యనురాగ వృద్ధికై
రుతిమొనర్పని పరభృతములేదు
ఆ శుభాకృతుల నెయ్యంపు ముద్దులచేత
తీపికెక్కని ద్రాక్షతీగలేదు
ఆవధిలేని వారి ఆనందకేళికి
తోడుపడని పూలతోటలేదు
వారికూర్మి పెంపువలచి వర్ణనచేసి
సుప్రసిద్ధిగనని సుకవిలేదు (ముంతాజ్‌మహల్)

చివరికి నవయుగకవి చక్రవర్తి జాషువా సైతం వారి ప్రణయాన్ని వర్ణించి సుకవిగా సుప్రసిద్ధుడయ్యాడు.

భావనవ్యతను వ్యక్తీకరించే అభివ్యక్తిలోని నవ్యాతినవ్యత పరిశీలిస్తే జాషువా పదప్రయోగ వైశిష్ట్యం స్పష్టమవుతుంది. ఒలికిపోయిన పండు వెన్నెలల పాలుద్రోలుచున్నది. కుపితచకోరంబు, సీమగుడ్లకు కన్నులు చెమ్మగిల్లె, ముతకబట్టకు మర్యాదపొటమరించె, సాత్వికాహారిణీ తపశ్చర్యకతన నీ మనంబున జాలివెన్నెలరహించు (గబ్బిలం). ఇలాగే ఫిరదౌసి కావ్యంలో ఫిరదౌసి ఆవేదనను, బాధను ప్రకృతితో సమ్మిళిత మొనర్చి వర్ణించిన తీరు అమోఘం.

తనకళ్యాణియు గూతురున్ జటుల కాంతారంబులం బాదచా
రిణులై వచ్చుట జూడఁజాలక కవిశ్రేష్ఠుండు వర్షించు వె
చ్చని కన్నీటికి గారణంబగు మహీశమ్మన్యునింబండ్లు నూ
ఱిన యట్లంబర వీథియం దురిమి యార్చెం గర్భిణీమేఘముల్.

వర్షించు వెచ్చని కన్నీరు, పండ్లునూరినట్లురిమి యార్చడం, గర్భిణీమేఘముల్ అనే ప్రయోగాలలోని అభివ్యక్తి విశిష్టమైంది.

పూర్వోక్తమైనట్లు సాంఘికార్థిక అసమానతవల్ల, అస్పృశ్యతా రాక్షసి కోరల్లో నలిగిపోయిన జాషువా నాటి సమాజంలో వర్ణవ్యవస్థ మీద కోపోద్రిక్తుడైన మాట వాస్తవం ! నిజానికి తన కోపతాపాల్ని యితరులకు బాధ కలిగించేలాకాక విన్నవెంటనే నిజమేనని ఆలోచింపచేసే తీరులో కవిత్వమనే ఆయుధాన్ని ప్రయోగించి సమాజ రుగ్మతల్ని నరకడానికి యత్నించాడు. గాంధీజీ దక్షిణాఫ్రికాలో మొదటి తరగతి టిక్కెటు కొన్నప్పటికీ తెల్లదొరల జాతి వివక్షకు గురియైనందున తిరుగుబాటుచేసి 'మహాత్మ' అయ్యాడు. అంబేద్కర్ కులం తక్కువని పెట్టె బేడ వీధిలోకి గిరాటువేయబడి నెట్టివేయబడటంతో పట్టుదలతో మహావేత్త కాగలిగి కులవ్యవస్థను నిర్మూలించ నడుముకట్టి మహామేధావి అయ్యాడు. అలానే కులం తక్కువని తన కవితను ఈసడించుకోగా, జాషువా కవితకు కులం లేదని నిరూపించటానికి 'గబ్బిలం' మొదలైన ఉత్తమ కవితల్లో మహాకవిగా, నవయుగకవి చక్రవర్తిగా ప్రసిద్ధికెక్కాడు. కులమన్నది మానవకల్పితము- చతుర్వర్ణాలు వృత్తిని బట్టి వచ్చినవేకాని స్వార్థపరులు దీనినుపయోగించుకొన్నారు. మానవులంతా పుట్టుకతో ఒక్కటే. కాని సమాజంలో తక్కువచేసి పంచములని వేలెత్తి చూపుతూ, అణచివేయగా సహించలేని జాషువా హృదయం రగిలింది.

ముసలివాడైన బ్రహ్మకుపుట్టినారు
నల్వురు కుమారులను మాటవిన్నాముగాని
పసరము కన్న హీనుడభాగ్యుడైన
ఐదవకులస్థుడెవరమ్మా సవిత్రి? (ఖండకావ్యం - 2)

ఈ నాలుగు వర్ణాలు నాలుగు పడగలట. ఆ నాలుగు పడగల నాగరాజు పంచముని జూచికాదు, వాని గాలిసోకితేనే కసరి బుసకొట్టుతుందట.

'ఆయభాగ్యుని రక్తంబు నాహరించి
యినుపగజ్జెల తల్లి జీవనముసేయు
కసరి బుసకొట్టు నాతని గాలిసోక
నాల్గుపడగల-హైందవ నాగరాజు'-

నిమ్న జాతులన్నీ జాగృతమై చైతన్యవంతమవుతున్నాయనీ ఇది చాలా విపత్కర పరిస్థితిని కల్పిస్తుందనీ భావించి తన్నివారణార్థం మహాత్ముడు జన్మించాడని వివరించారు జాషువా.

నిమ్నజాతుల కన్నీటి నీరదములు
పిడుగులై దేశమును గాల్చివేయుననుచు
రాట్నమును దుడ్డుకఱ్ఱ కరాన బూని
దెసలదోతెంచె గుజరాతు ముసలిసెట్టి (గబ్బిలం-54)

పంచముల కన్నీరనే మేఘాలు, పిడుగుల్లా దేశ నాశనానికి కారణ మవుతాయని తన్నివారణార్థమే అహింసామూర్తి మహాత్మ జన్మించాడని వివరించడం సముచితమే.

అభాగ్యుడైన అస్పృశ్యుని వేదన జాషువా వేదన. ప్రశాంతరాత్రి లోకాన్నంతటిని బుజ్జగించు నిద్రపుచ్చుకొందట. కాని అంటరానితనను దురదృష్టవశాన "ఔషధంబులేని యస్పృశ్యతా జాడ్య, మందభాగ్య వన్ను మఱచిపోయె"నని వాపోతాడు. ఈలాంటి తనకు భార్యవల్ల కలిగే సంతానాన్ని మళ్ళీ ఈ అస్పృశ్యతా కూపంలోనే పడవోయటం సముచితంగాదని బ్రహ్మ చర్యదీక్షబూనిన ఉత్తముడు-

"కులములేని నేను కొడుకులం బుట్టించి
యీ యఖాతమందె త్రోయవలెనె?
భార్యయేల పుట్టుబానిసగని వాడు
జరుపసాగె బ్రహ్మచర్యదీక్ష"—

ఇందులో మనం గమనించవలసిన జాషువా ఔన్నత్యం విదితమవు తుంది. అంటరానితనంవల్ల అణగారిపోతూన్న సోదరుల దుస్థితినిచూసి ఎవరి పైనా కక్ష సాధించలేదు; పైగా సామాజిక రుగ్మత అయిన అంటరానితనం నిర్మూలనానికి మేధావులు ఆలోచించి ఆచరించవలసిన అవసరాన్ని వివ రించాడు జాషువా మహాకవి.

"కర్మ సిద్ధాంతమున నోరుకట్టివేసి
స్వార్థలోలురు నాభుక్తిననుభవింత్రు
కర్మమననేమొ? దానికీకక్షయేమొ?
ఈశ్వరుని చేత ఋజువు చేయించవమ్మ"–

అని మాత్రమే గబ్బిలంతో అడుగుమని మనవి చేసుకుంటున్నారీ మహాకవి-

నిరుపేదల బాధల గూర్చి, ఆ పేదలు అనుభవించే దారిద్ర్యాన్ని గూర్చి పలువిధాలుగా జాషువా హృదయం ఆక్రోశించింది. భగవంతుని నిలదీసి అడుగుతున్నాడు. నీకేలనల పక్షపాతమని, సమస్త ప్రాణికోటిని మృత్యువునకాహారం చేశావుగదా ! మరి అలాంటి దయాపరుడవైన నీవు నిరుపేదకు బొక్కెడు కూడొసంగలేకపోయావా ? అని జాషువా మానవతా దృక్పథంతో పలికిస్తున్నాడు.

"బత్తెము చేసినావుగద ప్రాణులనెల్ల దయావిహీనమౌ
మిత్తికి హాయిగా సకలమేదిని మీద నిరంకుశంబుగా
పెత్తన మాచరించెడి నిరుపేదకు బొక్కెడుకూడొసంగనీ
చిత్తము సమ్మతింపదా? విచిత్రమునీ వలపక్షపాతముల్"
(కొత్తలోకము-40)

తిన తిండిలేక ఎండిపోతున్న, అలమటించిపోతున్న బీదలపాట్లు గమనించి సంపన్నులెవరూ మెదుకు విదల్చలేదనీ, విగ్రహాలకు సీతారాములనీ ఇంకొకటనీ పేరుపెట్టి వాటిని ఆరాధిస్తూ ఎంతైనా ధనవ్యయం చేయగల సంపన్నులీభారతీయులని, ముప్పదిమూడుకోట్ల దేవతలెగబడ్డ ఈ దేశంలో దురదృష్టవంతులైన పేదల ఆకలిచల్లారుతుందా? అని హేతువాదపురస్సరంగా మానవతా దృక్పథంతో ఆవేదన పడ్డారీ మహాకవి.

ప్రతిమల పెండ్లిచేయుటకు వందలువేలు వ్యయించుగాని దుః
ఖితసుతులైన పేదల పకీరుల శూన్యములైన పాత్రలన్
మెతుకు విదల్పదీ భరతమేదిని, ముప్పదిమూడుకోట్ల దే
వతలెగబడ్డ దేశమున భాగ్యవిహీనుల క్షుత్తులారునే ?
(గబ్బిలం–16)

ఆధునికయుగంలో మహిళాభ్యుదయానికి పాటుపడ్డ మహనీయులెందరో వెలిశారు. మనదేశంలో రాజారామ్మోహనరాయ్, కందుకూరి వీరేశలింగం పంతులు, గురజాడ అప్పారావు ప్రభృతులు పేర్కొనదగ్గవారు. జాషువా సైతం మహిళలకు పురుషాధిపత్యం వల్లనైతేనేమి, పురుషాహంకారం వల్లనైతేనేమి జరిగే అన్యాయాలను ఖండించినారు. స్త్రీలపట్ల చూపించే వివక్షను నిరసించారు. స్త్రీ అబలకాదనీ, సబల అనీ నిరూపించుకోవాలని ప్రబోధించారు పురుషాధిపత్యాన్ని విడనాడి సమాన గౌరవంతో సత్కరించి నపుడే మానవుని మనుగడ మహోన్నతం కాగలదని విషణ్ణహృదయంతో వివరించారు.

"స్త్రీకన్నన్ పురుషుండు శ్రేష్ఠుడనుచున్ సిద్ధాంతముల్ చేసి తా
టాకుల్ కంఠమునెత్తి స్త్రీజగతి కన్యాయంబు గావించెనో
యే కాలంబున పుట్టినింటనయినలేక నాటి స్వాతంత్ర్యముల్
స్త్రీ, కీమారు సమాన గౌరవ విభూతిన్ గాంతకుం గూర్చుమా

(కొత్తలోకం-26)

ఇలాంటి దుస్థితినుంచి, పురుషాధిపత్యానికి లోనుగాకుండ సర్వతంత్ర స్వతంత్ర కావాలని మహిళకు ప్రబోధం చేశాడు.

"అమ్మా! భారతనారి! నీ కడుపునందావిర్భవంబంది నీ
బొమ్మల్ బిండి సుఖించు పురుషుల నింకెన్నాళ్ళు సేవించి కా
లమ్మున్ వ్యర్థము చేసికొందువు? కరాళ స్వార్థ ధర్మాలలో
గమ్మత్తున్ గనిపెట్టి స్త్రీజగము దుఃఖంబున్నివారింపుమా!"

(వంచిత-ఖండకావ్యం-5వ భాగం)

వలపుల రాణిగా, చిలుకపల్కుల వాణిగా, స్త్రీని పొగడి, ఆకాశానికెత్తి తమ పబ్బం తీర్చుకొంటారు పురుషులనీ, నీ తనుమానసాలను బాధించి, వేదించి నీకేదో ఉపకారం చేసినట్లు భావిస్తారు పురుషపుంగవులనీ, ఈ మోసాలకు లోనుకావద్దనీ, ఎన్నాళ్ళీ కుహనాహర్షాలనీ, వ్యథాభరిత మనస్సుతో వాపోతారు జాషువా మహాకవి.

"నిన్నాకాశము దాకగా బొగడుచున్ నీయందచందాలలో
వన్నెల్ దీర్చి కవిత్వ మల్లుకొనుగాన్ పైపై పరామర్శలన్
నిన్నున్ నీదు శరీరమున్ హృదయమున్ ఛేదించి వేధించి యిం
తన్నంబు బడవేయు సంఘమును బిడ్డా! యెట్లు హర్షింతువో"

(వంచిత- ఖండకావ్యాం- 6వ భాగం)

మహిళా మాన్యతను పలురీతుల తమ కవితల్లో వర్ణించి తరించినవారు జాషువా. ముంతాజ్‌మహల్ కావ్యంలో, అనాథలో, స్వప్నకథలో స్త్రీని వివిధ విధాల అంటే మహోన్నతవ్యక్తిగా, నిరుపేదగా, అనాథగా ఎంతో ఉన్నత స్థితిని, ఎంతో హీనదీనస్థితిని చూపించి విస్పష్టంగా అభివర్ణించారు. కానీ తన సతీమణి మరియమ్మ మరణంతో అంత దుఃఖసాగరంలో మునిగిపోయిన జాషువా భార్యలో తల్లిని చూడగలిగిన మహాత్ముడు.

"నాతనుయష్టి ప్రత్యణువునన్‌గల పుష్టికి కారణంబు నీ
చేతి సుధాశనంబకద? చిక్కునె నాకనరాదు గాని నా
మాతకు మారుగా యనుంగుమానిని రూపము దాల్చినట్టి నా
జాతక పుణ్యరేఖవొ ప్రశస్తి శుభైక వరప్రదాత్రివో"

(ఋణవిముక్తి- కొత్తలోకం)

వీరోచిత గాథలను ఉగ్గుబాలతో బోధించి మంచి పౌరులను తయారు చేయవలసిన ఉత్తమ మాతలు కావాలని, పిరికిమందు పోసి పాడుచేసే దుష్ట మాతలను జాషువా దుయ్యబట్టారు.

"బూచులజూపి బాలకుల పూవుల వన్నుల మోసులెత్తు వీ
రోచిత ధీరభావముల యుబ్బులడంచుట చేత భీరుతా
నీచగుణంబు లేర్పడుట నేరకుకొందరుతల్లులు; లిట్టి పై
శాచిక వత్సలత్వములు జాతికి తీవని వజ్రఘాతముల్"—

దీనికంతటికి కారణం స్త్రీలకు విద్యాబుద్ధులు లేకపోవడమేనని, అబల లనీ అణచివేయబడ్డ మహిళలు సబలలని నిరూపించుకోవాలని ఏనాడో జాషువా మహాకవి ప్రబోధించారు.

"అబలయన్న బిరుదమంటించి, కాంతల
స్వీయ శక్తులదిమి చిదిమినారు
సబలయన్న బిరుదు సాధించి హక్కులు
గడన చేసికొమ్ము కష్టచరిత!"

వారాశించిన రీతిగానే ఈనాడు అన్నిరంగాల్లోను మహిళ పురుషులతో సమానంగా వెలుగుతూంది. ఇది మరింత మహోన్నతమైనప్పుడే జాషువాకవి ఆకాంక్ష నెరవేరినట్లు !

సామాన్యమైన మానవుడుగా పుట్టి అసమాన్యుడై మాన్యుడై విశ్వ వరుడుదాకా ఎదిగిన మహామనీషి జాషువా! ఆ మహనీయుని కవితాసుమా లన్నిటా వారి కవితాత్మ నినదిస్తూంది, పరిమళిస్తూంది! విశ్వనరుడై వసుధైక కుటుంబాన్ని ఆశించిన మహాకవి ఇలా తమ హృదయాన్ని ఆవిష్కరించారు.

"ఆలుబిడ్డలకునై యాస్తిపాస్తులు గూర్ప
పెడత్రోవలో పాదమిడనునేను" అని తమ ఋజుమార్గాన్ని తెలిపి,

"నేనాచరించని నీతులు బోధించి
రానిరాగము తీయలేనునేను" అని తాము చెప్పినది ఆచరిస్తామనీ, తామాచరించలేని లోకరీతులు, నీతులు బోధించమనీ, రానిరాగాన్ని తీయమనీ స్పష్టం చేశారు—

సకల కార్మిక సమాజముల జీవితకథా
నకములాలించు కర్ణములునావి" అని కర్షక కార్మిక లోకాభ్యుదయ మాశించిన అభ్యుదయ వాదులు జాషువా! ఆ విశ్వనరుని హృదయమీ పద్యంలో సువిదిత మవుతుంది.

"అంగనామణుల దాస్యక్రూరబంధముల్
చిక్కముల్ చేయార వ్రక్కలించి
అంటరాని తనంపుటడుసులో దిగబడ్డ
యనుజుల దుఃఖంబునపనయించి

నవ్యభారత సుధానగరంబులోఁజిచ్చు
దరికొల్పు ప్రబల శాత్రవులనణచి
ప్రేమసంగతమైన విద్యార్థిజగమున
నగ్నభావావేశ నదులుమలిపి
సౌఖ్యసౌరభంబు సర్వభూములునిండ
పాడుకొందు దిశలనాడుకొందు
నిఖిల భువనమెట్లు నిర్ణయించిననాకు
తిరుగులేదు, విశ్వనరుడనేను!"

(ఖండకావ్యం- 5వ భాగం)

ఆ విశ్వనరుడైన నవయుగకవి చక్రవర్తి జాషువా శతజయంతుత్సవ సమయంలో నాపలుకుల నీరాజనాలర్పిస్తున్నాను.



ఆంధ్రసాహిత్యంలో అపూర్వసృష్టి

# కిన్నెరసాని

ప్రొఫెసర్ తమ్మారెడ్డి నిర్మల

కిన్నెర మహాపతివ్రత. ఉద్విగ్నహృదయ. కొడుకు సుఖమెరుగనివారు. అత్త కిన్నెరమీద నిందలను వేస్తుంది. అది భరించలేని కిన్నెర హృదయం శోకంచేత ప్రళయసముద్రం అవుతుంది. భర్త భార్యానురక్తుడే అయినా తల్లిని కాదనలేడు. భార్యను ఓదార్చనూలేడు. అత్తపోరు పడలేని కిన్నెర ఆవేశహృదయంతో అడవుల వెంట పరుగెత్తుతుంది. వద్దని వారిస్తూ భర్త ఆమెను కౌగిలించుకొంటాడు. ఆమె అతని కౌగిలిలోనే కరిగినీరై వాగై ప్రవహిస్తుంది. అతను శోకించి శోకించి శిల అవుతాడు.

భద్రాచలం దగ్గరున్న కిన్నెరసాని వాగునీ దాని ప్రవాహమార్గంలో ఉన్న కొండనీ చూసిన విశ్వనాథ రసహృదయంలో ఊరినకథ ఇది. ఆ రెంటికీ మానవత్వారోపణ చేసి, దాంపత్యబంధాన్ని ఏర్పరచి, అత్తనిందలను కల్పించి నదిని శోకంతో పరుగెత్తిన భార్యగాను, కొండను శోకించి శిల అయిన భర్తగాను తీర్చిదిద్దారు కవి.

ఇక నదీప్రవాహం వెంట కథ నడుస్తుంది· ఆ నది సముద్రంలో కలిసే లోపున కవి తాను చెప్పదలచిన విషయాలన్నీ చెప్తారు.

తననుంచి పరుగెత్తిపోతున్న కిన్నెరను పట్టుకోవటానికి భర్త ఆమె వెనుక వెళ్తాడు. ఆ శోకమూర్తిని కౌగిట్లో ఇముడ్చుకొంటాడు. ఆమె నిలువున నీరవుతుంది. నువ్వు నిలువెల్ల కరిగిపోయి నా జీవాన్ని తరలించావు. నాగుండె మరిగిపోయింది. నాపట్ల తప్పే ఉందనుకో. అయినా నీ నాథుణ్నిగదా ఇంత కఠినంగా ప్రవర్తిస్తావా? ఇంత కోపం ఇంత పంతం ఎందుకు? నన్ను శిక్షించటానికి ఇంకో మార్గమే లేదా? అని వగజెందుతాడు. రాళ్లపైన కాలు పెట్టలేని తన సతి ఇప్పుడు కొండల్లోను, గుట్టల్లోను ప్రవహిస్తున్నందుకు బాధపడతాడు.

ఆమె నవ్వులు నురుగులుగా, వళులు తరగలుగా, కన్నులు మీనులుగా జఘనము పులినముగా అతనికి కనిపిస్తాయి ఇది ఆలంకారిక నియమాను సారంగా చేసిన వర్ణన. ఆమె వెళ్ళిన- ప్రవహించిన పద్ధతి ఎలా ఉందంటే పూర్వం భగీరథుని వెంట పరుగెత్తిన ఆకాశగంగలాగ ఉంది. అప్పటి ఆకాశగంగా ప్రవాహపు ఉరవడి, వేగం ఈ కిన్నెరలో కనిపిస్తోందనటంలో ఈమె కోపం ధ్వనిస్తోంది.

అంతకోపంతో పరుగెత్తుతున్న భార్యను ఆపటానికి భర్త ఆమె వేణీ బంధాన్ని తనచేతితో పట్టుకొంటారు. అప్పుడతని చేతిలో ఆమె వేణికి బదులుగా నీరుకాలువ కడుతుంది. అయ్యో! వెళ్ళిపోతోందని ఎడమచేతితో ఆమె కొంగుని ఒడిచి పట్టుకొంటాడు. క్షణంలో అతని చేతికి కొంగుకి బదులు తడి తగులుతుంది. చేతిలో కొంగు కనిపించక కొంగులేని తడిచేతిని చూసుకొని తడబాటుతో బాధపడతాడతను. తననుంచి వెళ్ళిపోతున్న తన ప్రియసతిని పట్టుకోబోయినప్పుడు చేతిలో ఆ ప్రియురాలికి బదులు తడి మిగిలితే అనుకోని ఆ హఠాత్పరిణామానికి కలిగిన తడబాటు, వ్యధ ఈ చిత్రంలో చిత్రితమయ్యాయి.

ఆమెకు కోపం వచ్చి పరుగెత్తుతోంది. ఆ కోపాన్ని తగ్గించి శాంత పరచాలి. అందుకు తన భార్యను వేడుకోవటం కోసం భర్త ఆమె పాదాల మీద తన ఫాలభాగాన్ని మోపుతాడు. అతని ఫాలానికి తడి అవుతుంది. ఆమె నదిగా మారుతోంది గాబట్టి అలా జరిగింది. అప్పుడతనంటాడు "నా ఫాలమ్మున చెమ్మట ఈ పగిదిని వాగులైన నీపై ప్రేమము చూపెడి" అని. తన ఫాలభాగాన ఉన్న చెమట తన భార్యపట్ల తనకున్న ప్రేమను చూపు తోందట. ఆ చెమట ఎలా వచ్చింది ? ఆమె పాదస్పర్శ వలన ఏర్పడిన సాత్వికభావం వలన. ఈ సాత్వికభావం ఎందుకు కలిగిందీ అంటే ఆమెపట్ల ఉన్న ప్రేమ వలన.

ఆమె అతనికి జీవేశ్వరి. అటువంటి జీవితమణి ఈ విధంగా అయితే అతని శరీరంలో జీవముంటుందా? అందుకే ఆమెలాగ తానుకూడ ప్రవాహంగా మారి ఆమెతోనే వస్తానంటాడు. కాని అదీ కుదిరేటట్లు లేదు ఆమె రసాకృతి. (నవరసాల ఆకృతి అనికూడ). కాబట్టి ఈ విధంగా ప్రవహించగలుగుతోంది

దుఃఖాన్ని భరించలేక నిలువునా నీరయ్యింది. అతను భార్య దుఃఖాన్నీ బాధనీ అర్థం చేసుకోలేకపోయిన శిలాహృదయుడు. కాబట్టి ప్రవహించలేడు. అతను శిలాకృతిని పొందబోతున్నాడన్న సూచన ఇది.

తాను దురదృష్టవంతుడు. తల్లి నిందించినప్పుడు శోకించిన సతి దుఃఖోపశమనానికి ఎట్టి ప్రయత్నమూ చెయ్యలేదు. అది తన తప్పు. అందుకు ఫలితం ఇది. తనదే తప్పని అతనికి తెలిసింది. కాని ఏం లాభం! అప్పటికే ఆమె నీరయిపోయింది. అందుకే తన చేతులను ఆమెకోసం చాచి ఎలుగెత్తి దుఃఖిస్తాడు. ఆమెకోసం ఏడ్చిఏడ్చి అతని కంఠం సన్నబడి ఎలుగురాస్తుంది. కంటిచూపు మందగిస్తుంది. కాయం కొయ్యబారిపోతుంది. సర్వం మరిచి దుఃఖించిన అతని శరీరం రాయి అవుతుంది.

నా యీ దేహమిదేమో
జాయివోలె నగుచున్నది

అని నదీరూపమైన భార్యకు చెప్తూనే అతను శిలాకృతిని పొందుతాడు.

నీరై ప్రవహిస్తున్న కిన్నెర భర్త పరిస్థితిని గమనిస్తుంది. అతనంటే ఆమెకు ప్రేమ. అందువలన "పతి రాయివలె మారి పడియున్నచోటునే" విడలేక సగజెంది తిరుగుతుంది. తాను నదిగా ఎందుకు మారానా అని బాధ పడుతుంది. తాను లేకపోతే భర్త ఓర్చుకోలేడు కాబోలు అని ఇప్పుడు గ్రహిస్తుంది. తనమీద అతనికి ఇంతప్రేమ ఉందని ముందే తెలిస్తే ఇంకెంత చెలిమి తామిద్దరి మధ్యా ఉండేదో. అంత ప్రేమించే భర్తతో చేసిన అటువంటి కాపురాన్ని ఈ విధంగా చేసుకొన్నాను అని విలపిస్తుంది. ఏమీ చెయ్యలేక పతి రాయిగా మారి పడివున్న ఆగుట్టను తన కెరటాల హస్తాలతో చుట్టి ఘోషిస్తుంది. కొండమాదిరిగా పడిఉన్న తన నీటుకాణ్ని కౌగిలిస్తుంది. పలకవా అని పలకరిస్తుంది తిరిగి సమాధానం చెప్ప పతిగుట్టపైన ప్రాలి దుఃఖిస్తుంది.

ప్రవహిస్తున్న నది గుట్టచుట్టూ తిరగటాన్ని కెరటాలతో ఆ కొండను స్పృశించటాన్ని, ప్రవాహపు శబ్దాలను కవి ఈ విధంగా ఉత్ప్రేక్షించారు. ఇందులో నాయికా దుఃఖంతోపాటు భర్తకుదూరమైన భార్య వేదనాహృదయం మనకు కనిపిస్తుంది.

తనలాగానే భర్తకూడ నదిలాగ ప్రవహిస్తే ఇద్దరం కలిసిపోదామని అడుగుతుంది కిన్నెర. అంతేకాదు,

"నీయందు తప్పింక నేను చెయ్యను లేర
ఆన పెట్టితివేని అడుగు దాటను లేర
ఇక జన్మలో కోపమింత పొందను లేర"

అని పశ్చాత్తాప పడుతుంది. తన భర్తను తనతోరమ్మని పిలిచిపిలిచి అలసిపోతుంది. అతను రాలేడనీ, ఇద్దరి దారులు వేరైనాయనీ గ్రహిస్తుంది. "మరల నాతో నీవు మాటాడబోవురా" అని దుఃఖిస్తుంది. తన కర్మమింతే. చేతులార చేసుకొన్నానని బాధపడుతుంది. పతికి తనమీద ఉన్న అనురాగాన్ని గుర్తుచేసుకొంటుంది. అతని ప్రణయ చేష్టలను స్మరించి రోదిస్తుంది.

ప్రవహించటం నదీలక్షణం. కిన్నెర పతిచుట్టూ తిరిగి వలవలా ఏడుస్తూ పతిగుట్ట విడలేక విడలక అతన్ని వదలి పోలేకపోలేక తననితాను నిలువరించుకోలేక పల్లానికి సాగుతూ వెనక్కి తిరిగి తన నావాణ్ని కనిపించినంతవరకు చూస్తూ పోతుంది.

ప్రవహిస్తూ వస్తున్న కిన్నెరసానిని గురించి తెలిసిన సముద్రుడు ఆమెపైన మోజు పడతాడు. తరుణీ కిన్నెర అందమే లోకమైపోయి తనలోనున్న బడబాగ్నిశిఖ పొంగి తనశరీరమెల్ల దహియించినట్లుగా తపియించిపోయాడు. ఇక్కడ సముద్రంలో ఉండే బడబాగ్నిని విరహాగ్నిగా ఉత్ప్రేక్షించారు, కవి. మగనిమీది కోపంతో ఇట్లా అయిన మగనాలి తనకు దక్కుతుందా అని సముద్రుడు ఆలోచించడు. ఎప్పుడైతే వాగులా మారి ప్రవహించిందో అప్పుడే ఆమెకు కడలిరాజు కౌగిలిలో దూరాలని రాసిపెట్టి ఉందని పొంగిపోతాడు.

కడలికి తనమీద వలపు కమ్ముకొని వచ్చిందని ఎరిగిన కిన్నెర కీడు తలుస్తుంది. లోలోన కుమిలిపోతుంది.

"ఓనాథ నిను వీడివచ్చి
ఓరాజ నిను వదలివచ్చి
నా యొడల్పయితమ్ము నానా జనులుకోర
యీ యేవపుం బ్రతుకేల పొందితినిరా

అని ఏడుస్తుంది. అయినవారి అండను కోల్పోయిన కిన్నెర కానివారికి అలుసవుతుంది.

ఇంతకీ పతివలన దోషం ఏమిటి? తల్లివేసిన నిందలను చూసీచూడ నట్లుండటమే. అంతవరకు అయితే పరవాలేకపోయేదేమో. తనకు తన అర్ధాంగి మీదగల ప్రేమను సరిగా వ్యక్తం చేయలేదతను. అందువల్లనే వచ్చింది అసలు ఈ బాధంతాను. ఇంత ప్రేమ ఉందని ముందుతెలిస్తే ఎంతబాగుండేది అని అంతా అయిపోయిన తరువాత పలవిస్తుంది కిన్నెర. నిజమేమరి. ఆమెకోసం శోకించి భర్త శిల అయ్యాడు. అతని హృదయంలో ఆమెకంత స్థానం ఉందని తెలిస్తే ఆమె అంత ఆవేశపడేది కాదు. తన హృదయాన్నీ ఉద్విగ్నతనూ అదుపులో ఉంచుకోగలిగేది. ఒకరికోసం ఒకరై బ్రతకవలసిన దంపతులకు ఒకరికోసం ఒకరు విలపించే విషాదపరిస్థితి ఏర్పడింది. ఇద్దరి మనస్సుల్లోను ఉన్న ప్రణయాభిమానాలను వ్యక్తీకరించు కోలేక పోవటమే ఇందుకు కారణం.

తన పతి ప్రేమను, తొందరపాటుతో తాను చేసిన తెలివితక్కువపనినీ, తన భర్త చూపిన త్యాగ గౌరవాన్నీ తలచుకొని దుఃఖిస్తుంది కిన్నెర. ఏటి నీటిని ఎండగట్టుకొని సముద్రంలో చేరవలసిన చేటుని తప్పించుకొనేమార్గం కనరావటల్లేదని బాధపడుతుంది. "నా చెలువుని దెస చేసిన యిక్కలుషము నే దాటుటెట్టుల"ని విలపిస్తుంది.

ఈ విషయమంతా గోదావరి నదికి తెలిసి కిన్నెర కభయమిచ్చి రమ్మంటుంది. తానామె నాదుకొంటాననీ, కడలి ఆమె జోలికింక రాడనీ ఓదారుస్తుంది. కిన్నెర గోదావరిని చేరుతుంది. మనిషిగా ఉంటే ఎప్పటికైనా చావటం తప్పదు. ఇప్పుడు తనకూ తన మగనికీ చావులేదు అని దిగులుమాని తృప్తి పడుతుంది. ప్రణయానికి మరణం లేదని చెప్పటమిది.

కిన్నెర ప్రవాహాన్ని విశ్వనాథ వర్ణించిన తీరులో ఆ మహాకవి ప్రకృతి పరిశీలన, తెలుగుదనం, దానికి తెలుగుమీదగల అభిమానం స్పష్టంగా వ్యక్త మవుతాయి. విశ్వనాథది పాషాణపాకం అన్నవారికి కిన్నెరసాని చక్కగా సమాధానం చెప్తుంది.

ప్రవాహంగా మారిన కిన్నెర ఎలా ఉందంటే-

పదువు కట్టిన వేళ్ళకదుపులా తోచింది
కదలు తెల్లని పూలనదివోలె కదిలింది
పతిని వదిలి వెళ్తున్న కిన్నెర
తొడిమ యూడిన పూవు పడతిగా తోచింది
ముక్తగీతిక వోలె మ్రోగింది.
పతిగుట్టను వదలలేక తప్పనిసరిగా వెళ్ళవలసివచ్చిన కిన్నెర
తల్లిదగ్గరనుండి తనమెడకు పలుపోసి
లాగగాబడ్డట్టిలేగలా సాగింది.
ఆవు పొదుగున పాలు ధారగట్టిన యట్లు
తల్లిచల్లని ప్రేమ వెల్లువారిన యట్లు
పాలాట్రగడము పాతర తీసికొన్నట్లు
ముద్దరాలి మనస్సు పొంగివచ్చినయట్లు
కిన్నెర జలజలా పొంగింది.

పరికిణీ తొక్కాడు పదియేండ్ల కన్నెలా
చిన్నిగంతులు వేయు తెల్ల నాగ్రబెయ్యలా
పసిపాప సెలవివారిన బోసినవ్వులా
బిలబిలా నడిచింది.

కిన్నెర ప్రవహిస్తోంటే
బంగారు తీగలో పానకమ్మెపోయె
కొబ్బరిసాలు వాకలు కట్టినట్లయ్యె
వెయ్యాృవు లొకసారి పిదికినట్లయి పోయెనట.
జలదేవతల వెంటసాగిన కిన్నెర
తెలితారకల వెంట వెలుగులా
తలిరుపూవుల వెంట తావిలా
తెనుగు పాటల వెంట తీపిలా తోచింది కవికి.

ప్రవహిస్తున్న కిన్నెరలో కవికి నృత్యం కనిపించింది. గానం వినిపించింది. అప్పుడు ఆ తరగల్లో, నురుగులో తీనె కాలువలూరాయి.

అమృతపు వానచుక్కలు జారాయి. ఆ నృత్యగానాలలో కూడ ఆయన తెనుగుతనాన్నే దర్శించగలిగారు. అందుకే

అలల పెన్నురుసుతో తెలుగు వొదుగులు పోయెనే కిన్నెరా
తెలుగు తీపులు చిమ్మెనే అన్నారు.

అంతేకాదు,

తెనుగు వాగై పారెనే— నెత్తావి
తెనుగు పాటలు పాడనే

అని చెప్తూ కిన్నెరపాట పూవులు విరజిమ్మినట్లుందనీ చొక్కంపు తెలుగు వెలుగులు కమ్మినట్లుందనీ భావించారు. ఆచాన కిన్నెరపాట తేనెలై కలకండ సోనలై వానలై సాగింది. చెఱకు పానక మెట్టు జీరపాకమువోలె తారు లాడింది.

ఆ పాట ఈనాటికీ మనకు వినిపిస్తోంది "తేటతేట తెలుగులా తెల్లవారి వెలుగులా" వంటి కమ్మని పాటలకు రూట్స్ ఇక్కడున్నాయనిపిస్తోంది.

ఋతువు రుతువుకీ మారే రుచులతో తెలుగు సత్కవి వర్ణించలేనంత చవులతో కిన్నెర తెలుగు దైవమైన భద్రాద్రి రాముణ్ని దర్శించే త్రోవలో ప్రవహిస్తూ యాత్రికులకు చల్లని నీటినందిస్తుంది. అటువంటి పుణ్యాత్మ ఆమె. అటువంటి పూతాత్మ ఈ కిన్నెర ఆంధ్ర సాహిత్యంలో అపూర్వసృష్టి.

తననెంతో ప్రేమిస్తున్న భర్త ప్రేమను తెలుసుకోలేకపోయిన కిన్నెర ఆవేశంతో నదిగా మారటం వలన పతి శిల అయ్యాడు. ఇప్పుడెంత విల పించినా ఇద్దరికీ పూర్వ రూపంకాదు. తొందరపాటు పనికిరాదనీ ఓర్పు అవసరమనీ సందేశం ఇందులో నిక్షిప్తమై ఉంది.

విశ్వనాథ సత్యనారాయణగారు కిన్నెరసాని వాగుని చూసినప్పుడు గాని తరువాత 1922-27 మధ్యకాలంలో కిన్నెరసాని పాటలు రచించి

నప్పుడుగాని ఈ వాగుకి ప్రాజెక్ట్ లేదు. తరువాతి కాలంలో పాల్వంచకి పన్నెండు కిలోమీటర్ల దూరంలో కిన్నెరసాని ప్రాజెక్ట్ కట్టబడింది. ప్రాజెక్ట్‌కి ఎగువభాగంలో వాగునీరు కొండలని చుట్టి వస్తూంటుంది. దిగువ భాగంలో కిన్నెరసాని పాల్వంచనుండి భద్రాచలం వెళ్ళేదారిలో ప్రవహిస్తూ పల్లానికి పోయి గోదావరిలో కలుస్తుంది. ఈ కిన్నెరసాని ప్రవాహ ప్రాంతాన్ని పరిశీలిస్తే విశ్వనాథ చూపిన కిన్నెర నడకలు, వైభవం మనకి కనిపిస్తాయి. "కిన్నెరసాని పాటలు" (కావ్యం) చదివిన వారికి కిన్నెరసాని వాగునీ ప్రాజెక్టునీ చూడాలని అనిపిస్తుంది. ఈ పాటలను చదివినప్పుడు కలిగినంత ఆనందం ఆ వాగుని చూసినప్పుడు కూడ కలుగుతుంది. ఆ ఆనందంలో విశ్వనాథ భావుకతకీ, కవితా హృదయానికీ నివాళులర్పిస్తాం.



# మహాకవి జాషువా సాహిత్యంలో
# మానవతావాదం

—అమూల్యశ్రీ

ఆధునికాంధ్ర సాహిత్యంలో ఉద్దండులైన యిద్దరు కవులు- కవి సమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణ- నవయుగ చక్రవర్తి శ్రీ గుఱ్ఱం జాషువాల శత జయంత్యుత్సవాలు దేశం నలుమూలల ఘనంగా జరుపుకుంటున్న యీ సంవత్సరం నాగార్జున విశ్వవిద్యాలయ తెలుగుశాఖవారు ఆ యిరువురి కవి దిగ్గజాల సాహితీమూర్తిమత్వాలపై సాహితీగోష్ఠి ఏర్పాటు చేయడం ఎంతేని హర్షదాయకం. ఈ సెమినార్‌లో నాకుగూడా మాట్లాడే అవకాశం యిచ్చినందులకు నా అదృష్టంగా భావించి తెలుగుశాఖ వారికి, విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులవారికి ముందుగా అభివందనాలు తెలియజేస్తున్నాను.

మాట్లాడటానికి నాకిచ్చిన విషయం- "జాషువా సాహిత్యం-మానవత" జాషువా సాహిత్యాన్ని పరామర్శించేముందు- "మానవత" అంటే రెండు మూడు మాటలు తెలుసుకుందాం! మనిషి- మనిషిగా మెలగడం బ్రతకడం— సాటిమనిషిని మనిషిగానే చూడడం. బ్రతకనివ్వడమే- "మానవత" అంటే "వివేచన" లేని జంతువులవలె "మూర్ఖత్వం"తో కేవలం పొట్టకోసం ప్రాకులాడకుండా- క్రూర స్వభావంతో తన స్వార్థంకోసం యితరజీవుల్ని హింసించే దానవులవలె జీవించకుండా మనిషి మనిషిగా జీవించడమే మానవత్వం! అయితే మానవుడీనాడు తనకు సహజసిద్ధంగా లభించిన "తెలివితేటల"తో కేవలం తన సుఖం, తనవారు అంటూ తన ఆస్తిపాస్తుల పెంపుకోసం "వివేకం" గోల్పోయి పశువులా- రాక్షసునిలా "స్వార్థసంకుచిత" దృష్టితో సాటిమనిషిని "దోచుకొని" తింటున్నాడు. హింసిస్తున్నాడు! సృష్టిలో ఒకే జాతిగా ఆవిర్భవించిన మానవులు కాలం మారుతున్నకొద్దీ, నాగరికత సంతరించుకొన్నకొద్దీ తెగలుతెగలుగా విడిపోయి- జీవితానుభవంతో విద్యాధికులై విజ్ఞానవంతులైనకొద్దీ మనిషిలో "సహజ మానవ గుణాల" కంటే "దైవ గుణాల" కంటే సంకుచిత స్వార్థంతో "మితిమీరిన" తెలివితేటలతో కులాలు

మతాలు, వర్గాలు ఏర్పరచుకొన్నారు. 'నా కులం' గొప్పదని నా 'మతం' గొప్పదని- నాకింత సంపదవున్నది కనుక నామాటకు తిరుగుండరాదనీ కొందరు మరికొందరిని హింసించడంవల్లనే ప్రపంచంలో మానవసమాజంలో నేడిట్టి "దుస్థితి, దురవస్థ" ఏర్పడింది! ప్రాణికోటిలో మణిమకుటధారి వంటి మానవుడు స్వార్థ సంకుచిత్వంతో- ధనమదాంధతతో- అధికారదర్పంతో కులవైషమ్యాలతో, మతోన్మాదంతో, కండకావరంతో, కీర్తికండూతితో, ఈర్ష్యాద్వేషాలతో పశువులా మూర్ఖంగా రాక్షసుడిలా క్రూరంగా రెచ్చిపోయి ప్రవర్తించడం వల్లనే సమాజంలో అన్యాయాలు, అక్రమాలు, దౌర్జన్య హింసాకాండలు చెలరేగుతున్నాయి! సర్వానర్థాలు తెచ్చిపెడుతున్నాయి. అయితే అప్పుడప్పుడు "మానవతా" మూర్తులైన మహనీయులు కారణజన్ములు సంస్కర్తలు- అవతారపురుషులు అవతరించి మానవజాతి నుద్ధరించటానికి తమతమ శక్తియుక్తుల్ని- జీవితాల్ని ధారవోసారు పోస్తూనే ఉన్నారు. అనంతవిశ్వానికి వెలుగునిస్తున్న సూర్యచంద్రుల్లా ఆ బహు కొద్దిమంది మానవతా మూర్తుల మూలాన మానవజాతి మనుగడ సాగిస్తోంది!

కవి, ఋషి! కవి బ్రహ్మస్వరూపుడు అతడు స్రష్ట, ద్రష్ట! క్రాంతదర్శి! కవి వాక్కు బ్రహ్మవాక్కు! వేదవాక్కు! సత్యవాక్కు! కవి "సర్వేజనో సుఖినో భవంతు" దృష్టితో- "బహుజన హితాయ- బహుజన సుఖాయ" అన్న ధ్యేయంతో కలం పట్టుకొని రచనలు చేస్తాడు. జీవితలక్ష్యం సుఖానందాలే కనుక తన రచనలద్వారా యితరులకు "హృదయ స్పందన" కలిగించి ఆనందాన్ని చేకూర్చుతాడు. శుభసందేశాన్ని అందిస్తాడు. మార్గదర్శకుడవుతాడు. సమాజంలో జరుగుతున్న అక్రమాల్ని, అన్యాయాల్ని, అధర్మాన్ని ఖండిస్తూ సమస్త మానవకోటి అభ్యుదయానికి- విశ్వమానవ కల్యాణానికి పరోక్షంగా కవి తోడ్పడతాడు. కవి అనేవాడు తన "ఆత్మానందానికి" ప్రధానంగా కలం పట్టుకొన్నా- తన చుట్టూ ఉన్న సమాజాన్ని చూస్తూ- సమాజంలోని "అన్యాయాల్ని" "సామాజిక స్పృహ" గీటురాయిగా తన రచనల్లో ఎత్తి చూపెడతాడు. మానవజాతిని జాగృతం చేస్తాడు. తరుణ కర్తవ్యబోధ చేస్తాడు. భావితరాలకు సందేశం యిస్తాడు. మార్గదర్శి అవుతాడు.

ఈ విధంగా మనం ఆలోచిస్తే- "మానవత"కు, సామాజిక స్పృహ గీటురాయిగా లేక "పునాది"గా జరిగే అభ్యుదయం లేక ప్రగతి మొదటి మెట్టుకాగా- కులమతరహిత సమసమాజస్థాపనాధ్యేయం రెండవమెట్టు అవుతుంది. "విశ్వమానవ కల్యాణం" మానవతకు పైమెట్టు అవుతుంది. ఋషి కవి అయిన నవయుగ కవి చక్రవర్తి తన రచనల్లో అభ్యుదయవాదం, సమసమాజ లక్ష్యం విశ్వమానవ కల్యాణం ఎలా చెప్పాడో మనమిప్పుడు పరిశీలిస్తాం!

**కులభేదభావఖండన :**

విభిన్న ఉపజాతులు, కులాలు, మతాలు, భాషలు, వర్గాలు ఉన్న మన దేశంలో "భిన్నత్వంలో ఏకత్వం" అని మనమెంత గొప్పలు చెప్పుకున్నా- కులం కుమ్ములాటలు మతవైషమ్యాలు వర్గపోరాటాలు "హింసాకాండలు" నిత్యం జరుగుతూనే వున్నాయి. మహాకవి జాషువా ఒక నిరుపేద "హరిజన క్రైస్తవుడి"గా పుట్టడం వలన, ఒక వందసంవత్సరాలనాడు ఆత్మాభిమానం గల ఆయన ఎన్ని బాధలు పడ్డాడో: ఎన్ని అవమానాలు పొందాడో ఎంతగా మనోవేదన అనుభవించాడో వూహించడం కష్టమైనా- ఆయన కవితలు ఆయన మనోవ్యథకు కొంతవరకు అద్దం పడతాయి. జాషువాగారు చెప్పినట్లుగా "నాకు గురువులు (దుష్ట) ఇద్దరు- ఒకటి పేదరికం, రెండోది కుల మతం. మొదటిది నాకు సహనాన్ని నేర్పితే- రెండోది నాలో ఎదిరించే శక్తిని పెంచిందే కాని బానిసగా మాత్రం మార్చలేదు. దారిద్ర్యాన్ని కులభేదాన్ని కూడా చీల్చి నేను మనిషిగా నిరూపించుకోదలచాను. వాటిపై కత్తికట్టాను. అయితే నాకత్తి కవిత- నా కత్తికి సంఘంపై ద్వేషంలేదు. దాని విధానం పైనే ద్వేషం" అని "మా నాన్నగారు" పుస్తకంలో జాషువా కుమార్తె హేమలతాలవణం రాస్తారు.

జాషువా స్వీయ మనోవేదనకి, ఆయన దేశాభిమానానికి ప్రతీక ఆయన "గబ్బిలం" కావ్యం. ఊరూపేరూ లేని ఓ అరుంధతీయుడందులో కథానాయకుడు. అంటే జాషువాయే కథానాయకుడు. కైలాసనాథుని దగ్గరకు తన 'కన్నీటికథ' వినిపించమని తన 'అశ్రుసందేశాన్ని' గబ్బిలం ద్వారా రాయబారం పంపడం కావ్యంలోని ప్రధాన యితివృత్తం!

కసరి బుసకొట్టు నాతని గాలిసోక
నాల్గుపడగల హైందవ నాగరాజు అంటాడు.

ఈ అస్పృశ్యుడు అల్లంతదూరాన కనిపిస్తేనే చాలు- 'కస్సు'మని బుసకొడుతుంటట, యీ చాతుర్వర్ణ్య సర్పరాజు!

పామునకు బాలు చీమకు పంచదార
మేపుకొనుచున్న కర్మభూమిం జనించు
ప్రాక్తనంబైన ధర్మదేవతకు గూడా
నులికిపడు జబ్బుగలదు వీడున్నచోట-

ఇక్కడ ధర్మదేవత అంటే- దైవం అనే భావం చెప్పుకోవచ్చు (హిందూ) ధర్మశాస్త్రాలు అనిగూడా అర్థం చేసుకోవచ్చు. పాములకుపాలు పోసి చీమలకు పంచదార మేపటం "పుణ్య"ప్రదమని హిందూశాస్త్రాలు 'జీవకారుణ్యం' గురించి తెగ చెబుతున్నాయిగదా! లేదా పాలు పంచదారతో తయారుచేసిన 'పొంగలి' నైవేద్యం పెడితే అరగిస్తాడు హైందవ దేవుడు! అయితే మనిషిగా పుట్టిన "పంచముణ్ణి" మాత్రం "చీ-దూరంగా పొమ్మని" అటు శాస్త్రాలు యిటు ధర్మదేవతలు విషమున్న పాముకన్న- సృష్టిలో అల్పజీవి చీమకన్న హీనంగా చూస్తున్న "కర్మభూమి" అయిన "మన పుణ్య భారతావని" అని మహాకవి ఆవేదన పడుతూనే హిందూశాస్త్రాల్ని, హిందూ దేవుళ్ళని పరోక్షంగా ఎత్తిపొడిచాడు.

ఇంకొకచోట యీ "పంచమ" కులస్థుడెవరని భారతమాతని నిల దీస్తాడు- చూడండి

ముసలివాడైన బ్రహ్మకు పుట్టినారు
నల్వురు కుమారులనుట విన్నాము కాని
పసరమునకన్న హీను డభాగ్యుడైన
ఐదవ కులస్థుడెవరమ్మా సవిత్రి-        [ఖం.కా.]

హిందూశాస్త్రాలు- మనస్మృతి నాల్గువర్ణాల గురించే చెపుతాయి. పశువుకన్న హీనంగా చూడబడుతున్న 'పంచమ' కులస్థుడెవరని కన్న భరత మాతను నిలదీస్తాడు. ఆత్మాభిమానమున్న మహాకవి జాషువా,

చిన్నతనంలో నడివీధిలో అగ్రకులాల కుర్రవాళ్ళతో ఏదో గొడవపడి యింటికివచ్చి కన్నతల్లితో విషయం వివరిస్తే- మనదేశంలో 'వర్ణవ్యవస్థ దుర్మార్గాన్ని తల్లిచేత మహాకవి ఏమని చెప్పించాడో చూడండి.

"నాయనా! యిది భయంకరదేశము; వర్ణభేదముల్
గూడులు గట్టుకొన్న వనకూడదు; పంచమజాతి వాడికిన్
కూడు హుళక్కి, మానవతగూడహుళక్కి, హుళక్కి జన్మమున్"

(నాకథ)

ఈ భారతదేశంలో పంచమ కులస్థులు "మానవులు"గా ఎంచబడరని, అసలు వారి జన్మమే హుళక్కని చక్కగా చెప్పాడు మహాకవి. "ఇక్కడి దేవతల్ వరము లీయరు పంచమ జాతివారికిన్ మ్రొక్కిన స్వీకరింపర"ని గూడా అంటాడు. అంటే ఆనాడు హరిజనుల్ని హిందూ దేవాలయాలలోనికి రానిచ్చేవారు కాదుగదా! అదీ సంగతి.

"నన్ను దొలగించి లెక్కించినారు కాని మొదట నెల్లరన్నదమ్ములము మేము" అని నగ్నసత్యాన్ని చెప్పాడు. వేదకాలంలో కులవ్యవస్థ లేదు. తర్వాత వృత్తుల్నిబట్టి వర్ణాలేర్పడి- అవి 'పుట్టుక'తో కులాలై పాతుకు పోయాయి. ఉచ్చనీచాలు (కులీనులు-కులహీనులు) (సవర్ణులు-అవర్ణులు) కల్పించి కొన్ని "అగ్ర"కులాలు, మరికొన్ని "శూద్ర"కులాలు, మరికొన్ని "అస్పృశ్య" కులాలని కొందరు తెలివిగల స్వార్థపరులైన అగ్రవర్ణాల వారు కులవ్యవస్థను నెలకొల్పారు.

హరిజన క్రైస్తవుడిగా తానుఅనుభవించిన దుస్థితినిగూడా పరోక్షంగా సూచనమాత్రంగా చెప్పాడు. "ఎంత కోయిల పాట వృథాయయ్యెనో కదా, కటిక కొండలమీద మిటకరించి".... అంటూ "ఎంత గంధవహనమెంత తంగెటిజున్ను యెంత రత్నకాంతి యెంతశాంతి ప్రకృతి గర్భమందు భగ్నమై పోయెనో పుట్టరానిచోట పుట్టుకతన" అని హిందూ సమాజంలో తన దుస్థితిని పరోక్షంగా పేర్కొన్నాడు. వనసీమలో కమ్మనికోయిల పాట వృథామై పోయినట్లు- కొండకోనల్లో హాయినిచ్చే పున్నమివెన్నెల వృథామై పోయినట్లు పంచమకులంలో జన్మించినందువల్లనే కదా తనకు ఎంతో ముందుగా

రావలసిన గుర్తింపు. ప్రాచుర్యం రాలేదని జాషువా ధ్వని మాత్రంగా చెప్పాడు. అలానే "కర్ణుడేమాయె కులపరీక్షకుల నడుమ" అంటూ తన స్థితిని 'కర్ణుని' స్థితితో పోల్చుకున్నాడు!- "కులవిభేద" భావం వలన తన కన్యాయం జరిగిందని ఆయన వేదన. ఇంతకీ "నాదు కన్నీటికథ సమన్వ యము సేయ, అర్థి హృదయంబు గూడా గొంతవసరంబు" అని అంటాడు. పంచమ జాతులవారి 'దైన్యస్థితి'ని అర్థం చేసుకోటానికి- ఆదుకోటానికి 'మానవీయ' జాలిగుండె, విశాలహృదయం. వెన్నవంటిమనస్సు ఉండాలన్నది కవి భావన! నిజమే చట్టం శాసించడింకన్న "మానవతా" దృక్పథం ముఖ్య మంటాడు జాషువా. ఏదిఏమైనా పరిస్థితులు మారిపోయి బాపూజీ పుణ్య మనండి- డా॥ అంబేద్కర్ కృషి అనండి- మానవతా వాదులైన సంఘ సంస్కర్తల కృషి అనండి "నగరి వెలుపలి మాలమాదిగలు కూడ నరులు సుమ్మని దేశంబు గురుతుబట్టింది" అంటూ "వెఱపు వలదు నీకు హరిజన సోదరా। స్వీయ రాజ్యరథము వెడలివచ్చె। లాగి పొమ్ము నీకు భాగంబు గలదంచు బాడుచుండె రత్న భరతమాత" అని పంచమ జాతులవారి ప్రగతిని సూచనప్రాయంగా ధ్వనించాడు. స్వతంత్ర భారతదేశంలో హరి జనుల (దళితుల) హక్కులు సాధించుకొని అందరు భారతీయులతోపాటు గౌరవంగా సుఖంగా జీవించమని అకాంక్ష వెలిబుచ్చాడు మహాకవి.

## 2. సమాజంలోని ఆర్థిక అసమానతలు- పేదరికపు బాధలపై ఆవేదన :

పేదరికంలో పుట్టి పేదరికంలో బ్రతికిన జాషువాకు ఆ 'బాధలేమిటో బాగా తెలుసు. గబ్బిలం, కాందిశీకుడు, కొత్తలోకం, అనాథ (స్వప్నకథ) కావ్యాలలోను- యితరేతర కవితాఖండికల్లో "పేదరికపు" బాధల్ని ఛందో బద్ధం చేసాడు. "అనాథ" లఘుకావ్యమందుకు మంచి ఉదాహరణం. భర్త లేక గంపెడు పిల్లలతో 'బజారుపాలైన' ఓ అనాథ కథ యిందలి ఇతివృత్తం! అనాథని అలానే "నడిబజారు"లో విడిచిపెట్టి- కావ్యాన్ని అసంపూర్ణంగా "విషాదాంతం"గా ముగించాడు కవి. అంటే నిజ జీవితంలో నిజంగా నడి వీధుల్లో గడిపే నిరాధార నికృష్ట నిరుపేద బిక్షగాళ్ళ బ్రతుకుల్ని తీసుకొని, కథలు, కావ్యాలు రాసే కవులు- రచనలు ఆ 'కథల్లోనైనా, ఆ కావ్యాల్లోనైనా

చివరకు సుఖజీవితం గడిపినట్లు 'సుఖాంతం' చేయడం పరిపాటి. కాని మహాకవి అలా 'సుఖాంతం' చేయలేదు. అనాథల బ్రతుకులెప్పుడూ "వీధులపాలే"నన్న నగ్నసత్యాన్ని దృష్టిలో పెట్టుకొని ఆ కావ్యాన్నలా అసంపూర్ణంగా- 'నడివీధి'లో విడిచిపెట్టాడు. పీఠికలో అనాథ కథ గురించి చెపుతూ- అది అసమగ్రము.... సలసలగ్రాగి చిందిన కన్నీటి బిందువు ... అసంపూర్ణమైన 'అనాథ' కథ పాఠకులకు వింతగా దోపవచ్చును. కాని మనోగత భావము సమగ్రముగా వ్యక్తీకరింపబడిన మీదట నా దృష్టికిక్కథ సమగ్రము. అందువలన అనాథను పురవీథులలో విడిచిపెట్టబడినది. కావ్య శిల్పముకన్న అభిప్రాయ ప్రకటనమే నా పరమావధి' అని వివరించాడు.

గుంపెడు పిల్లల్ని వెంటనిడుకొని యింటింటికి తిరిగి అడుక్కునే ఆ "అనాథ"ను నిర్దాక్షిణ్యంగా మానవత్వం రవ్వంత లేకుండా ఛీకొట్టేవాళ్ళ కొందరైతే- "మానవత్వం" మూర్తీభవించిన జాలిగుండెతో ఆదరించి, 'చల్దియన్నమో' తృణమో పణమో యిచ్చినవారు మరికొందర్ని మహాకవి మనకు చూపిస్తాడు కావ్యం. భార్య కాదంటే అనాథను చేరదీసిన భార్యను, ఆమెను పశువులా 'ఛీకొట్టిన' లోకానుభవం లేని ఓ యువతీమణిని, "కన్నూ మిన్నూ" కానకుండా సైకిల్ మీదపోతూ- అనాథను ఆమె పిల్లల్ని ఛీకొట్టిన ఓ 'షోకిలా' యువకుణ్ణీ ఆ దృశ్యం చూచినా తమ 'ప్రేమకలాపాల్లో' మున్గిపోయిన ఓ నవ దంపతుల్ని— "దారి తొలిగిపోమని" అసహ్యించుకొన్న ఓ 'పంగనామాల' అయ్యవారిని, అనాథ మొరవిని ఆమె పెద్దకొడుక్కి విద్యాబుద్ధులు నేర్పటానికి అంగీకరించిన మరో సద్బ్రాహ్మణుణ్ణి— యిలా వివిధ మనస్తత్వాలున్న వ్యక్తుల్ని మహాకవి చూపిస్తాడు. అంటే- ఏ కులమైనా, ఏ మతమైనా, సమాజంలో 'మానవత్వం' ఉన్నవారూ లేనివారూ, ఉన్నారని చెప్పడం మహాకవి ముఖ్యోద్దేశం!

"ఏడు సముద్రముల్ గడచి యెక్కడ నేపని మీద బోయి యు
న్నాడవురా! పరాత్పరుడ! నాకడగండ్లకు మేరయున్నదా!
యేడకు బోవుదాన! నెటులీ కసుకందుల పొట్టనించు నీ
యాడదటంచు నేడిచె మహాకరుణంబుగ డొక్క క్రుంగగన్—

తన దీనావస్థను దేవుడితో చెప్పుకొని- దేవుడికిగూడా జాలి లేనందుకు రోదిస్తుందా అనాథ.

ఎవడారగించు నమృత భోజనంబున
కలిసెనో యీలేమ గంజిబువ్వ
ఎవడువాసము సేయు శృంగార సౌధాన
మునిగెనో యిన్నారి పూరిగుడిసె
ఎవని దేహముమీది ధవళాంబరములలో
నొదిగెనో యిన్నాతి ముదుకపంచె
ఎవడు దేహము సేర్చు మృదు తల్పములలోన
నక్కెనో యీ యమ్మ కుక్కిపడక

వసుధపైనున్న భోగ సర్వస్వమునకు
స్వామిత వహించి మనుజుండు ప్రభవమందు
నెవడపహరించెనే మయ్యె నీమెసుఖము
కలుషమెఱుగని దీని కొడుకులసుఖంబు (అనాథ)

లోకంలోని నిఖిల నికృష్ట నిరుపేదలకు యీ "అనాథ" ప్రతీకగా తీసుకొని మనమీ పద్యాన్ని పరిశీలించితే- ఒకప్రక్క రెక్కలు ముక్కలు చేసుకొని కష్టించినా డొక్కనిండని పేద శ్రామికుల 'దీనావస్థ' మరొకప్రక్క శ్రామికుల కష్టాన్ని దోచుకొని బ్రిరబలిసిన సంపన్నవర్గాల భోగలాలసత వీటిమధ్యనున్న 'పెద్ద అఘాతం' మనకు స్పష్టంగా గోచరిస్తుంది. రేబళ్ళు చెమటోడ్చి పొలం పండించి భూస్వామ్య దొరబాబులకు కమ్మని పంచభక్ష్య పరమాన్నాలు అమర్చిపెడతాడు కాని ఆ కష్టజీవికి కడుపునిండా గంజినీళ్ళు కూడా కరువే! తమకుంటానికి తలదాచుకొంటానికి గూడా పూరిగుడిసెక్కూడా నోచుకోకుండా భాగ్యవంతులు నివసించుటకు విలాసవంతముతైన సుందర సౌధాలు నిర్మించిపెడతారు శ్రామికులు దిసమొల కప్పుకొంటానికి గోచిపాత-పాత చినుగుపేలికకు కూడా నోచుకొనకుండా కష్టజీవులు- కోటేశ్వరులకు కట్టుకొని కులకటానికి పట్టుపీతాంబరాలు నేసి పెడతారు! ప్రొద్దస్తమానం కష్టించి కొంచెంసేపు నడుంవంచి కునుకు తీయటానికిగూడా కుక్కిమంచనికి కూడా గతిలేకుండా- శ్రామికులు భాగ్యవంతులు హాయిగా సుఖనిద్రపోవటానికి

మెత్తని హంసతూలికా తల్పాలు సిద్ధం చేసి యిస్తారు. ఈవిధంగా- ధనిక భూస్వామిక- పెట్టుబడిదారీ బడాబాబుల "సకల సుఖసంపదలు" సమకూర్చి పెట్టడానికి శ్రామికవర్గాలు- వుంటానికి 'కొంప' తింటానికి తిండి- కట్టు కొంటానికి గుడ్డలేకుండా- జీవితాంతం చెమటోడ్చి కండలు కరిగించి తమ 'కనీససుఖం' గూడా "బలి"వెడుతున్నారు! పరోక్షంగా మహాకవి సంపన్నుల దోపిడీని శ్రామికవర్గాల దీనావస్థను చెపుతాడీపద్యంలో- కరుణరసభరితంగా మానవతాదృష్టితో !

స్వప్నకథలో చందమామలోని పేదరాశిపెద్దమ్మ 'దీనగాథ'ను గూడా మానవతముట్టిపడు- కరుణరసముట్టిపడునట్లు చెపుతాడు. ఒక రెడ్డిసాని బిడ్డగా పుట్టిన పేదరాశిపెద్దమ్మ- అనదగామరోసాలె (చేనేత)వారింట పెరిగి- 'సవతి' సోదరీసోదరులు పెట్టే బాధలకు నిల్లువీడి భిక్షుకురాలుగా జీవిస్తూ- మరోవృద్ధ భిక్షుకుని ఆదరించి- భిక్షాటనంతో "ఒక్కనాడుగుడిచి యొకనాడు పస్తుండి- నెత్తికొంగుమీద నిదురబోయి" తాను గడించిన నాలుగణాల డబ్బులలో కొంత ఓ నిర్భాగ్యురాలైన" బ్రహ్మణ విధవ కొసగి-అపవాదులు- అభాండాలు భరించి- చివరగా ముసలి భిక్షగాడి రూపంలో తానాదరించిన 'దైవ' కృపచే చందమామలో శాశ్వత స్థానం పొందిన

—"పేదరాసిపెద్ద" దీనగాథ"

వాడు చెమ్మటలోడ్చి ప్రపంచమునకు
భోజనముపెట్టువానికి భుక్తిలేదు-గబ్బిలం

రైతుకూలీ- కర్షకుడు- ఆరుగాలం రెక్కలు ముక్కలుచేసి చెమటోడ్చి యెండనక వాననక- పొలాల్లో బంగారుపంటలు పండిస్తాడు. అందరికీ కడుపునిండా భోజనంపెట్టి సుఖపెడటానికి శ్రమిస్తాడు కాని వాడికే కనీసం 'అంబలి'కి గూడా గతిలేదు అంటే పరోక్షంగా మహాకవి భూస్వామ్యవర్గం అమాయక రైతుకూలీ వర్గాన్ని "దోచుకుతినడాన్ని ఎత్తి చూపెడుతున్నాడు.

మసలుచున్నవె బ్లాకు మార్కెట్లు జలగలు
నరమాంస రక్తపానమున దనిసి
దొరుకునే నీవీటి నిఖపేద జాతికి
చిట్టెడు కొలత గింజయలకూడు —నాకథ

సామాన్య జనబాహుళ్యాన్ని ధరలుపెంచి- పీల్చి పిప్పిచేసే జలగల వంటిబ్లాక్ మార్కెట్టుదార్ల గురించి హెచ్చరిస్తున్నాడు."పెరటిబేరాలు సాగించి ధరలుపెంచు మాయ మార్కెట్లవారి గమ్మత్తులరసి" జాగ్రత్తగా మసలుకో మంటాడు మహాకవి.

"హృదయము లేని లోకము సుమీ యిది" అంటూ "ప్రాణమున్న బీదవాని కన్నుల జూచి బాగుచేయు ధర్మపరుడు లేడని" ఆవేదన చెందు తాడు. ఈ దేశములో "సనాతన ధర్మ ధేనువుల్ పిదికినపాలు పేదకు లభింపవు" అని బాధపడతాడు. "పూడునా కూటికల్లాడు పేదల డొక్క ముప్పూటలభిమతంబులు ఫలింప" అనీ "దిగివచ్చునా ధనాధిపుల మందపు సామాన్య మానవ సదనములకు"- అంటూ నెత్తి పైకిబోయిన భాగ్యవంతుల కళ్ళు పేదకష్టజీవుల్ని చూసేరోజు, ఆరని మంటతో మలమలమాడే పేదల డొక్కలు ముప్పూట నిండే రోజూ అసలు వస్తుందా యని సందేహం వెలి బుచ్చుతున్నాడు మహాకవి.

"పదవుల పీఠలెక్కి యను వారము లంచపు బాడిబర్రెలం బిదికి గడించి కార్మికుల పేదల చెమ్మట దెచ్చి కాన్కలిచ్చెదరు పరోప జీవులు- విచిత్రపు భక్తులు వేషదార్లు" అధికారం చేజిక్కించుకొని "పాడిబర్రెలనుండి పాలు పిదికినట్లు శ్రామికుల నుండి సామాన్య పేద జన బాహుళ్యం నుండి "లంచాలు" గుంజి దేవుళ్ళకు కానుకల్ని- కట్నాలు సమర్పించడం నిరసిస్తు న్నాడు టాషువా. కానరాని "గొప్ప ధనవంతుని విద్దపు బాలరాతి గోరీకడ— బారవేయ బడ్డ పేలికలం బొరలాడు ప్రేతమే యాకటిచిచ్చునన్ గుమిలి, యార్చి దతించిన పేదవాని దౌనో గదా!" అంటూ "దానికై వగవడొక్కడు దాచరు కాటినేలయున్" (శ్మశానము) అని మహాకవి ఆవేదన వ్యక్తం చేస్తాడు- "లైకా!' (రోదసీలోనికి రష్యా రాకెట్‌లో పంపిన మొదటి ప్రాణి) "గుండెలు లేవు మానవులకున్" నిను యనంత రోదసీ మండలయాత్రకై పంపటాని కంటాడు. ఇక్కడ ధైర్యం లేదనీ- హృదయం లేదని అర్థం !- ఢిల్లీలో జాతి సంస్కృతి చిహ్నంగా వున్న బేబరు మసీదు చెంత- వందలాది నికృష్ట పేదల గుడిసెల్నిచూచి బాధపడతాడు.

## 3. మతం పేరిట మానవునికి జరుగుతున్న అన్యాయంపై నిరసన.

ప్రతిమల పెండ్లి సేయుటకు వందలు వేలు వ్యయించుగాని దుః
ఖిత మతులైన పేదల పకీరుల శూన్యములైన పాత్రలన్
మెతుకు విదల్పదీ భరతమేదిని ముప్పది మూడుకోట్లదే
వతలెగ వడ్డదేశమున భాగ్య విహీనులక్షుత్తులారునే ! (గబ్బిలం)

రాతి విగ్రహాలను 'ఇలవేల్పులుగా' భావించి- యిష్టదైవాలుగా సంభ వించి-"కళ్యాణాలు" చేయడానికి వందలు వేలు ఖర్చు చేస్తారు సంపన్నులు. కాని బిక్షగాడి పాత్రలో 'చల్ది' మెతుకువేయరు సరికదా ! ఛీపో ! అని చీద రించుకొంటారు! కసరు కొంటారు. ఈ భరతభూమిలోని ముప్పదిమూడు కోట్ల దేవతలకు నిత్యనైవేద్యాలు పెట్టటానికే, గుడులు గోపురాలు కట్టటా నికే ధనవంతుల సొమ్ము వెచ్చిస్తుంటే- పేదల డొక్కలు పూడుతాయా అని- వాళ్ళ ఆకటి చిచ్చు ఆరుతుందా అని సందేహిస్తాడు జాషువా. ఈ విష యాన్ని యింకోచోట స్పష్టంగా చెప్పాడు.

కుడుపుమని చెప్పి బంగారు గుడులు గట్టి
పెట్టుచుందురు నరులు నైవేద్యములను
సృష్టికర్తక-దాని భుజింపడతడు
భిక్షకునిచేత యెంగిలి పిడచకాక (అనాథ)

దేవుళ్ళకు బంగారు గుళ్ళుకట్టి- పంచభక్ష్య పరమాన్నాల్ని నైవేద్యా లెట్టి 'అరిగింపు'చేస్తారు. ఇంతకీ ఆ రాతివిగ్రహాలా నైవేద్యాల్ని అరగించవు! దేవుడి నైవేద్యం పేర- ప్రసాదాలంటూ సుష్టిగా అరగించేది ఆ భాగ్య వంతులే ! అయితే భిక్షుకుల పాత్రల్లో 'కనీసమామా'ప్రసాదాల మెతుకుగాని- చల్ది అన్నం కాని యింతవేయరని ఎద్దేవా చేస్తున్నాడు మహకవి.

"ఎవరడిగినారు నిన్నీ అవకతవక సృష్టి సేయమని ? సృష్టికర్తనే ప్రశ్నిస్తున్నాడు "కొత్తలోకం" తవ్య సృష్టికర్త జాషువా!

బత్తెము చేసి నావు గద ప్రాణులనెల్ల దయా విహీనమౌ
మిత్తికి; హాయిగా సకల మేదిని మీద నిరంకుశంబుగా
పెత్తన మాచరించుచును పేదకు బొక్కెడు కూడొసంగ నీ
చిత్తము సమ్మతింపదొ విచిత్రము లీ వలపక్షపాతముల్- (కొత్తలోకం)

సకల జీవకోటిని మృత్యువుకు ఆహారంగా చేసినావు. కాని పేదకు బొక్కెడు బువ్వలేకుండ చేస్తున్నా వేమిటీ వలపక్షపాతమని దైవాన్ని నిల దీస్తున్నాడు నిర్భయంగా మహాకవి.

గుంపెడు బిడ్డలన్ మెడలకుం గుదిగట్టి నివాసముండగా
కొంపలు గోడులుం దినుట కుంబిడికెం డశనంబు నీక, పూ
జింపని వారలన్నరకసీమల ద్రోయుదునంచు వార్తలం
బంపెదవేల నీయనుగు భక్తులచేత నిలింపనాయకా (కొత్తలోకం)

గుంపెడు పిల్లల్నిచ్చి-కూడూ- గూడూ - గుడ్డ లేకుండ పేదలకు కష్టాల 'కర్మ' సిద్ధాంతం అంటగట్టింది చాలక, దేవుణ్ణి భక్తితో పూజింపని వారలకు మోక్షప్రాప్తి స్వర్గలోక ప్రవేశం లేదని- దేవుడి తాబేదారులైన వేదాంతులు- పూజరులచేత మత బోధలు చేయించటాన్ని- దేవుణ్ణి ప్రశ్నిస్తు న్నాడు మన కవి.

రేణువులలోన నీవాక
రేణువవను మాట మరచి సృష్టించెదవా
ప్రాణాంతకముల నాగ్నిక
బాణాలధికార కాంక్ష పరమ ద్రోహీ ! (కొత్తలోకం)

అనంత సృష్టిని సృజించి- సృష్టిలోని సకల చరాచర జీవకోటిలో 'అణువణువున' ఆత్మరూపంలో వుండి కూడా ప్రాణాంతకమైన "అణుబాంబు" సృష్టిస్తావా అని దేవుణ్ణి నిలదీస్తున్నాడు. అంటే అణుబాంబును సృష్టించే తెలివితేటలు మనిషి కెందు కిచ్చావన్నది కవి హృదయం !

వట్టి యమాయ కంబలయి, పట్టెడు మేశకు రక్తమాంసముల్
కట్టిడి మానవాళి సుఖంబల కైవ్యయపెట్టి తిట్టినన్
కొట్టిన నోర్చు జంతువుల గొంతుల నూడిచి సత్తికొల్పులన్
బెట్టెద రసజ్ఞు లెప్పటికి నీ హృదయంబు ద్రవించునో ప్రభూ !
(కొత్తలోకం)

నోరులేని అమాయక మూగజీవులు మానవాళికి తోడునీడగా వుంటే జంతువుల్ని దేవుళ్ళను "తృప్తి" పరచటానికి "బలి" యివ్వటాన్ని యిచ్చే

వాళ్ళను కాదు- ఆదేవుణ్ణే ప్రశ్నిస్తున్నాడు మహాకవి. "జీవకారుణ్యాన్ని" సమర్థిస్తున్నాడు. మానవత అంటే మరి అదే గదా!

అన్నము దైవమాయని యహర్నిశమున్ దుర పిల్లుపేదకున్
గన్నులు చెమ్మగిల్ల చిరకాలము నీ "పరమాత్మ" మిష్టమృ
ష్టాన్నముగా భుజింపు మని యాకవి దీర్పగ జాతువేల, ఆ
పన్నుల కేమి మేలు ధనవంతుల మేలుకె మంత్ర తంత్రముల్
(కొత్తలోకం)

ఆకటిచ్చితో "మలమల మాడే పేదలకు" పరమాత్మ తత్త్వ బోధల వల్ల కడుపు నిండుతుందా! ఆ జపతపాలు సంపన్నులకోసమే కాని పేద వాడికి ముందు కడుపు నిండాలి! దైవాన్ని యీ విషయమడుగుతున్నాడు.

మత మొక కంచుకోటవలె మానవ దుష్కృతి గప్పిపుచ్చి యు
చితమగు నైకమత్యమును చిందరవందర జేసి భిన్న దై
వతముల నీని, సంకుచిత భావములం బురిగొల్పి స్వార్థ దూ
షితులగు పీఠికాపతుల జీవిత యాత్రకు తోడు సూపెడిన్
(స్వయంవరం)

మానవులు చేసే "సర్వపాపాల్ని" కప్పిపుచ్చటానికి- నానాదేవుళ్ళ పేరుతో మానవులలో 'మతవైషమ్యాలు' పురికొల్పి అనైక్యం పాదుకొల్ప టానికి- సంకుచిత 'స్వార్థ' మత పీఠాధిపతుల జీవితాలు బాగుపరచటానికి "మతం" కంచుకోటలాగా పనిచేస్తున్నదని మహాకవి నిర్ద్వందంగా చెప్పాడు.

పూజారి భోషాణమును కాపలాకాయు
　　చిల్లర దేవుళ్ళ సేవజేసి
గొర్రెపోతుల నల్ల జుట్టి గరుసినదేర్చు
　　కరకు సత్తులకు జాతరలు సల్పి
ఏటేట పెండ్లి చేయించు కొంచురయించు
　　కృతకరాముల పల్లకీలు మోసి
నిలువుదోపిడి చేసి తలకాయ గొరిగించు

ఏడుకొండలవాని మేడలెక్కి
అంబుధీశుని కల్యాణులని తలంచి
ముంచు గంగమ్మలకు డబ్బు పోసిపోసి
పాతకము వోలె నావెన్ను బాయకున్న
గోచితో నిల్చి యున్నాడ పేచకంబు (గబ్బిలం)

మూఢ మతాచారాలు కర్మకాండల వల్ల సామాన్య మానవు డెంతగా దోపిడీకి గురి అవుతున్నాడో- యెంతగా నలిగిపోతున్నాడో జాషువా కవి యీ పద్యంలో పూసగ్రుచ్చినట్లు వివరించాడు. పూజారుల అక్రమార్జనకు తోడుపడు చిల్లర దేవుళ్ళను కొలిచి, కోలిచీ గొర్రెల బలి యిచ్చి 'సత్తు'లకు జాతరలు చేసి చేసి ఏటేట బొమ్మలపెండ్లి చేసుకొనే 'సీతారాముల' నవ వధూవరుల 'పల్లకీలు మోసిమోసి, తలనీలాలు తీసుకొని నిలువు దోపిడీచేయు ఏడుకొండలవాడి 'కొండ' లెక్కిలెక్కి గంగమ్మ తల్లులకు పూలు-పండ్లు-డబ్బులు 'నీళ్ళపాలు చేసిచేసి- సామాన్యుడి వెన్నువిరిగి గోచిపాతతో మిగిలాడని మహాకవి నిక్కచ్చిగా చెప్పాడు.

"ధనికుల్ సోమరిపోతులై కటికి పేద న్నెత్తురుల్ పిండి కూర్చిన విత్తంబును వెచ్చబెట్టి ధరణిన్ జీర్ణించియున్నట్టి రామునకోరంగనికో నిఖిలావసరంబుల్ సల్పుచున్నందుకు" మహాకవి బాధపడుతున్నాడు. పేదల రక్తం పీల్చి గడించిన సొమ్ముతో జీర్ణదేవాలయోద్ధరణకు పూనుకొనే 'మూఢ' సంపన్న భక్తుల్ని నిరసిస్తున్నాడ కవి. అలానే "ఈ భ్రాతృక్లేశము లీక్షుధార్త భారతాంబా దీర్ఘదారిద్ర్యమున్" కళ్ళతో చూస్తూ గూడా- ఏమీ పట్టించుకోకుండా- "సీతారాముల పెండ్లి పేరటముల్ శ్రీకృష్ణ రాధారతుల్ త్రేతా ద్వాపర యజ్ఞకర్మల్ని" కథావస్తువులు"గా తీసికొని, "చేతన్ గంటము బట్టి" వుక్కిటిపురాణ శృంగారకవితలు- కావ్యాలు రాసే "ఛాందస"కవుల్ని దెప్పిపొడుస్తున్నాడు అభ్యుదయ దృష్టి గల జాషువా. హిందూ సమాజంలో వేదకాలం మినహాయిస్తే- వేలాది సంవత్సరాల నుండి అన్నివిధాల 'అణచి' వేతకు గురి అయినది. బలియైనది భారతీయస్త్రీ. మహాకవి మాటలో చూస్తాం.

అత్తమామల క్రూరమైన దాడికి లొంగి
పలుకాడరాని కోడలి తనంబు

మగని యాయువులతో తెగి ముండమోయించి
గేలిగొట్టించు నిల్లాలి తనము
పతిభ క్తురాలన్న పదగౌరవము దక్క
సౌఖ్యంబెఱుంగని చానతనము
అన్నదమ్ములవోలి నా స్తివాస్తులమీద
హక్కులించుకలేని యాడుతనము

ఒక్క భరతవర్షయువతీమణికినీక
తగవటంచు బిట్టుబొగడుచుండు
మోసగాం(డనమ్మిపూజించు నినుజూచి
శిష్టజనులకన్ను చెమ్మగిల్లు (ఖం.కా.5)

అత్తమామలు ముఖ్యంగా 'అత్తగారి' ఆరళ్ళతో అల్లాడిపోయే అత్త వారింటి కోడలుగా, భర్తమరణంతో ముండమోయించి శిరోముండనం గావించి- సంఘంలో యేలాంటి గౌరవం నోచుకోని యిల్లాలుగా, పతి(వత అన్నబిరుదంతగిలించి- యింటిలో మగనికి- అత్తమామలకు- కన్నసంతానానికి- (బతికినంతకాలం 'వెట్టి'చాకిరి చేస్తూ 'సుఖమంటే యేమిటో యెరగని గృహిణి'గా, తల్లిదం(డుల ఆస్తుపాస్తులలో 'అన్నదమ్ములతో సమానభాగం హక్కులేని 'అబల' 'ఆడుది'గా- భారతీయస్త్రీ దయనీయ 'దుస్థితి' చూచి హృదయమున్న 'శిష్ట'జను లెవరైనా నిట్టూరుస్తారని- వారికన్నులు చెమ్మగిలుతాయని మహాకవి లెస్సగా పల్కాడు.

అబలయన్న బిరుద మంటించి కాంతల
స్వీయ శక్తు లదిమి చిదిమినారు
సబలయన్న బిరుదు సాధించి హక్కులు
గడన చేసి కొమ్ము కష్టచరిత (ఖం.కా.5)

'అబల'ను చేసి స్త్రీలోని సహజ శక్తి సామార్థ్యాల్ని అణివేసిందీ పురుషాధిక్య హిందూసమాజం. ఈ పచ్చి నిజాన్ని తెలుసుకొని- మేల్కొని- "సబల"గా మగవారితో సమానహక్కులు- సంఘంలో గౌరవం సాధించుకో మని హితవు చెపుతున్నాడు స్త్రీజాతికి జాషువా కవి.

ఈ విధంగా సమాజంలో కులాలపేరుతో- మతాలపేరుతో- వర్గాల చాటున- ఒక మనిషి మరొక మనిషిని దోసుకుతినడాన్ని-దోపిడీ చేయడాన్ని-హింసించటాన్ని - స్వార్థబుద్ధితో- అధికారమదాంధతతో - పెత్తనం చేసి పీడించుకతినడాన్ని మహాకవి తన కవితల్లో- కావ్యాలలో కమనీయ కవితా రీతిలో- నిశ్చయంగా నిర్ద్వంద్వంగా నిరసంచాడు- విమర్శించాడు.

ఇంతగా సమాజంలోని అన్యాయాల్ని- అక్రమాల్ని- అధర్మాల్ని ఖండించిన మహాకవి- "ఇతరులకు నీతులు బోధించడం తేలికే - తాను మాత్రం ఆచరించడన్న" లోకోక్తి నిందరాకుండా తాను ఆదర్శప్రాయుడుగా 'నిరాడంబరుడి'గా సామాన్య జీవితాన్ని గడిపాడు. ఆ విషయాన్ని ఆయనే చెప్పుతున్నాడు-"

సంసారయాత్రకు చాలినంతకు మించి
    గ్రుడ్డిగవ్వయు కోరుకొననునేను
ఆలుబిడ్డలకునై యాస్తిపాస్తులు గూర్ప
    పెడత్రోవలో పాదమిడనునేను
నేనాచరింపని నీతులు బోధించి
    రానిరాగము తీయలేనునేను-
నివసించుటకు చిన్న నిలయమొక్కటిదక్క
    గడనసేయుట కాసపడనునేను
కులమతాలు గీచుకొన్న గీతల జొచ్చి
పంజరాన గట్టు వడనునేను
నిఖిలలోక మెట్లు నిర్ణయించిననాకు
తరుగులేదు విశ్వనరుడ నేను (ఖం. కా.)

జాషువా చెప్పుకొన్నట్లే- ఆయన స్వార్థంతో యెట్టి ఆస్తిపాస్తులు సంపాదించుకోలేదు. గుంటూరులోని గృహం గూడా- గుంటూరు పొగాకు కంపెనీ యాజమాన్యం వారి వదాన్యత వలన - ఏకా ఆంజనేయులుగారి పుణ్యంవల్ల సమకూరిందే !

అహింస కవచంబుగా- సహనంబు మహాయుధమ్ముగా- "ఆడిన మాట తప్పక" 'మహాత్ముని చెప్పులజాడలోన కాలాడ చరించి' "వైరినమ్మకాలూడ"

బెరకటానికి- వర్ణభేదపుంజాడ నడంచటానికి- 'సమాజంలోని కటికచీకటి' బాపటానికి— మహాకవి జాషువా కలం పట్టుకొన్నాడు. కమనీయ- రమణీయ కవితలు జీవితాంతం పుంఖాను పుంఖంగా వెలయించిన "మానవతాస్రష్ట". ఆయన చివరగా మహాకవి జాషువా ఆకాంక్ష ఏమిటో అమాటల్లో- ఆయన కవితల్లోనే చూడండి !

రాక్షసంబైన స్వార్థ జ్వాల చల్లారి
విశ్వధర్మము కండబెట్టుచోటు
వంచనాకవచంబు వ్రక్కలు గావించి
అలఘు సత్యజ్యోతి వెలుగుచోటు
ఎదిరి కష్టసుఖములెల్ల స్వీయములుగా
కోరి నరుడు పంచుకొనెడి చోటు

.... .................................

ఎల్లజాతులవారలే కోదరుల యట్లు
ముద్దుముద్దుగ పొంది పొసగుచోటు
వెలితిచే శుష్కించు పేదసాదల డొక్క
ముప్పూట లనువుగా బూడుచోటు-

.... .................................

చింతలేనిచోటు సిరులు పండెడుచోటు
ప్రేమరస నాహినులు వెల్లివిరియు చోట్లు

కావాలని రావాలని మహాకవి ఆరాటపడుతున్నాడు. ఆకాంక్ష వెలిబుచ్చుతున్నాడు "దుర్మతములపేరిట తలయెత్తు నెత్తుటి కలహారభస" సమసిపోవాలంటాడు. "కఱకుటాకటదూలిక్షుభితమౌ దీన భిక్షుకచయంబు" యెక్కడా కనిపించకూడదని ఉబలాటపడతాడు! "వ్యత్యయంబైన తీవ్రాస్పృశ్యతా జాడ్య మన్నివిధాల రూపు"మాసిననాడు-" జ్ఞాన మత సాంఘిక స్వేచ్ఛ నల్వురకును నేకరీతిని లాభించు"నాడు, "విశ్వసౌభ్రాత్రంబు వెలయించు నైక్య సంఘవ్యాప్తి దిశల పెంపారు. నాడు "భావిభారత కల్యాణ పరమ సుఖము" ప్రాప్తిస్తుందని ఆకాంక్ష వెలిబుచ్చుతాడు. "ఊరకపోదు బుద్ధుని మృదూక్తి పటుత్వము క్రీస్తు ప్రేమ వాక్సారము రామకృష్ణ ము

చంద్రుని తాత్విక సౌరభంబు" అని అంటూ "బాపూజీ బుద్ధుడు క్రీస్తు నడచిన వజ్రమార్గంలోనే నొక అజ్ఞాత ప్రవాసిని" అని చెప్పుకున్నాడు! మరణం లేని మానవత్వాన్ని కామించు కవితా వీణపై నేను మ్రోయించిన వ్యథా తంత్రులేనా(ఖండ)వాక్యాలని చక్కగా చెప్పాడు. గబ్బిలం 'కన్నీటికథ' "అశ్రుసందేశం", అనాథ ఒక "సలసల క్రాగిచిందిన కన్నీటి బిందువు" 'పిరదౌసి' ఒక్కొక నెత్తుటి బొట్టుతో ఒక్కొక పద్యం చెక్కిన కావ్య శిల్పం కాందిశీకుడు- యుద్ధోన్మాదంతో మానవ మారణ హోమానికి చరమగీతం పాడే శాంతి సందేశం'. మానవతకు ఏతామెత్తే "కరుణ వీర రసం" జాషువా కావ్యాలనిండా దండిగా జాలువాఉు తుంటుంది'. "విశ్వమానవ సామ్రాజ్యం- నిర్మత- నిర్జాతి సంఘం నా ఆదర్శం" అని అభిభాషించాడు." కోటాను కోట్లు నరులొక మేటి జగన్మాతృ సుతులు మిత్రులని మదించాటింపు మీ సువార్తన్ జాటింపుము జీవితంబు సార్థక్యమగున్" అని అంటూ "కులమత రాజకీయములకున్ గురికాక సమస్తలోక మంగళకరమైన సత్యమును కమ్మని వాక్కుల నిర్భయంబుగా" (ఆయన చెప్పినమాటల్లోనే) "కవిత్వం" పలికిన మహాకవి- "నవరచయిత" "మానవతాస్రష్ట" "మహామనీషి" మానవతా మూర్తి అయిన నవయుగ కవి చక్రవర్తి జాషువా కవి ! "విశ్వమానవ గోత్రేయ వీరకవి" మహాకవి జాషువా ఆశించిన "మానవత" మానవజాతిలో మూడు పూవు లారు కాయలుగా వెల్లివిరియాలనీ- వెల్లివిరుస్తుందని విశ్వసిస్తాం.



సంస్కృత సాహిత్యానికి కవిసామ్రాట్
విశ్వనాథ సత్యనారాయణ యోగదానం

# గుప్తపాశుపతనాటకం - తులనాత్మక పరిశీలన

—డా॥ పి. వరప్రసాదమూర్తి

20వ శతాబ్దంలో నవ్యాంధ్ర వాఙ్మయంలో కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ జగన్మోహినియవతారము. స్వకీయాసాధారణ సంమోహన రచనాపాటవంతో ఆంధ్రలోక పాఠకులను సంమోహితులను కావించిన విశ్వ కవి విశ్వనాథ. ప్రతిభా, వ్యుత్పత్త్యభ్యాసాలు అన్యూనాతిరిక్తంగా మిశ్రిత మైన విశ్వనాథవారి లేఖినీ నిష్పన్న కావ్యరాశి సాహితీ నభోమండలంలో విలసిల్లే ధృవతార.

సంస్కృతాంధ్ర విద్వత్కవిపుంగవులైన విశ్వనాథవారు ఆంధ్రభారతినే కాక

"జనని సంస్కృతంబు సకలభాషలకు"

అయిన సురభారతినికూడ సేవించి తరించి సుసంపన్నం చేసారు. సంస్కృతంలో "దేవీసప్తశతీ"- (300 శ్లోకాలు), "శివసప్తశతీ" (400 శ్లోకాలతో స్తోత్రసాహిత్యాన్ని పరిపుష్టం చేసిన పరమభాగవతోత్తముడు కవి సమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ. అంతేకాక

"నాటకాన్తం హి సాహిత్యమ్"

అని ఆలంకారికులచే ప్రశస్తమైన కావ్యభేదంగా కొనియాడబడిన నాటక సాహిత్యాన్ని సంస్కృతంలో మనకందించారు విశ్వనాథ.

"అమృతశర్మిష్ఠమ్", "గుప్తపాశుపతమ్" అనే రెండు అనర్ఘ నాటక రత్నాలు విశ్వనాథవారి సంస్కృతపాండితీ వైభవానికి చక్కని నిదర్శనాలు. అకారాదిక్రమంలోనేకాక, నాటకరచనా కాలక్రమాన్ననుసరించి కూడ "అమృతశర్మిష్ఠమ్" విశ్వనాథవారి మొట్టమొదటి సంస్కృత నాటకము. ఈ నాటకాన్ని వ్రాసిన సుమారు 25 సంవత్సరముల తరువాత "గుప్త పాశుపతమ్" అనే నాటకాన్ని వ్రాసారు. అనేక విధ సాహిత్య ప్రక్రియల

స్రష్ట అయిన విశ్వనాథవారి పరిణతప్రజ్ఞా నిష్పన్న సృష్టియే "గుప్త పాశుపతమ్".

"ప్రఖ్యాతమితివృత్త మితిహాసకథోద్భూతమ్"[1]

అనే ఆలంకారికవచనానుసారం మహాభారతేతిహాసం నుండి కథావస్తువు గ్రహింపబడినది. 18 రోజులపాటు జరిగిన కురుపాండవ మహాసంగ్రామ వర్ణనయే యిందలి ప్రధానకథావస్తువు. కాని కేవల యుద్ధవర్ణనాత్మకమైన దృశ్యకావ్యం కాదిది.

వ్యాసమహర్షి మహాభారతాన్ని రచించి
"యతోధర్మ స్తతో జయః"

అని ఏ ధర్మసిద్ధాంతాన్ని లోకానికి చాటిచెప్పాడో, అట్లే ప్రాచీన శాస్త్రకారులు పురుషార్థచతుష్టయంలో మొదటిదైన ధర్మమే సర్వత్ర, సర్వకాలావస్థల యందు అజేయంగా నిలుస్తుందని శాస్త్రాలలో నిరూపించారో అట్టి ధర్మ విజయాన్ని "గుప్తపాశుపతమ్"లో చిత్రించి ఆర్షధర్మపునః ప్రతిష్ఠాపనకు తమవంతు కర్తవ్యాన్ని నిర్వహించారు విశ్వనాథవారు.

"ధర్మ ఏవ హతో హన్తి
ధర్మో రక్షతి రక్షితః ।

తస్మాద్ధర్మం న త్యజామి
మా నో ధర్మో హతోఽవధీత్ ॥"[2]

అన్న యుధిష్ఠరవచనాన్ని కవిసమ్రాట్ చరితార్థం చేసారు "గుప్తపాశుపత" నాటకరచనతో. ఇదే అంశాన్ని నాటకకర్త ప్రకరణానుగుణంగా పదేపదే వివిధ పాత్రలద్వారా పలికించారు.

"భీష్ముడు—బాలకిపాత్రతో మాట్లాడుతూ
ధర్మో జయతు. శ్రీకృష్ణో జయతు. నిత్యబుషిర్నరోజయతు."[3]

---

1. సాహిత్యదర్పణం-విశ్వనాథకవిరాజు. షష్ఠపరిచ్ఛేదము.
2. శ్రీమన్మహాభారతమ్-వనపర్వమ్. -వ్యాసః
3. సంస్కృతగుప్తపాశుపతమ్-చతుర్థాంకము-పుట-35.
బొంబాయి, ఆంధ్రమహాసభ, బొంబాయి-1975

"ధర్మమే జయింపనిమ్ము. భగవంతుడైన శ్రీకృష్ణుడేపక్షమున నుండెనో అదియే జయించుగాక"[4] అని

అట్లే ద్రోణుడుకూడ బాలకిపాత్రతో

"భగవంతుడు వారి పక్షమున నున్నాడు. ధర్మము వారి పక్షమున నున్నది."[5]

అని ధర్మవిజయానికి ప్రాతినిధ్యం కల్పించబడినది.

నామౌచిత్యం :- పది అంకాలుగా విభక్తమైనదీ నాటకము. తెర యెత్తగానే పాండవాగ్రజుడైన ధర్మజుడు "కౌరసేనాబలం 11 అక్షౌహిణులని, కౌరవసేనానాయకులు తమతమ పరాక్రమాన్ననుసరించి పాండవ సేనలను రెండు నెలలు, నెల, పది, అయిదురోజులలో నాశనం చేయగలమన్న" వార్తను గుప్తచరులద్వారా తెలిసికొని వ్యాకులితచిత్తుడై భీమసహదేవులతో యిదే విషయంపై మంత్రాలోచనను సాగిస్తూ కనిపిస్తాడు. అంతలోనే పాండవమధ్యముడైన అర్జునుడు ప్రవేశించి శత్రుబలవృత్తాంతాన్ని విని నీరు కారిపోవుచున్న యుధిష్ఠురునకు ధైర్యాన్ని చెపుతాడు. ఇంకనూ నరుడైన అర్జునుడు "11అక్షౌహిణుల కౌరవసేనాబలం, ఏడు అక్షౌహిణుల పాండవ సేనాబలం కలిపి పద్దెనిమిది అక్షౌహిణుల సేనలను కన్నుమూసి కన్నుతెర చేంతకాలంలో నాదగ్గరనున్న పాశుపతాస్త్రప్రయోగంతో బూడిదచేయగలను. కాని యుగాంతములో లయకారుడైన శివునిచే ప్రయోగింపబడే యీ పాశుపతాస్త్రాన్ని రేపు జరుగబోయే భారతసంగ్రామంలో ప్రయోగించను. నాదగ్గర నున్న యితరాస్త్రాలతోనే శత్రుసంహారాన్ని కావిస్తాను" అని అంటాడు.

శివుడు ప్రళయాంతమందు భస్మీపటలము
మూడు లోకంబులను జేయఁబూను శరము
పాశుపతము నాచేతిలోపలను గలదు
తలచికొన్నను నేఁజేయగలను దాని.[6]

---

4. తెలుగు-గుప్తపాశుపతమ్-నాల్గవఅంకము-పుట-35
5. తెలుగు-గుప్తపాశుపతమ్ ఆరవ అంకము-పుట-78
6. తెలుగు గుప్తపాశుపతమ్-ప్రథమాంకం-పుట-20

అట్లు సుదర్శనాయుధముతో శ్రీకృష్ణుడు చేయగలడు. పాశుపతముతో శివుడు చేయగలడు. నేను చేయగల్గుదును. మేము ముగ్గురమే దానికి సమర్థులము. దీనిని భీష్మద్రోణు లెరుగరు. కర్ణుడెవ్వడు దీని నెఱుంగుటకు, అశ్వత్థామ గురుపుత్రుడు.

మూడు లోకంబు లెల్లను గూడియెత్తి
వచ్చినను యుద్ధమందునఁ జచ్చునను ము
ధర్మరాజకేశంబు కదల్పలేవు
జమునికొడుకు భారతదేశ చక్రవర్తి[7]

"పాశుపతము ఘోరాస్త్రము నల్పులమీద ప్రయోగించరాదు. అది శివప్రీతికరము కాదు," అని నరుడు యథార్థవిషయాలను వచించాడు. సంస్కృతనాటకంలో కూడ

మయా ప్రతిజ్ఞాతమిహాహవేఽహం
న ఘోరదివ్యాస్త్రచయం ప్రయుంజే ।
పరైః ప్రయుక్తం విఘటిష్యతే మయా
రిపూన్ హనిష్యామి శరైర్మనుష్యైః [8]

అని ఎంతటి దారుణతర పరిస్థితులెదురైనప్పటికినీ పాశుపతాస్త్ర ప్రయోగం కిరీటిచే కావింపబడని కారణంగా విశ్వనాథవారు నాటకానికి 'గుప్తపాశుపతమ్' అని శీర్షికనుంచుట ఎంతో ఔచిత్యావహంగా భాసిస్తున్నది.

నాటకంలో నాయకుడు :- నిష్కళంకశీలి, నిరుపమాన శౌర్యధైర్యసంపన్నుడు, భారతమహాసంగ్రామంలో పాండవ విజయానికి ముఖ్య కారకుడైన నరుడే నాటక నాయకుడు. యుద్ధ నీతినియమాలు స్వపక్షానికి, శత్రుపక్షానికి సమంగా ప్రవర్తింపచేయలని, నిష్పక్షపాతవైఖరినవలంబించే ధర్మపరాయణుడు కిరీటి అనటానికి యీచిన్న ఉదాహరణను పరిశీలింపుము.

ద్రోణాచార్యుడు "అశ్వత్థామా హతః" అని బిగ్గరగా, ఆ తరువాత "కుంజరః" అని నెమ్మదిగా అన్న యుధిష్ఠురుని మాటలను విని అస్త్రసన్యా

7. తెలుగు గుప్తపాశుపతమ్-ప్రథమాంకం-పుట-21

8. సంస్కృతగుప్తపాశుపతమ్-అష్టమాంకం-పుట-71

సము చేయగా దానినే అదనుగా భావించి పాండవ పక్షవీరుడైన దృష్టద్యు మ్నుడు, ద్రోణాచార్యుని శిరస్సును ఖండించును.

ఈ వృత్తాంతాన్ని విన్న అర్జునుడు

"బావా ! ఇది న్యాయముగా నున్నదా ?

బాణము వీడి చాపమును బక్కకుద్రోసి. సమాధినిష్ఠుడై
ప్రాణము లుద్యజించుటకు, బ్రహ్మగతుండు ధనుఃశిశోగ్రపా
రీణుడు మాగురుండు సుదురీణుడు, బ్రాహ్మణుడట్టులుండగా
పోణిసి మాలి, యీ పనికిబూనుట మా తలవంపుకాదటే !

శ్రీకృష్ణుడు ........... .................................. ... ........

అర్జునుడు – శవముయొక్క శిరస్సును ఖండింతురా ?

...... శత్రువులను నిప్రపోవుచుండగా వధించువారిని సంహరింప వలెను"[9]

అని నిర్మోహమాటంగా స్వపక్షీయులచే కావింపబడిన దోషాలను ఎత్తిచూపి వారు శిక్షార్హులేయని నొక్కి వక్కాణించుట అర్జునుని ధీరోదాత్తతకు నిదర్శనము. ఎన్ని ప్రతికూలపరిస్థితు లెదురైనప్పటికీని ధైర్యోత్సాహాలను వీడక విజయశ్రీని వరించువరకు అవిశ్రాంతంగా పోరాడిన విక్రమశాలి అర్జునుడు.

నాటకంలో అంగిరసం – నాటకంలో ఆద్యంతం నాయకుడైన అర్జునుని యుద్ధవిషయకోత్సాహము ప్రధానంగా అభివ్యక్త మగుటవలన అంగిరసం వీరము.

"ఏక ఏవ భవేదంగీ శృంగారో వీర ఏవ వా
అంగమన్యే రసాః సర్వే.... .......[10]

అనే అలంకారిక సిద్ధాంతాన్ననుసరించి వీరరసం ప్రధానరసంగా కూర్చబడినది. మరియు నాటకంలో ప్రచురంగా ఓజోగుణగుంఫిత రచనను ప్రయోగించుటచే వీరరసం ద్యోతితమగుచున్నది.

---

9. తెలుగు గుప్తపాశుపతము-షష్ఠాంకము-పుట-81
10. సాహిత్యదర్పణము-విశ్వనాథకవిరాజు-షష్ఠపరిచ్ఛే.

**మూలకథలో లేనివి, నాటకకర్తచే చేయబడిన మార్పులు చేర్పులు :-**

నాటకకర్త ప్రకరణానుగుణంగా చేసిన మార్పులు, చేర్పులు ప్రధాన కథకు పరిపుష్టిని చేకూర్చేవిగా, రసనిష్యందోపేతములుగా నున్నవి. ద్రోణాచార్యుని అస్త్రసన్యాససమయమున- భరద్వాజ, విశ్వామిత్ర మహర్షుల ఆగమనం కవి కల్పితం.

భారతంలో మైత్రి అనే పదం వినగానే కర్ణదుర్యోధనుల గాఢ మైత్రి వెంటనే ప్రేక్షకులకు స్ఫురిస్తుంది. కాని విశ్వనాథవారు గుప్తపాశుపతంలో అశ్వత్థామ దుర్యోధనుల గాఢమైత్రిని చక్కగా చిత్రించారు. బాల్యంలో అశ్వత్థామకు దుర్యోధనుడు బంగారుగదను కానుకగా ఇచ్చుట, యుద్ధారంభానికి ముందు ఏకాంతంగా సుయోధనుడు అశ్వత్థామతో మాత్రమే మంత్రాలోచన చేయటం మున్నగు అంశాలు వారిద్దరిమధ్యనున్న స్వార్థరహిత, నిష్కళంక, త్యాగపూర్ణ, పవిత్ర స్నేహబంధాన్ని తెలుపుచున్నవి. అశ్వత్థామ అనవరతం త్రికరణశుద్ధిగా దుర్యోధనుని హితాన్ని అభిలషించాడు. యుద్ధంలో పాండవవిజయం, కౌరవపరాజయం తథ్యం అని తెలియగానే దుర్యోధనుని పాండవులతో సంధికంగీకరించమని కోరతాడు.

అశ్వత్థామ – ఇప్పటికిని మించిపోయినది లేదు. పాండవులతో నేల సంధి
 చేసి కొనము? వారి రాజ్యము వారికిమ్ము.
దుర్యోధనుడు- పాండవు లొప్పికొందురా?
అశ్వత్థామ– నేనొప్పింతును.
దుర్యోధనుడు- కర్ణుడర్జునుని చంపికాని ధనుస్సు విడువడు.[11]
అశ్వత్థామ– నేతనిని కూడ నొప్పింతును............
 మత్యువేనా అవధి? శాంతి కాకూడదా?"[12]

మరియు అశ్వత్థామ నిస్వార్థ స్వామిభక్తిపరాయణతకు మచ్చుతునక.
అశ్వత్థామ- నేను సేనాపట్టమడుగలేదు. నీవు కట్టవు అతనికి (కర్ణునికి)
 కట్టితివి. నేను మాత్రము నిన్ను వదలిపోలేను.[13]

---

11. తెలుగుగు ప్తపాశుపతము–అష్టమాంకము-పుట-100
12. తెలుగు గుప్తపాశుపతము-అష్టమాంకము-పుట-101
13. తెలుగు గుప్తపాశుపతము-అష్టమాంకం–పుట-101

సుయోధనుడు తుదిశ్వాసవిడిచేసమయమున ప్రక్కననిలిచిన ఆప్తుడు అశ్వత్థామ. తన మిత్రుని శత్రువులను తన శత్రువులుగానే భావించి వారి నాశనంకొరకు తన శస్త్రాస్త్ర బలాన్ని ప్రయోగించటం, అశ్వత్థామ హృదయమందు గూడుకట్టుకొన్న ప్రభుభక్తిని ఆవిష్కరించుచున్నది. ఈ విధంగా యీ నాటకంలో అశ్వత్థామ పాత్రను గొప్ప ఉదాత్తంగా మలిచారు నాటక నిర్మాత.

మూలకథలోలేనిది, నాటకకర్త ధీనిష్పన్నమైనది, అత్యంత చమత్కారోపేతమైన చేర్పు- ప్రమథగణంలో ఒకడైన పుష్యదంతుడను బాలాకిగా చిత్రించి ఆపాత్రద్వారా ప్రకరానుగుణంగా దిఙ్మాత్రంగా భవిష్యత్కథను సూచించుట. బాలాకి అశ్వత్థామకు ద్రోణవధవార్తను వినిపిస్తాడు. తన తండ్రివధ వినినంతనే అశ్వత్థామ మూర్ఛిల్లును. అట్టి అశ్వత్థామను చూచి

"అరే ! అయం మూర్ఛాం గతః. అనేన యుగాంతప్రళయం కారయితుమీహతే శివ ఇతి ప్రథ్యాకైలాససానుషు"[14]

చరమాంకంలో అశ్వత్థామ శివునుపాసించి, మహామహిమాన్వితమైన కృపాణమును పొంది, దానితో ఉపపాండవులను సంహరించును. ఈ వృత్తాంతముపైన పేర్కొనబడిన బాలాకి కథనం ద్వారా సూచించబడినది.

బాలాకి సుభద్రాదేవికి కౌబేరిని పరిచయంచేస్తూ........

"ఏతాదృక్లక్షణసహితః యస్యగృహే నివసతి తత్ర
కోఽపి నమ్రియతే. మృతశ్చేత్ పునరుజ్జీవయిష్యతే"[15]

ఈ కథనం ఉత్తరాగర్భస్థ శిశువు మరణించినప్పటికీ తిరిగి ప్రాణములను ధరించుట యను వృత్తాంతాన్ని సూచించుచున్నది.

సామాజికస్థితి ప్రభావము – నాటకకర్త పౌరాణిక లేక చారిత్రిక లేక సాంఘిక కథావస్తువుని గ్రహించి నాటకాన్ని నిర్మించేప్పుడు ఆనాటకంలో ఏదో ఒకచోట ఆనాటి సామాజిక పరిస్థితుల ప్రభావం తప్పక ప్రతి

---

14. సంస్కృత గుప్తపాశుపతమ్-సప్తమాంకము-పుట-54
15. సంస్కృత గుప్తపాశుపతమ్–నవమాంకము-పుట-75.

బింబితమగును. ఈ అంశాన్ని మనం "గుప్తపాశుపత" నాటకంలో యీ క్రింది సన్నివేశంలో గమనించగలము.

"బాలాకి—(సుభద్రతో) దుర్యోధనుడు శల్యుని తమసేనకు పట్టాభిషిక్తుని చేసెను.

సుభద్ర—బాలాకీ! అశ్వత్థామయుండగా, కృపాచార్యుఁడుండగా, దుర్యోధన మహారాజు శల్యుని సేనాధిపతిని చేయుటయేమి.

బాలాకి—అక్కడనే యున్నదియధికారుల రాజనీతి. దుర్యోధనుడశ్వత్థామ నడిగినాడు, సేనాపట్టమెవ్వరికి కట్టమందువని

సుభద్ర—అది యేమయ్యా ! ఎవడైన నాకిమ్మని యడుగునా ? మా మేన మామ కిమ్మనునా ?

బాలాకి—ఇదియే యుద్యోగము లిచ్చువారినీతి. ఎవఁడు దాని కర్హుడో వానిని పోయి యెవని కిమ్మందువని యడుగుము. ఇది రాజులుచేసేడి పని."[16]

ఈ విధంగా నాటకంలో విశ్వనాథవారు ఆనాటి రాజకీయ ధోరణిని చక్కగా జొప్పించారు.

తులనాత్మక పరిశీలన :- ఒకే రచయిత ఒకే కథావస్తువుతో రెండు భాషలలో నాటకాన్ని వ్రాయుట చాల అరుదైన విషయము. విశ్వనాథవారు మొతట గుప్తపాశుపత నాటకాన్ని తెలుగులో వ్రాసి,దానినే అనంతరకాలంలో సంస్కృతంలోకి తర్జుమా చేసారని తెలుగు నాటక ప్రకాశకులు, వారి తనయులైన పావనశాస్త్రిగారు పీఠికలో వక్కాణించారు. రెండు నాటకాలను పరిశీలించిన రెండింటిలో సామ్యవైషమ్యాలు అక్కడక్కడా దృగ్గోచరమగు చున్నవి.

తెలుగు సంస్కృతాలలో ప్రథమాంకం యించుమించు ఒకేలా నడిచి నది. ద్వితీయాంక ప్రవేశికలో అశ్వత్థామ స్త్రీవేషంలో దుర్యోధనునితో మంత్రాలోచన జరుపుటవరకు రెండింటిలో (తెలుగు సంస్కృతాలలో) చెప్పుకోదగిన భేదం లేకపోయినప్పటికీ సంస్కృతంలో దుర్యోధనునితో

16. తెలుగు గుప్తపాశుపతము—నవమాంకము—పుటలు, 112, 113.

కౌబేరి సంభాషణలో వానియమసదన గమనం అధికంగా కూర్చబడినది. తెలుగులో తృతీయాంకంలో సహదేవుడు "వదినగారైన సుభద్రాదేవిగారి ఆహ్వానం మీద వ్రతానికి వచ్చానని చెపుతాడు.

అదే ప్రకరణంలో సంస్కృతంలో అన్నగారైన అర్జునుని ఆహ్వానం మీద వ్రతవేదికను చేరుకొన్నానని సహదేవుడు చెప్పుట వైషమ్యము.

చతుర్థాంక ప్రవేశంలో బాలాకి ఘటకుల సంభాషణలో పెద్దగా మార్పులేకపోయినప్పటికీ సంస్కృతంలో భీష్మబాలాకుల సంభాషణలో కొద్ది మార్పులు చోటు చేసుకొన్నాయి. తెలుగు నాటకంలో భీష్ముని నోటి నుండి పలికింపబడిన కొన్నిమాటలు సంస్కృతంలో బాలాకి పాత్ర ద్వారా పలి కింపబడతాయి.

పంచమాంక ప్రవేశం సుభద్రా సహదేవుల సంభాషణ ఉభయత్ర తుల్యమే. షష్ఠాంకప్రవేశం బాలాకి ఘటకుల సంవాదంలో కూడ పెద్దగా మార్పులు కనిపించుటలేదు. కాని సప్తమాష్టమాంకాలలో చాల వైషమ్యం దృగ్గోచరమగు చున్నది.

తెలుగులో షష్ఠాంకంలో అశ్వత్థామ సుయోధనుని ద్వారా తన పితృ వధ వార్తను వింటాడు. ఆ తరువాత బాలాకి పాత్ర ప్రవేశం వ్యాసుడు పంపగా తాను వచ్చానని అశ్వత్థామతో చెప్పుట. కాని సంస్కృతంలో సప్తమాంకారంభంలో బాలాకి అశ్వత్థామకు ద్రోణవధవృత్తాంతాన్ని తెలియ చేస్తాడు.

తెలుగులో సప్తమాంకం భీమసేనుని చేతిలో దుశ్శాసనవధతో సమాప్తమగును. సంస్కృతంలో మాత్రం అశ్వత్థామ తపోదీక్షను పూని అడవికి వెళ్ళుటతో సమాప్తమగును.

సంస్కృతనాటకంలో భీమసేనుడు దుశ్శాసనునితో తలపడి వానిని సంహరించుట, ఆ తరువాత కర్ణార్జునుల యుద్ధం అష్టమాంకంలో చిత్రింప బడినది.

సంస్కృతంలో నవమాంకవిష్కంభకం కౌబేరి-బాలాకుల సంవాదంతో ప్రారంభమైతే తెలుగులో నవమాంకప్రవేశకం జలాధిదేవతప్రవేశంతో ప్రారంభమగును.

తెలుగునాటకంలో సహదేవుని పిలుపుతో సుయోధనుడు సరస్సునుండి బయటకువచ్చి భీమునితో గదాయుద్ధం చేసి ఓడిపోవుట చూపబడినది. కాని సంస్కృతంలో సుయోధనుడే అశ్వత్థామకు తన పరాజయ వృత్తాంతాన్ని వివరిస్తాడు.

ఈ విధంగా సామ్య-వైషమ్య మిశ్రితమైన యీ 'గుప్తపాశుపత' నాటకం సంస్కృతంలో అనువాద రచనగా కాక స్వతంత్ర సర్గనాత్మక రచనగా పరిగణించుట యుక్తము.



# విశ్వనాథ - జాషువా

— డా॥ సంజీవదేవ్

కవితారచన చేయటం సులభం కాదు కాని కవితారచన చేసిన కవులను గురించి మాట్లాడటం ఇంకా తక్కువ సులభం.

ఒక మహావ్యక్తిని గురించి ఇద్దరు ప్రసంగించటం సులభమే కాని ఇద్దరు మహావ్యక్తులను గురించి ఒక్క వ్యక్తి ప్రసంగించటం సులభంకాదు. ఇపుడు నేను ఇద్దరిని గురించి ప్రసంగించాలి.

ఇటువంటి సాహితీసమావేశాల్లో శతజయంతుల సందర్భాల్లో నూరేళ్ళనాడు మరణించిన విశిష్ట కవులను గురించి కొందరు ప్రసంగిస్తే ఆకవుల కావ్యసృష్టిని గురించి మరికొందరు ప్రసంగిస్తారు. కొద్దిమంది రెంటిని గురించీ ప్రసంగిస్తారు. నేను ఇప్పుడు కవులను గురించి మాత్రమే ప్రసంగిస్తాను. నాకు వారి రచన కంటే వారిని గురించే బాగా తెలుసు

అసలు కవులు గొప్పవారా వారి కవితలు గొప్పవా అనే సమస్య ఒకటి వ్యాప్తిలో వున్నది సాహితీ జగత్తులో. అందుకు అసలు తులనాత్మక దృష్టి తప్పదేమో అనుపిస్తుంది.

కవి రచించంది కవిత వుండదు, కవితను రచించింది కవికాడు, అంటే కవి వుండడు. కనుక కవీ కవితా రెండూ అవినాభావ సంబంధితాలే. రెంటిలో ఎవరు గొప్ప అనేది కూడ అవసరం లేదు. రెండూ గొప్పలే గొప్ప కవి రచించిన కవిత గొప్పగానే వుంటుంది, గొప్పకవి తను రచించినకవి గొప్పగానే వుంటాడు. అయితే, ఇందులో అపవాదాలుండవని కాదు, వుంటాయి.

అబద్ధం చెప్పకుండాలంటే ఇక్కడ నేనొక సత్యం చెప్పాలి. నాకు కవులతో వున్నంత సన్నిహిత పరిచయం వారి కవితలతో లేదు. నా పరిచిత కవులంతా వయసులో చాలా పెద్దవారుగా వుండే వారు. సమవయస్కుల కంటే భిన్నవయస్కుల మధ్య వుండే పరిచయం ఎక్కువ గాఢంగా వుంటుంది.

ఇదే వాస్తవం విశ్వనాథవారికీ నాకూ వున్న పరిచయంలోను,జాషువా గారికీ నాకూ వున్న పరిచయంలోను ప్రతిబింబిస్తుంది.

ఎంతో సేపటి నుంచి ఈ వేదికమీద వింటున్నాం ఎందరో సాహితీ రంగంలోని మహోన్నతులు చేస్తూవస్తున్న విశ్వనాథవారి, జాషువాగారి కవిత్వ మహత్వపు వెలుగు మాటలు.

ఆ ఉభయుల కవితల్లోని వస్తు ఔన్నత్యాలను, రచనాశిల్పాలను గురించి, పదలాలిత్యాలను గురించీ, శబ్ద చమత్కారాలను గురించీ, వివిధ వాక్యరీతుల రమ్యారమ్యాలను గురించీ వారంతా చేసిన మహోపన్యాసాలనూ వింటూ ఆనందాన్నీ ఆశ్చర్యాన్నీ కూడ తగినంతగా మనసారా అనుభవించాం. తిరిగి నేనుకూడ అదేధారను ప్రవహింప చేయటానికి ప్రారంభిస్తే నవ్యత్వం భవ్యత్వం మసకబారతాయి.

అదీకాక నేను ముందే చెప్పేనుకదూ, నాకు కవులను గురించి తెలిసినంతగా వారి కవితలను గురించి తెలియదని.

ఇదే యథార్థం ఇప్పుడు ప్రసంగించబోతున్న మన ఇద్దరు కవుల విషయంలో కూడ సమానంగా వర్తిస్తుంది. అసలైన తెల్లని నిజాన్ని వెల్లడి చేయాలంటే వారిద్దరి కావ్యరచనలను కూడ నేను విశ్లేషణాత్మకంగా, సమీక్షాత్మకంగా టీకా తాత్పర్యాలతో సహా ఇంతవరకు చదవలేదని అంగీకరించాలి.

ఆ మహావ్యక్తులను అధ్యయనం చేసినంత సూక్ష్మంగా వారి రచనలను అధ్యయనం చేయలేదు.

అందుకే ఈ నా లఘు ప్రసంగంలో ఆ మహానుభావులతో నాకున్న వ్యక్తిగత పరిచయాలనే ప్రధానంగా స్పృశించ ప్రయత్నిస్తాను.

నా చిన్నతనపు రోజుల్లో సాహిత్యం అంటే కవిత్వం అనే అనుకోబడుతుండేది. ఆయన గొప్ప రచయిత అంటే ఆయన గొప్ప కవి అనే అవగాహన.

సామాన్య పాఠకులకు ఆదినాల్లో కొందరు కవుల పద్యాలు కంఠస్థమై వుండేవి. సమయం చిక్కినపుడల్లా వారు వాటిని రాగయుక్తంగా ఎంతో అనురాగంతో నెమ్మదిగా పాడుతుండేవారు.

నా చిన్నతనపు రోజుల్లో సాహిత్యం అంటే కవిత్వం అనే అనుకో బడుతుండేది. ఆయన గొప్ప రచయిత అంటే ఆయన గొప్పకవి అనే అవగాహన.

సామాన్య పాఠకులకు ఆదినాల్లో కొందరు కవుల పద్యాలు కంఠస్థమై వుండేవి. సమయం చిక్కినపుడల్లా వారు వాటిని రాగయుక్తంగా ఎంతో అనురాగంతో నెమ్మదిగా పాడుతుండేవారు.

విశ్వనాథవారి పద్యాలు చాలా తక్కువ మందికి కంఠస్థమై వుంటే జాషువా గారి పద్యాలు చాలా ఎక్కువ మందికి వాడుకలో వుండేవి.

ఇందుకు కారణం వెదకనవసరంలేదు. జాషువాగారివి సరళమైన ఖండ కావ్యాలు, విశ్వనాథవారివి అందుకు వ్యతిరేకమైనవి.

ఇక నా విషయంలో విశేష మేమంటే ఏకవి రచించిన కవితలు కూడ నా నోటికి వచ్చేవి కావు. అది ఆ నాడూ అంతే ఈనాడూ అంతే, ఇక ముందు నాడూ అంతే.

ఈ స్థితిని నేను గొప్పదని భ్రమించను, తక్కువ దనుకొని దుఃఖించను ?

ఆ రోజుల్లో, అంటే ఏ రోజుల్లోనో తెలియదుకాని, ఈ రోజుల్లో మాత్రం కాదని తెలుసు. అప్పుడు పత్రికల సంఖ్య, ప్రత్యేకించి సాహితీ పత్రికల సంఖ్య, చాలా తక్కువగా వుండేది.

అటువంటి అరుదుగా వుండే పత్రికల్లో అపుడపుడు విశ్వనాథ సత్య నారాయణ గారి పద్యాలు ముద్రించబడుతుండేవి. అవి నాకు అసలు అర్థం కాకుండా వుండేవీ కావు, పూర్తిగా అర్థమయేవీ కావు. కాని ఎందుకో చెప్పలేను కాని వాటిని చదవాలనే కొంత ఆరాటం వుండేది.

నా బాల్యాన్ని కొంత అంతకుముందే లక్నో మొదలైనచోట్ల కొందరు బెంగాలీ, హిందీ సాహితీకారుల నివాసాల్లో గడపి వచ్చినందున కొంత సాహితీ పరిచయం వుండేది. ఆ సంపర్కం వల్ల తెలుగు సాహిత్యాన్ని ప్రత్యేకంగా నేను అధ్యయనం చేయకపోయినా కూడా దాన్ని చదివి ఆనందించే అర్హత వుండేది నాలో.

అందువల్ల తెలుగు గద్య, పద్యాలను కూడ చదివి కొంత ఆస్వాదించ కలుగుతుండేవాడిని. ఆ విధంగా విశ్వనాథవారి పద్యాలు సగం సగం నాకు హృద్యంగా తట్టేవి అస్పష్టంగా.

విశ్వనాథ సత్యనారాయణగారి కొన్ని రచనలు చదవటం, వారిని గురించిన మంచిమాటలు వినటం తప్ప స్వయంగా చూడటం పడలేదు. అంటే వారిని చెవులతో చూడటం తప్ప కళ్ళతో చూడటం పడలేదు. చెవులతో చూడటం జరిగితే కళ్ళతో వినటం జరగవచ్చునేమో.

అవి దసరారోజులనుకుంటాను, నీలాకాశంలో తెల్లమేఘాలు తేలిపోతూ మధ్య మధ్య జల్లులు పడిపోతున్నాయి. అటువంటి సమయంలో తుమ్మపూడిలోని మన ఇంటిముందు మధ్యాహ్న సమయంలో ఒకకారు వచ్చి ఆగింది.

నేను బయటికి వచ్చి చూస్తే నాకు తెలియని ఇద్దరు వ్యక్తులు దిగి నాతో కలిసి ఇంటిలోకి వచ్చారు, వారిలో ఒక చిన్న వయస్కుడు అన్నాడు ఆ రెండవ వ్యక్తి విశ్వనాథ సత్యనారాయణగారని,

నానోటి నుంచి మాట వెడలనంత ఆశ్చర్యం నన్ను చుట్టివేసుకొంది. నమస్కారం చేయటం మరచిపోయి ఇంట్లోకి తీసుకవచ్చాను. ఇంట్లో మా పెదతల్లి వున్నారు. తాము విజయవాడలో భోజనం చేసి వచ్చినట్లు చెప్పేరు. సాయంత్రం నాలుగుగంటల వరకు ఇక్కడ విశ్రాంతి తీసుకొని ఇక్కడికి దగ్గరి గ్రామంలో జరగనున్న ఒక సభకు హాజరు కావటానికి వచ్చామన్నారు. వారికి నన్ను గురించీ మా గ్రామాన్ని గురించీ ఏ విధంగా తెలుసో వారివి నేను అడగలేదు.

మేము ముగ్గురం వరాండాలో ఎదురుగా వున్న మొక్కలను, చెట్లను చూస్తూ కూచున్నాం. మేము కూచున్నచోట "ప్రబాసీ" అనే మాస బెంగాల్ పత్రిక పడి వున్నది. దాని ఎడిటర్ ప్రసిద్ధ "Modern Review" ఎడిటర్ అయిన రామానంద చటర్జీ.

మీరు బెంగాలీ చదువు తారా అని అడిగాను విశ్వనాథ వారిని, ఆయన నవ్వుతూ అన్నారు, చదవగలిగి వుంటే సంతోషించే వాడిని కాని....

అని మాటలు ఆపేరు. నేను వెంటనే అందుకొని వారు ఆపిన వాక్యాన్ని పూర్తి చేశాను,.... "కాని చదవజాలనందుకు చింతించటం లేదు" అనేగా మీరు అనబోయేది.

భలేగా పూరించావు అబ్బాయీ, నా అసమాప్తవాక్యాన్ని. అవును, నీవు అన్నమాట నిజమే. తెలుగు తెలియకపోతే చింతించేవాడిని కాని మిగతా భాషలు తెలిసి వుంటే ఆనందించేవాడిని, సందేహం లేదు, కాని అవి తెలియనందున చింతించను.

జీవితంలో నేనూ ఆ పద్ధతినే అలవరచుకున్నానండి— చేయకలిగిన వాటికి ఆనందించటం, చేయలేని వాటికి చింతించక పోవటం. ఇటువంటి వైఖరిని కొందరు హేళన చేస్తారు 'అభావ వైరాగ్యం' అని. కాని నేను అభావ వైరాగ్యాన్ని తప్పు అనను. ఉన్నదానికి సంతోషించాలి, లేనిదానికి విచారించరాదు అనేది నా జీవన దృక్పథం. ఈ తీరును negative approach అని పెడార్థం తీయటం negative approach అవుతుంది.

అబ్బాయీ నీ చిన్నప్పటి హిమాలయ ప్రయాణాలు నీమీద మంచి ప్రభావాలనే వేశాయి. నీదృక్పథాన్ని నేనెంతో మెచ్చుకుంటాను.

మా సంభాణల్లో వీలున్నంతవరకు సాహితీ విషయాలను ప్రవేశించకుండా జాగ్రత్త పడటం జరిగింది.

సత్యనారాయణగారు అన్నారు, చూడబ్బాయీ, నా జీవితం అంతా సాహిత్యధారలోనే ప్రవహిస్తూ వచ్చింది, అందువల్ల దాన్ని గురించి కంటే దానికి భిన్నమైన వాటిని గురించి మాటాడుకోటంలో నాకు ఎక్కువ ఇష్టం. జననం అంటే ఏమిటి, జీవిత మంటే ఏమిటి, మరణం అంటే ఏమిటి మొదలైన జీవన తత్వానికి సంబంధించిన విషయాలను గురించి ముచ్చటించుకొన్నాం.

వారిది కొన్ని విషయాల్లో సనాతన దృష్టి వుండేది, సందేహం లేదు. అందువల్ల సమాజానికి తీవ్రమైన అపకారం ఏమీ వుండేది కాదు. కాని కొన్ని ప్రధానమైన విషయాల్లో వారికి ఆధునిక దృష్టి వుండేది. అది సమాజానికి హితకరమైంది గానే వుండేది.

ఇంతలో మా పెద తల్లిగారు ఉప్మా తయారు చేసి తీసుకువచ్చారు. దానినిండా జీడిపప్పులు నిండివుండటం సత్యనారాయణగారికి చాలా ఉల్లాసం కలిగించంది.

అది కనిపెట్టి నేనన్నాను, మీకు ఏది రుచికరంగా వుంటే దాన్ని మాత్రమే తిని మిగతాదానిం వదలి వేయండి. మీకు జీడిపప్పులు మాత్రమే ఎక్కువ రుచికరంగా తడితే జీడిపప్పులను మాత్రమే తిని ఉప్మాను వదలి వేయండి.

సంజీవదేవ్, నీవు మంచి మర్యాదగల సలహా ఇచ్చావు, నాయనా, కాని నీ సలహాననుసరించి సంచరించను నేను. నాకు జీడిపప్పులూ, ఉప్మా, రెండూ కూడ సమానంగా రుచినిస్తున్నాయ. అందుక ఆ రెంటికీకూడ సమాన న్యాయం కలుగ జేయ ప్రయత్నిస్తాను, అంటూ నా వీపు చరచారు.

వారు సభకు బయలుదేరి వెళ్ళేంత వరకూ మన్నుమీది, మిన్నుమీది అనేక విషయాలను గురించి సంభాషణలు జరుపుకొన్నాం. స్థూల విషయాలు సూక్ష్మ విషయాలు, స్థూలమైన సూక్ష్మవిషయాలు, సూక్ష్మమైన స్థూల విషయాలు ఎన్నో అవీ ఇవీ మాటాడుకొన్నాం.

పోతూపోతూ అన్నారు, నేను మీ ఇంటికి వచ్చాను, మరి నీవు మా ఇంటికెప్పుడు వస్తావు అని. మీరు ముందుగా నాకు తెలపకుండా వచ్చినట్లే మీకు తెలపకుండా వస్తాను ఎపుడో.

విశ్వనాధవారు మంచి కవి, మంచి పంతులు, మంచి కారుణ్యులు, వారిదొక ప్రత్యేక వ్యక్తిత్వం, లోతైన మానవత్వం, సురభిల కవిత్వం.

వారిని అపుడపుడు కలవటం జరుగుతుండేది. ఆ మాకలయిక వారికీ నాకూ కూడ ఒక విధమైన సూక్ష్మ రసానుభూతిని కలిగించటంలో సఫలమవుతుండేది. వారు నాడు వున్నారు, నేడులేరు. అయినా వున్నట్లే వుంటారు.

ఇక ఇప్పుడు కవి శేఖరులైన జాషువా గారిని గురించి. విశ్వనాధ వారిని గురించి చెప్పిన మాటలే కొన్ని ముందుగా జాషువా గారిని గురించి కూడ చెప్పక తప్పదు. అంటే జాషువా గారి కవితా విషయాలతో వున్న పరిచయానికంటే జాషువా గారితోనే ఎక్కువ పరిచయం వున్నది నాకు.

విశ్వనాథవారి పాఠకులు వారి పద్యాలను వారి గ్రంథాలలో చూస్తూ చదువుతారు, చూస్తూ చదివేవారి సంఖ్య ఎక్కువ, చూడకుండా చదివేవారి సంఖ్య చాలా చాలా తక్కువ.

జాషువాగారి కవితలను ఆ రెండు రకాలుగా చదివే వారుకూడఎక్కువ గానే వుంటారు. కాని నేను మాత్రం ఆ రెండు రకాలుగా చదివేవాడినీకాదు. ఇది బాధతో అనే మాట. నేనెరిగిన వారిలో చాలా మంది జాషువా గారి పద్యాలను ఆశువుగా చదువుతుంటే విని ఆనందిస్తుండే వాడిని.

దీని అర్థం జాషువాగారి రచనలతో నాకు అసలు పరిచయం లేదని కాదు. కవితలతో అసలు పరిచయం లేకపోతే వాటినిరచించిన కవితోమాత్రం పరిచయం ఎట్లా ఏర్పడుతుంది? ఒక కవితో కవిత్వం ఎంత వున్నదీ అనే కంటే ఆ కవిత్వంలో మానవత్వం ఎంత వున్నదే, ఆ మానవత్వంలో సూక్ష్మత్వం ఎంత వున్నిదీ అనేవి ప్రధానం.

జాషువాగారు వయసులో నాకంటే పెద్ద. గంభీరమైన శరీరం. ఆయన్ను కొంత దూరం నుంచి చూచినాకూడ నూటికి నూటపదహారుపాళ్ళ పురుషుడని గుర్తించటానికి వీలైన బారైన మీసం, సగానికిపైగా నెరసిన తలమీది క్రాపు, నల్లని శరీర ఛాయ మొదలైన సామగ్రితో కొట్టవచ్చినట్టు కనిపించేవారు.

అటువంటి ఆకృతిలో అటువంటి కవితామయలాలిత్యం, అటువంటి లలితమైన కవిత్వం ఎక్కడ దాగివున్నదా అని ఆశ్చర్యం వేసేది. చాలా మంది ఆకృతులు తమలోని ప్రకృతులకు దర్పణాలుగా వుంటాయని వాడుక.

కాని ఈ వాడుక జాషువా కవి విషయంలో వాస్తవం కానట్లు తట్టేది. గంభీర ఆకృతిలో మృదుల ప్రకృతి ప్రతిబింబించేది. కాఠిన్యంలో మార్దవం నర్తించేది.

నన్ను జాషువా కవి ఎరగకముందు ఎంతోకాలం నుంచి ఆయన్ను నేనెరుగుదును. ఇటువంటి సందర్భాన్ని సూచించే చక్కని ఇంగ్లీషు వాక్యం ఒకటున్నది: To know is not to be known అని. ఒకరు తనకు తెలియ టం అంటే తాను వారిచేత తెలియబడటం కాదు. రవీంద్రకవిని నేనెరుగు

దును అంటే ఆయన కూడ నన్ను ఎరుగుననికాదు. ఇటువంటిదాన్ని ఏక పాత్రాభినయం అనవచ్చు.

జాషువా కవికీ నాకూ వున్న పరిచయం కూడ ఇటువంటి ఏకపాత్రాభినయమే. ఇది దాదాపు 20 సంవత్సరాల కంటే ముందరి విషయం అనుకుంటాను అప్పుడు జాషువా గారిది గుంటూరు కాపురం. అప్పటికి ఆయన పదవీ విరమణ చేసివున్నట్లు నాజ్ఞాపకం. ఆయనకు సన్మానాలు, బహుమతి ప్రదానాలూ మొదలైన వెన్నో అక్కడక్కడ జరుగుతుండేవి.

సన్మానం చేయించుకొన్న జాషువా కవికంటే సన్మానాన్ని చేసిన ఆయన అభిమానులే ఎక్కువ ఆనందంపొందేవారు. అంటే సన్మానాలు సత్కారాలు ఆయనకు అయిష్టంగా వుండేవి యని కాదు వాటిని చేయించుకోటం మాత్రమే ఆయనకు ఇష్టమైన పనులు కాదని.

ఆరోజుల్లో గుంటూరులోని గొప్ప సర్జన్ అయిన డాక్టర్ సదాశివరావు గారు తన అర్ధాంగి డాక్టర్ జయప్రదగారి సహకారంతో సాహితీ సదస్సు అనే పేర సాహిత్య సభలు జరుపుతుండేవారు. ఆ సమావేశాల్లో జాషువా కవీ నేనూ కూడ ప్రసంగాలు చేస్తుండే వాళ్ళం. అక్కడ మా ఉభయులకూ పరిచయం ఏర్పడటం, పరిచయం అనేది మైత్రిలోకి పరిణతి చెందటం జరిగింది. సాహిత్య విషయాల్లో, ప్రత్యేకించి కొన్ని అప్రధానమైన అభిప్రాయ భేదాలు కలుగుతుండేయి. ఆ భేదాలే మా ఇద్దరిలో ఐక్యతా దృష్టిని సృష్టించటానికి తోడ్పడుతుండేయి,

ఆధునిక తెలుగు కవితా రూపమైన వచనకవితను గురించి ఆయనకు అనుకూల అభిప్రాయాలుండేయికావు. గద్యానికీ పద్యానికీ వున్న ప్రధాన ప్రభేదం ఏమంటే, గద్యం ప్రధానంగా మేధకు సంబంధించిందనీ, పద్యం ఇంద్రియానుభూతికి సంబంధించిందనీ, ఛందోబద్ధకవిత అంటే అది మెదడుకు మేత అందించకూడదని కాదు, ఇంద్రియానుభూతితో సమన్వయమై అంచమని. అందుకే పద్యరచనకు ఛందోబద్ధత అవసరం అనేది. మేము ఎక్కువసేపు ఇటువంటి కావ్య చర్చల జోలికిపోక భూమి,ఆకాశం,మానవుడు

మానవుడి మానసం, మేధ, అలోచన, అనుభూతి, ఇష్టం, అయిష్టం, స్మృతి. విస్మృతి, ఆశలు, ఆశయాలు, అభిలాషలు, అనుభూతులు, రోగాలు, నీరోగాలు, బంధన, స్వేచ్ఛ సంయోగం, వియోగం, జయాలు, విజయాలు మొదలైన వాటి మీద మా దృష్టులను ఎక్కువగా కేంద్రీకరించి చర్చించి చర్చించి అనుకూలమైన ముగింపుకు దూరమై చర్చను ఆపివేసి మౌనంతో గగన సంగీతాన్ని వివేవాళ్ళం.

ఒకనాడు ఒక సాహితీ సమావేశంలో మేముభయులం ప్రసంగించటం జరిగింది. నా ప్రసంగంలో సఫలత, విఫలత మొదలైన పదాలను నేను ప్రయోగించటం జరిగింది.

అంతటితో జాషువా కవి కూర్చున్నవాడల్లా లేచి నిలబడి అన్నాడు, ఆపండి ఇక అటు వంటి పద ప్రయోగాన్ని సఫలత, విఫలత అనే పదాలు సంస్కృతమైనప్పటికీ వాటిని ఉత్తర దేశభాషల్లో వాడతారు. మన దాక్షిణాత్య భాషల్లో సాఫల్యం, వైఫల్యం, అని వాడతారు. అదే విధంగా వారు సుందరతా అని వాడితే మనం సౌందర్యం అని వాడతాం, అని పెద్ద గొంతుతో నాకు తెలియ జేశారు.

జాషువా గారికి సంప్రదాయలమీద, ఆచారాలమీదా, రీతులమీదా, రివాజులమీదా అంతగా మోజు వుండేది కాదు కాని భాషావిషయాల్లో కొన్ని నియమ నిబంధనలకు కట్టుబడి వుండటం ఆయనకు ఇష్టం.

ఆయనకు దేశాలు, ప్రదేశాలు, విదేశాలు చూడాలని ఒక సాదా అభిలాష వుండేది. ఆయన జీవితంలో అటువంటి కొన్ని సాంస్కృతికాభిలాషలు అభిలాషలుగానే మిగిలిపోయాయి. జీవన సంధ్యలో తీరని అభిలాషలే ఎక్కువ తీపిగా తడతాయి.

ఎంత మహామహుని జీవితంలో అయినా ఆది, మధ్య, అవసాన దశ లుంటాయి. వీటినే ప్రభాత, మధ్యాహ్న, సంధ్యలతో పోల్చుతారు. ఆలెక్క ప్రకారం క్రమేణ జాషువా కవి తన జీవనసంధ్యలో ప్రవేశించారు.

పరుగెత్తటం నడవటంలోకి మారింది, నడవటం, నిలుచోటంలోకి, నిలుచోటం కూర్చోటంలోకి, కూర్చోటం పడుకోటంలోకి రూపొందింది.

తన మృత్యుఛాయలు చాలా దూరంలో గోచరిస్తున్నాయని, అవి రోజుకు రోజుకు దగ్గరవుతున్నాయని, దగ్గరవుతున్నకొద్దీ ఆఛాయల నలుపు ఇంకా ఎక్కువ నలుపుగా గోచరిస్తున్నాయని ఆయన తన మరణశయ్యమీద పడుకొని అంటుండేవారు. మృత్యువుని గురించి నాకేమీ భయం లేదని పెద్దగా నవ్వేవారు.

ఆయిద్దరు విశిష్టకవులూ నేడు లేరు. వారిద్దరి శతజయంతికూడ నేడిక్కడ ఈ నాగార్జున విశ్వవిద్యాలయంలో జరుపుకోవటం అభినందనీయం.

విశ్వనాథ, జాషువల జీవితాలను గురించి నేడు లఘుప్రసంగాన్ని చేసే అవకాశం నాకు దొరకినందుకు నన్ను నేను విశిష్ట ధన్యుణ్ణిగా భావించు కొంటూ ఈ మహాకార్యక్రమాన్ని ఏర్పరచిన మహాశయులను మరోసారి అభినందిస్తున్నాను.



# "విశ్వనాథవారి వేయిపడగలు నవలా వైశిష్ట్యం"

—డా॥ జి. వై. ప్రభావతీదేవి

కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారి శతజయంత్యుత్సవంలో అంతటి మహనీయుని అత్యద్భుత సృష్టియైన "వేయిపడగలు" నవలపై వ్యాసాన్ని సమర్పించే భాగ్యాన్ని నాకు కలుగజేసినందుకు కృతజ్ఞతలు.

అసాధారణ సృజనాత్మకతతో మిళితమైన విశ్వనాథవారి అద్భుత పాండిత్యాన్ని నిర్ద్వంద్వంగా ప్రశంసించి కొత్త పాతలని కాకుండా శాశ్వత మైన విశ్వజనీనమైన విలువ కల వాటిని విశ్వసించే వారికి తన శక్తిమంత మైన రచనల ద్వారా ప్రసంగాలద్వారా విశ్వనాథ ఆమోదయోగ్యుడయ్యారు. ఆయనవై చిత్రులు ఏమైనప్పటికీ ఆయనరచనలు అద్భుతమైన, ఆశ్చర్యకరమైన విస్తృతి, గాఢతస్వీయదర్శనంతో కూడిన అల్లికలతో అందరికీ ప్రీతిపాత్రము లైనాయి. ఆ రచనల్లో వేయిపడగలు కళాత్మకంగా సర్వసమగ్రమైన కేవలం తాత్కాలిక అవ్యయం మాత్రమే కలిగిన విలువలతో- అవి విలువలే అయితే- నిండిపోయి వినాశపు అంచున నిలిచిన ఒకానొక సమాజ చిత్రాన్ని వేయిపడగలులో విశ్వనాథ దర్శించారు.

విశ్వనాథ వారి సాహిత్యాన్ని పరిశీలిస్తే ఆయన ఒక వ్యక్తికాదు వ్యవస్థ అని అర్థమవుతుంది. అచ్చమైన తెలుగు మనిషి విశ్వనాథ అరవ య్యేళ్ళ రచనా వ్యాసంగంలో ఒక ప్రత్యేక స్థానాన్ని పొందినటువంటిది వేయిపడగలు నవల. ఒక విధంగా చూస్తే వేయిపడగలు ఆయన సిద్ధాంత గ్రంథమేమో అన్పిస్తుంది. కొంత వివాదాస్పదమైనప్పటికీ వేయిపడగలునవల విశిష్టమైంది. కాని ఈ నవలలోని విస్తృతినీ, విషయ వివరణను, మనస్తత్వ చిత్రణనూ ఎవరూ తక్కువ అంచనా వేయలేరు."ఖలికి చెడిన ఒక నాటి తెలుగువ్యవస్థ ఆత్మకథ వేయిపడగలు అనిచెప్పవచ్చు.ప్రతిపాత్ర సజీవ మైనదై ఉండడమే ఈ నవల ప్రత్యేకత. విశ్వనాథవారి భావవైవిధ్యం, ఆర్షధర్మం పట్ల ఆయన ఆరాధన ఈ నవలలో కన్పిస్తాయి. తరాల అంత

రాల వెలుగునీడలు వాటిపై వారి గచ్ఛద్వ్యాఖ్య ఈ రచనకు ప్రాణం పోశాయి.

1900-30 మధ్యకాలంలో తెలుగుదేశంలో వచ్చిన ఆర్థిక, సాంఘిక, రాజకీయాల పరిణామ చరిత్రను "వేయిపడగలు" నవల ప్రతిబింబింపజేసింది. విదేశ పాలన- దాని మంచిచెడ్డలు, జమీందారీలు- వాని వ్యవస్థ, సహాయ నిరాకరణోద్యమం- దాని ప్రభావం- ఇవన్నీ కలిసి తెలుగు జాతిని ఏ విధంగా నడిపించాయో ఈ నవల చదివితే మనకు స్పష్టమవుతుంది.

విశ్వనాథవారికి మన పెద్దలు నియమించిన సంఘ వ్యవస్థ అంటే ఎంతో మక్కువ. కొన్ని వేల సంవత్సరాల నుంచీ భారతీయ సంస్కృతికీ, సంఘ వ్యవస్థకూ వివాహ వ్యవస్థ కేంద్రమై ఉన్నది. పాశ్చాత్య వ్యామోహంతో పైపై మెరుగులతో వివాహ వ్యవస్థ అన్నా, పూర్వాచారాలన్నా, దైవభక్తి అన్నా ప్రజలలో కన్పిస్తున్న నిరాదరణ ఆయన్ని ప్రతిక్షణం బాధ పెట్టింది. "వేయిపడగలు" నవలలో ఈ వేదన ప్రతిపుటలోను మనకు కన్పిస్తుంది. విశ్వనాథవారి వ్యక్తిత్వమూ, ఆయన భావనా బలమూ ఈ నవలలో ద్యోతకమవుతూనే ఉంటాయి.

విదేశపాలన యెడ కలిగిన వైముఖ్యం మనలో జాతీయోద్యమ భావాన్ని ఎంతగానో మేల్కొలిపింది. కాని పాశ్చాత్య నాగరికతా ప్రభావం, వారి మత నైతిక భావాల ప్రభావం మనలో అంతటి వైముఖ్యాన్ని కలిగించ లేదు. వేయిపడగలు ప్రజల ధార్మిక నైతిక జీవితాన్ని ఒక వైపు చిత్రిస్తూ రానురాను మానవుడి స్వార్థం, అహంకారం, వ్యాపారదృక్పథంతో ప్రజా జీవన మెంత దుర్భరమై పోతున్నదో నిరూపించారు.

పూర్వరాజరికం, జమీందారీ వ్యవస్థల యెడల విశ్వనాథకు మక్కువ అనే భావం కలుగుతుంది. ప్రగతికాములము, అభ్యుదయశీలురము అను కొనే కొందరు రాజకీయవేత్తల దృష్టిలో ఇది అభ్యుదయ నిరోధక సాహిత్యము నేటికంటె గత కాలము మేలనుకొనుట వారి దృష్టిలో తగనిది.

విశ్వనాథ వారి వేయిపడగలు నవల 37 అధ్యాయాలతో వేయిపేజీలలో విస్తరించిన, తెలుగు నవలా సాహిత్యంలోనే బృహత్తరమైన గ్రంథం మొదటి అధ్యాయం.

"వేయిపడగల పాము విప్పారుకొని వచ్చి
కాటందుకొన్నది కలలోన రాజును"

అనే గణాచారి పాటతో ఆరంభమౌతుంది.

వేయిపడగలలోని సుబ్బన్నపేట తెలుగుసీమ
బింబము, ప్రతినిధియు. ఆ ఊరిలోని కోవెల, కొలను, స్వామివారి కల్యాణోత్సవములు, ఊరేగింపులు, అలంకారములు, హరికథలు, కృష్ణ లీలాతరంగ కీర్తనములు, దేవదాసీ నృత్యనాట్యములు, కూచిపూడివారి నాటకములు- ఆంధ్రదేశ జనపదములలో పూర్వము వెల్లివిరిసిన సాంస్కృతిక జీవిత మంతయు ఇందు మనోహరముగా వర్ణింపబడినది.

వీరన్ననాయని వంశంవారు స్వామికి ప్రతినిధులు. బ్రాహ్మణవంశం వారు ప్రచారకులు. కాపువంశపు టాడపడుచులు. స్వామికి వ్యాఖ్యాతలు. ఈ రీతిగా భూమ్యాకాశాల మధ్య, స్వర్గమర్త్యలోకముల మధ్య, ప్రత్యక్షా ప్రత్యక్షముల మధ్య ఒక స్థిరమైన సంబంధ మేర్పడింది.

పైన భగవంతుడు, క్రింద రాజు బ్రాహ్మణుడును. ఈ రెండు మహా సంస్థలకు మధ్యగణాచారి త్రెంచరాని లంకె. మరో విధంగా చెప్పాలంటే ఇది నాల్గుస్తంభముల ధర్మమంటపము. స్వామి, జమీందారు. బ్రాహ్మణుడు, గణాచారి వీరు నలుగురు స్తంభములు.

ఈ ధర్మమంటపము నిత్యకళ్యాణము, పచ్చతోరణముగా మూడు వందల యేండ్లు నిరంతరముగా అవ్యవహితముగా శోభాయమానమై యొప్పెను. ఈ మూడువందల యేండ్లలో వేయిపడగలతో భాసించిన నాగేశ్వరస్వామి సుబ్బన్నపేటమీద తన సహస్రఫణామండలి ఛత్రముగా చాపి ఆ చల్లని నీడలో ఊరి ప్రజలను జోకొట్టెను.

నవలలోని ముఖ్యపాత్ర ధర్మారావు ఇతడు రామేశ్వరశాస్త్రి కుమారుడు. కృష్ణమనాయుడు సుబ్బన్నపేటకు జమీందారు. ఆయన కాలంలో రామేశ్వరశాస్త్రి దివాను. ఆయన నాలుగు వర్ణముల నుండి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర కన్యలను వివాహమాడి నలుగురి యందును సంతానము పొందెను. వీరుగాక రత్నగిరి యను నొక భోగాంగన కూడ కలదు,

ఆమె యందును సంతానము కలిగెను. రామేశ్వరశాస్త్రి గొప్ప దానశీలి. చివరి కాతడు మరణించేప్పటికి ధర్మారావు దారిద్ర్యంతో కుంగిపోయాడు. కృష్ణమనాయుడు అతనిని ఆదుకున్నాడు. ధర్మారావు అరుంధతిని వివాహ మాడటం, బందరులో అతని చదువు, మిత్రులు, గుంటూరులో, చదువు సంసారం, జమీందారీ కాలేజీలో ధర్మారావు తెలుగు పండితుడుగా నియమింప బడడం, జాతీయోద్యమం, కృష్ణమనాయని మరణానంతరం రంగారావు పట్టాభిషేకం, అతని కుమారుడు హరప్పకు ధర్మారావు గురువు కావడం, వేణుగోపాలస్వామి కల్యాణోత్సవాలు గిరిక వేణుగోపాలునిపై దృష్టి నిలిపి అభినయించి అభినయించి స్వామిలో ఐక్యం చెందడం, అరుంధతి మరణం, మాఘస్నానాలు, హరప్పయోగమరణం, చిన్న అరుంధతీ ధర్మారావుల వివాహం మొదలైన విషయాలన్నింటితో వేయిపుటల నవల నిండిపోతుంది.

ఈ ఇతివృత్తం మహోన్నతమైనటువంటిది. ఒక విధంగా చెప్పాలంటే ఇది ఆత్మాశ్రయ కవిత్వశాఖలో ఒక అపురూపమైన కావ్యం. దాని పేరే వేయిపడగలు. తెలుగుదేశంలో శిథిలమై అదృశ్యమౌతున్న పూర్వ నాగరికత చివరి వెలుగుల్ని చూచిన విశ్వనాథహృదయం సంక్షోభించి వెలువడిన సుదీర్ఘ నిశ్వాసమే ఈ నవల.

వేయిపడగలకు కేంద్రబిందువు ధర్మారావు. ధర్మారావు ఆత్మకథే వేయిపడగలు. కొంతమేరకు విశ్వనాథవారే ధర్మారావు అని చెప్పవచ్చును. అరుంధతి, చిన్న అరుంధతిల రెండు వివాహాలు. విశ్వనాథ వారి సతీమణులు వరలక్ష్మి, తరువాత వివాహమాడిన ఆమె పేరేమిటో గాని ఆమెకూడ వరలక్ష్మియే అయినది. చిన్నతనంలో పొలాలవెంబడి తిరగడం, పొలాల్లోని పాములు, తేళ్ళు, ఎండ్రకాయలు, కిన్నెరసాని పాటలు, తెలుగు ఋతువులు వీటన్నింటినీ మనం ఈ నవలలో చూడగలం. విశ్వనాథ వారికి ఆముక్తమాల్యదపై, రాయలపై గల అభిమానం, వీరి వర్ణనల్లో స్పష్టమౌతుంది. ధర్మారావు ఇంగ్లీషు చదివినా, ఇంగ్లీషు మనకు అనుచితం అనడం విశ్వనాథ వారి మాటలే.

రామేశ్వరశాస్త్రి గారు మహదౌదార్యవంతుడై ఉన్నదంతా పోగొట్టుకున్నట్లే, విశ్వనాథ వారి తండ్రి శోభనాద్రిగారు కూడ చివరి దశలో ఘాఢా

ర్యంవల్ల ఆస్తిని పోగొట్టుకుని పేదరికంతో బాధలనుభవించారు. సుబ్బన్న పేట నిర్మాణం, కాశీ నుంచి శివలింగం తీసికొని రావటం— ఇవి కూడ విశ్వనాథ వారి పూర్వీకులు చేసినవే. పసరిక పాత్ర తనకు తెలిసిన మిత్రుల ఇంట పాము జన్మించడాన్ని గ్రహించి సృష్టించినదే. ఇంకా ఆనాటి అనే కాంశాలు, జాతీయ కళాశాల, క్రిస్టియన్ కళాశాలలు, ఇంకా అనేకమైన ఆనాటి పరిస్థితులు నవలా రూపంలో ఏకరువు పెట్టడం మనం గమనించవచ్చు.

జీవిత వ్యాఖ్యానంగా ఈ నవలను తీర్చిదిద్దిన మహాశిల్పి లక్షణాలు విశ్వనాథలో మనం చూడగలం. ఈ సబ్జక్టివిటీ విషయానికి వస్తే ముఖ్యంగా నవలలో ప్రధానపాత్రల్లో రచయిత గోచరించడం సామాన్యమైన విషయమే. ఎందరో మహారచయితల నవలల్లో ఇది కన్పిస్తుంది. ఛార్లెస్ డికెన్స్ "డేవిడ్ కాపర్ ఫీల్డు", సోమర్ సెట్ మామ్ "ఆఫ్ హ్యూమన్ బాండేజ్", గోపీచంద్ "చీకటి గదులు" మొదలైన ప్రఖ్యాత నవలలు రచయిత ఆత్మకథల్లానే గోచరిస్తాయి.

విశ్వనాథలోని విశిష్ట గుణాలన్నీ ధర్మారావులో మనం చుస్తాం. ఇవే గాక రచయిత తన ఊహలకూ, ఆదర్శాలకూ అనుగుణంగా కూడ పాత్రను తీర్చిదిద్దడం జరుగుతుంది. ఈ రెంటి మేలికలయికే ధర్మారావు పాత్ర.

ఈ నవల కంతటికీ కేంద్రబిందువైన ధర్మారావు పాత్ర ననుసరించే సమస్త కథా పాత్రలు అల్లుకుని వినిర్మితమై ఉన్నాయి. ఈయన రామేశ్వర శాస్త్రిగారి పుణ్యములపంట. సావిత్రమ్మ నోముల ఫలము. అరుంధతి పాలిటి వశిష్ఠ మహర్షి. హరప్పకు బృహస్పతి. గిరికాదేవి స్వర్గమునకు నిచ్చెన. భగవంతునకు బావమరది. మహామేధావి. స్థిరభాషి గుణగరిష్ఠుడు. ఇంగితావ గాహి........ గుణదోషాధిజ్ఞుడు, శృంగారలీలావిదుడు. నయకోవిదుడు. ధీరుడు. ఇతడు రెండు లోకముల వాడు. ఒక లోకములో మూకీ భావము, వేరొక లోకములో నియత వాగ్వ్యాపారము. ఒక జగత్తు దివ్యము; మరియొకటి భౌమము, ఒకటి పునీతము; మరియొకటి ఇంద్రియాభిభూతము. సెలవులు వచ్చినచో గణాచారి, దేవదాసి, పసరిక, అరుంధతి వంటి వారితో ఇతని జగత్తు. అవి రానిచో కిరీటి, శివరావు, కళాశాల మున్నగువారితో ఇతని ఘని సాగిపోవును. విశ్వనాథ సత్యనారాయణ గారి వలెనే కాలఘునకు

ఎదురీదు దిట్ట ధర్మారావు ప్రతి విషయమునకు ప్రతిఘటనయే. ప్రతీపకరణయే. ఇంగ్లీషు భాషా పండితుడైనప్పటికీ సనాతన ధర్మబుద్ధి అధునిక నాగరికతను ఆకళించుకుని కూడ నశించి పోవుచున్న మన సనాతన పద్ధతులకై ప్రాకులాడినవాడు. పంటపొలాలు, విద్యుద్దీపాలు, మరబియ్యము, చలన చిత్రముల వంటివి ఎన్నియో ఈతని నిశితపరిశీలనకు గురియైనవి.

ఈ కథకంతకూ ధర్మారావు సూత్రధారుడు. ఈతని నీడ పారని అంశము కాని, భావముద్రపడని పాత్ర కాని ఈ నవలలో లేదు. సూర్యపతికి ఇతడొక శంఖము. కిరీటికి ఇతడొక సారధి, సచివుడు, సర్వమును వామనరావునకు కవిత్వ విషయంలో పితామహుడు, హరప్ప కృష్ణమనాయని గార్లకు ఇహికాముష్మికములయందు ప్రదష్ట, మార్గదర్శియు. గోపన్నకు ఇలవేలుపు పోగా స్త్రీ విషయమున రుక్మిణమ్మరావు గారికి ప్రత్యక్షముగను, సరోజినీదేవిగారికి పరోక్షముగను జ్ఞానదాత, రంగాజమ్మ గారికి ముద్దుబిడ్డడు. అరుంధతి, రథంతరి ప్రభృతులకు వేదరాశి. కళాతపస్విని గిరిక విషయంలో వేరుగ చెప్పవలసినది లేదు. తుదకు తనకు తెలియకుండా శిష్యసంతతిలో నుండి నిష్కృతి పొందుటకు మంగమ్మ ప్రయత్నించినది. ఈమె ధర్మారావునకు ప్రశిష్యురాలు.

నవలలోని రెండో అధ్యాయం ప్రారంభంలోనే ధర్మారావు వర్ణన మనకు కన్పిస్తుంది.

"ఆ వచ్చుచున్న మహాపురుషుడు దబ్బపండువంటి దేహచ్ఛాయవాడు. కోలయు గుండ్రము కాని ముఖము, ఆజానుబాహువులు. నల్లని కనులు విశాలమైన ఫాలభాగము. వయసిరువదియైదేండ్లుండును. అతని పేరు ధర్మారావు."

ధర్మమే ధర్మారావు సనాతన ధర్మ నిర్వహణ పరిణిష్టితుడు. తండ్రి రామేశ్వరశాస్త్రికి తగిన పుత్రుడు. తండ్రి కొంత కర్మిష్ఠి. అందుచేత తాను సైతం ధర్మాచరణంలో లోటు రానీయనివాడు. అయినా మానవతావాది. రామేశ్వరశాస్త్రి లాగా చాతుర్వర్ణ్యం పాటించి వివాహాలు చేసికోలేదు. ఇతనిలో ఉత్తమ గుణాలన్నీ నిండి నిబిడీకృతమై ఉన్నాయి. స్ఫురద్రూపి మాత్రమే గాక తెలివితేటలు గల వ్యక్తిగా కృష్ణమనాయడు గ్రహించి

ధర్మారావును పైచదువులకు పంపుతాడు. అతని మరణంతో ధర్మారావు చదువు అర్థాంతరంగా ఆగిపోతుంది. ఆ వెనుక పెద్దరాణి రుక్మిణమ్మారావు గారు ఈ విషయం గ్రహించి ధర్మారావును మరల చదివించుతారు. "నల్లని వాడు పద్మనయనంబులవాడు......." మొదలైన భాగవత పద్యాలు ధర్మారావు చదువుతుంటే రాజు, రాణి ఎంతో తన్మయత్వం చెంది భక్తి తత్పరులయ్యేవారు. తరువాత తరువాత రంగారావుతత్వాన్ని వదిలి, సరోజినీదేవిగారు సైతం భక్తి తత్పరురాలు కావడం ఏకైకపుత్రుడు హరప్పకు ధర్మారావును గురువుగా నియమించడం గమనించదగ్గది. తండ్రి మరణంతో కష్టాలు, బాధలు, పేదరికం అంటే ఏమిటో తెలియని ధర్మారావుకు తెలిసివచ్చాయి. కృష్ణమనాయని దాతృత్వవల్ల తండ్రి కర్మలు, మాసికాలు పూర్తి చెయ్యడం జరిగింది. ఈ విషయంలో నౌకరు గోపన్న సాయం ప్రశంసించదగ్గది. బీకరికమంటే ఏమిటో తండ్రి మరణానంతరమూ, రాణి రుక్మిణమ్మారావు మరణానంతరమూ ధర్మారావు అనుభవించాడు

ధర్మారావు సంప్రదాయవాది. ఆంగ్లవిద్య నభ్యసిస్తున్నప్పటికీ పాశ్చాత్య పద్ధతులకు విముఖుడు. విజయవాడలో మిత్రులతో పాటు నాటకం చూస్తున్న సందర్భంలోనూ, ఇంకా జీవితంలో అనేక సార్లు ఇది స్పష్టమవుతుంది. ధర్మారావు వైవాహిక జీవితంలో బంధువుల మధ్య కొన్ని గొడవలు జరగడం, అరుంధతి పసిహృదయంపై తలిదండ్రుల మాటలు ముద్రపడిపోవడం జరిగాయి. రంగాపురం నుండి సుబ్బన్నపేటకు వచ్చాక వారి దాంపత్య జీవితం సుఖంగా హాయిగా గడిచింది. వారిరువురి మధ్య అనురాగం ఎంతగానో వెల్లివిరిసింది.

మిత్రుడుగా ధర్మారావు వ్యక్తిత్వమే వేరు. సూర్యపతి, కిరీటి, రాఘవరావులతో కలిసి బందరులో చదవడం, గుంటూరులో రాఘవరావుతో కలసి చదవడం, ఆయాసమయాల్లో వారి మైత్రి ప్రశంసనీయం. స్నేహబంధం వారి నెంతగానో పెనవేసుకుపోయి దగ్గర చేర్చింది. ఎంతగానో అల్లరి చేస్తూండేవారు. రాఘవరావు సహాయ నిరాకరణోద్యమంలో చేరి విడుదలై బెజవాడలో కాపురం పెట్టినపుడు భార్య ప్రాణాలమీదికిరాగా ధర్మారావు సాయం కోరాడు. అతని భార్య కలరావల్ల మరణించింది. శవవాహకులు

లభించలేదు. బండిమాత్రం ఎలాగో సంపాదించి సూర్యపతి సాయంతో ధర్మారావే బండితోలాడు. ఖననం చేయడంలో కూడ ధర్మారావెంతో సహకరించాడు. ఇదంతా పరిశీలిస్తే అతని మైత్రి ఎంత గొప్పదో స్పష్టమవుతుంది.

సోదరునిగా కూడ ధర్మారావు వ్యక్తిత్వం మనల్నెంతగానో ఆకట్టుకుంటుంది. రామచంద్రరాజుతో వ్యవహరించడంలో గాని, గిరికను భక్తురాలిగా ఉన్ముఖిని చెయ్యడంలో గాని పసరికపై ప్రత్యేకానురాగం అతని మమత, మమకారం మన హృదయాల్లో శాశ్వతంగా నిల్చిపోతాయి. రామచంద్రరాజుకు కూడ తమ్మునిపై ఎంతో ప్రేమ. గిరికకు ఇక సరే. ఉన్న ధర్మారావంటే సాక్షాత్తు భగవంతుడే. వేణుగోపాల సాన్నిధ్యానికి చేర్చే గురువు. భ్రాతృప్రేమను ప్రసరించిన మహాయోగి వంటివాడు. పసరిక తల్లితో తప్ప ఎవరితోను సరిగా మాటాడడు. మెట్ట పొలాల్లో నివసిస్తాడు. అయితే అన్న ధర్మారావంటే ప్రత్యేకాభిమానం. పసరికకు ఎలాంటి ఆపద రాకుండా అతని తల్లి మంగకు ధర్మారావు సహకరిస్తాడు. ఒకసారి పసరిక కన్పించకపోగా మంగ బెంగపెట్టుకుంటే, రాత్రి సమయంలో వర్షం కురుస్తుండగా కుమారస్వామి సాయంతో పొలాల్లో, ముళ్ళకంచెల్లో, పుట్టల్లో పాముల మధ్య పసరికను వెదకి తెచ్చి మంగకు అప్పగించాడు. మరోసారి పసరికను గార్డినల్ దొర బారి నుండి సూరప్ప సాయంతో విముక్తుని గావించి మంగకు అప్పగించాడు. గురువుగా లేదా అధ్యాపకుడుగా ధర్మారావుకు ఒక ప్రత్యేకత ఉంది. స్వతహాగా జాతీయవాది. కాని ఆ కాలానుగుణంగా ఆంగ్లం చదువుకున్నాడు. అతని అధ్యాపక జీవితాన్ని గురించి విశ్వనాథ వారు ఇలా వ్రాస్తారు.

"ధర్మారావు జాతీయకళాశాలలో ముప్పది రూపాయలమీద తెలుగు పండితుడుగా ఏర్పాటయ్యెను. ధర్మారావున కింగ్లీషు పాఠశాలలోకన్న నిచట పని చేయుటయే ఎక్కువ గౌరవముగా నిల్చెను."

క్రమంగా హరప్పకు గురువయ్యాడు ధర్మారావు. పాశ్చాత్యవ్యామోహం తప్పిపోయిన చిన్నరాణి సరోజనీదేవి పూర్వౌన్నత్యాన్ని నిలబెట్టతలంచి కుమారుడు హరప్పను జమీందారుగా చూసి మరణించింది. ధర్మారావు వద్ద చదువుకొమ్మని ఆదేశించింది. ధర్మారావు హరప్పను తీర్చిదిద్దడంలో

పరుసవేదిలా పనిచేశాడు. అతనిని కృష్ణమనాయని తండ్రి హరప్పలా సర్వ విషయాల్లోనూ తయారు చేశాడు. జమీందారు కుండవలసిన లక్షణాలన్నింటినీ నేర్పాడు. గురువు అంటే అదే ప్రథమము. హరప్ప తల్లికీ, నాయనమ్మకూ కర్మలు చేశాడు. వేణుగోపాలస్వామికి కల్యాణోత్సవం చేయించాడు. చివరికి ధర్మారావు హరప్పకు దివాను అయ్యాడు. గిరికకు భక్తిప్రబోధకుడు, వేదాంత దేశికుడు. అభినయాచార్యుడు. గిరికా ముక్తికి కారకుడు. భాగవతం మొదలు భరత నాట్యశాస్త్రం వరకూ క్షుణ్ణంగా గిరికకు బోధించాడు. ఆయన గురువుగా, మహావ్యక్తిగా మనకు గోచరిస్తాడు.

దేశభక్తుడుగా, సంఘసంస్కర్తగా ధర్మారావుదొక ప్రత్యేక వ్యక్తిత్వం, సంప్రదాయవాది. జాతీయవాది సంప్రదాయవాది కనుక జాతీయ కళలు, విద్యలపట్ల ప్రేమ ఉన్నప్పటికీ గాంధీజీ పిలుపు నందుకొని మిత్రుడు రాఘవరావు వలె సహాయ నిరాకరణోద్యమంలో చేరి కారాగార శిక్షలనుభవించలేదు. ఖద్దరుధారణ వరకే ఇతని స్వాతంత్ర్యోద్యమంలోని పాత్ర. కాకపోతే తన మిత్రుడు రాఘవరావుకు రాజకీయ బాధితుడని ఎంతో సహాయం చేయటం గమనించవచ్చు. రాఘవరావుతో కలసి మద్యపాన దోషాన్ని గురించి తద్బాధితులకు తెలియజెప్పటం కొరకు తిరిగినవాడు. ఆ విధంగా సంఘసంస్కర్తగా సైతం తనకు చేతనైనంతగా చేసినవాడు. తన యింట మాత్రం ఎల్లప్పుడు రాట్నం తిరుగుతూనే ఉండేది. తల్లీ, భార్య ఈ పని చేస్తూండేవారు.

ధర్మారావు మంచి కవి. అతడి పద్యాలు ఎక్కడా నవలలో ఉదహరించకపోయినా మిత్రులూ, ఇతరులు అతని కవితను ప్రశంసించినవారే. పద్యం చదివేతీరు అత్యంత జనాకర్షకంగా ఉండేది. ఈ ప్రత్యేకత విశ్వనాథ వారిదే. కృష్ణమనాయడు, రుక్మిణమ్మారావు, హరప్ప, గిరిక, మిత్రులందరూ ముగ్ధులయ్యేవారు. ధర్మారావు కళావేత్త. సర్వజాతీయ కళలు నేర్చినవాడు. విద్యానైపుణ్యం కలవాడు, ఉత్తమ విమర్శకుడు. శ్రీనాథుడు సీసపద్యాన్ని చెడగొట్టాడని విమర్శించినవాడు. కళాపూర్ణోదయం కంటె ప్రభావతీ ప్రద్యుమ్నము గొప్పదని నిరూపించినవాడు. ప్రబంధాలన్నిట ఆముక్తమాల్యద గొప్ప ప్రబంధమని రాయలనైపుణ్యము, ప్రతిభ, ప్రకృతి పరిశీలన అంతా ఆయన ఋతువర్ణనల్లో ఉందని గ్రహించిన ప్రతిభాశాలి. అతని విమర్శ

పద్మిమర్శ. ఈ విధంగా ధర్మారావు మంచి సాహితీవేత్తగా కూడ నిరూపించుకున్నాడు. గణాచారితో కలసినపుడు మహావేత్త త్రికాలవేదిగా కనిపించటం ఇతనిలోని మరో విశేషం.

ఇంత చెప్పినా ధర్మారావు గురించి చెప్పవలసింది ఇంకా ఎంతో ఉంది. ధర్మారావు గురించి పూర్తిగా చెప్పవలెనంటే వేయిపడగలు నవల నంతటినీ తిరిగి వ్రాయడమే అవుతుంది. "వేయిపడగలు నవల చదవటం ఒక అపూర్వమైన అనుభవం".

రెండు గుండేరు వరదలు విభజన బిందువుగా ఆదిమధ్యాంతాలు విస్పష్టమవుతున్న కథలో పెద్ద అరుంధతి భార్యగా రావటం, అంతములో చిన్న అరుంధతి భార్య కావడము కాలము మొదలు తుది అలా ధర్మారావులో సమీకరించినవి. ధర్మారావు ఆది మధ్యాంతాలలో మార్పులేని పురుషుడు. అరుంధతి ప్రకృతి. మార్పు ప్రకృతి లక్షణం. పెద్ద అరుంధతి పునరావృత్తి చిన్న అరుంధతి. ఇది వేయిపడగలు వెలువడ్డ విశ్వనాథ హృదయోద్వేగ తరంగ రేఖ. ఇదీ కావ్య స్వరూపం.

ఈ నవలలో భారతీయ సంస్కృతిని ఒక వంక, పాశ్చాత్యవ్యామోహాన్ని వేరొకవంక ప్రతిబింబించడానికి రెండు వర్గాల పాత్రలు సృష్టించబడ్డాయి. అరుంధతి, గిరిక శశిరేఖ, ధర్మారావు, కిరీటి, పసరిక, రాఘవరావు వంటి వారు ప్రాచీన సంస్కృతిలోని ఒక్కొక్క మహోత్కృష్టమైన గుణాన్ని నిరూపించటానికి మూర్తి దాల్చిన ప్రతీకలు. రంగారావు, రామేశ్వరము, మంగమ్మ, రాధాపతి వంటి వారు పాశ్చాత్యనాగరికతలోని దుర్మార్గులను ప్రతిబింబించినవారు. నవలలో పసరిక పాత్ర ఒక ప్రత్యేక సృష్టి. పాములా పుట్టి మనిషిగా మారి పాముగా మరణించిన తీరు అద్భుతావహం. పసరిక మెట్టచేలలో పడి పాములతో పిట్టలతో ఆడుకుంటూ ఉండేవాడు. అన్న ధర్మారావంటే ప్రేమా, గౌరవమూను. మెట్టపల్లాలుపోయి మాగాణమైపోతూ ఉండగా నవనాగరికత ప్రబలగా గోపాలకృష్ణారెడ్డి స్నేహంలోపడి ధర్మారావునే లెక్కచేయని స్థితికి వచ్చాడు. ఆ మార్పును సహించని పాములు, పిట్టలు పసరికను దగ్గరకు రానీయలేదు. చివరికి పాముచేత పాములా మరణిస్తాడు. 'టెంపెస్ట్' నాటకములో షేక్స్పియర్ సృష్టించిన 'కాలిబన్'పాత్రను గుర్తుకు తెస్తుందీ పసరిక పాత్ర.

మహామేధావిగా విశ్వనాథవారి ప్రతిభ వేయిపడగలు నవలలో గోచరిస్తుంది. శ్రీశ్రీ విశ్వనాథుని గురించి అన్నమాటలు ఇచ్చట గుర్తు పెట్టుకోవాలి.

"గ్రీకు రోమను కాలాల సంస్కృతి టి. ఎస్. ఇలియట్‌ను ఆకర్షించి నట్లే రామాయణ, భారత కాలాల వైభవము విశ్వనాథవారిని ముగ్ధుణ్ణి చేస్తుంది. ఆవేళకీ, ఈవేళకీ మానవజాతి చాల ముందంజవేసింది. ఇద్దరూ ఒప్పుకోరనుకుంటాను. ఇందుకు నిదర్శనంగా ఈ కాలపు మానసికాందోళనను వేలెత్తి చూపిస్తారు వీలైతే ఈ ప్రపంచాన్ని వెయ్యేళ్ళు వెనక్కి తీసికొని పోదామని విశ్వనాథ ప్రయత్నిస్తాడు. నాకత నెప్పుడూ నన్నయభట్టులాగ కనబడటానికి కారణమిదే. శ్రీవిశ్వనాథ తెలుగు జాతికి ఆధునిక కాలమున మార్గదర్శకుడైన మహర్షి. ప్రబోధకుడైన ప్రవక్త. భూతభవిష్యద్వర్తమానార్థకమైన కాలస్వరూపమును స్పష్టముగా దర్శించి ప్రకటించిన బ్రహ్మనైష్ఠికుడాయన. అంత ప్రక్రియా వైవిధ్యము గల సాహిత్యమును సృష్టించిన కవి ఈ నాటి ప్రపంచ భాషల యందెందును లేడు. ఒక్క మన తెలుగులో కలడు. ఆయన రచనలోగాని, వ్యక్తిలోగాని ఏదో అలౌకికమైన మహాశక్తి ద్యోతకమవుతుంది. అది మహాప్రభంజన శక్తి. శ్రీ సాంబ సదాశివుని సేవించే గణములలో నుండి ఏదో శివాజ్ఞ నిర్వర్తించడానికి మన ఆంధ్రభూమిలో అవతరించిన సహస్ర బాహువులు సహస్ర శీర్షములు కలిగిన ప్రమథమూర్తి యేమో అనిపించుతుంది. అందువల్లనే ఆయన విశ్వనాథ వారింట శివప్రతిష్ఠ జేసిన పుణ్యదంపతుల గర్భవాసాన జన్మించినాడని నా విశ్వాసము."

ఇది విశ్వనాథ వారి యశస్సు కర్పించిన తిరుగులేని నీరాజనం. అట్టి విరాట్ స్వరూపులు, మహా మేధావులు, ప్రతిభా సంపదతో పాటు అమేయ శేముషీ వైభవంతో వ్యుత్పన్నతా సంపన్నులైన విశ్వనాథవారి "వేయి పడగలు" ఒక అపూర్వసృష్టి. ఇది అనంతమైన ప్రపంచం.

# విశ్వనాథవారి విశ్వామిత్రుడు

—ఆచార్య నేతి అనంతరామశాస్త్రి

అద్యతనాంధ్ర కవిప్రపంచంలో అమేయకాంతుల్ని వెదజల్లిన కవి ప్రభాకరుడు, కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ. వీరు చేపట్టని సాహిత్య ప్రక్రియలేదు. చేపట్టి సమగ్ర కళాసంభరితంగాను, సహృదయానంద సంధాయకంగానూ నిర్వహింపని సాహిత్య ప్రక్రియ లేదు. వారు మహా కావ్యాలు నిర్మించారు. ప్రబంధాలు ప్రచురించారు. ఖండకావ్యాలు శర పరంపరగా కురియించారు గేయ కావ్యాలు వెలయించారు. నాటకాలు ప్రకటించారు. నవలలు, కథానికలు కల్పించారు. విమర్శలు వ్రాశారు. వేయేల, వారు సర్వసాహిత్య ప్రక్రియా విశ్వనాథులై విలసిల్లారు. సంప్ర దాయం పునాదిపై వెలసిన నవ్యతాసౌధం ఆయనసాహిత్యం. పరశ్శతాలైన ఆయన రచనలన్నింటిలోకీ కలికితురాయి శ్రీమద్రామాయణ కల్పవృక్షం.

ఇది వాల్మీకి రామాయణానికి యథాతథమైన తెలుగుకాదు. మూలానికిది భాష్యప్రాయం. తత్త్వానికి వ్యాఖ్య. రామాయణాన్ని ఏ భాషలో ఎవ్వరు రచించినా వారిపై వాల్మీకి రామాయణ ప్రభావమెంతో కొంత గోచరింపక మానదు. విశ్వనాథ శ్రీమద్రామాయణ కల్పవృక్షంపై కూడా ఆ ప్రభావం ఎంతో ఉంది. వారికి వాల్మీకి మహర్షిపై ఉన్న భక్తిగౌరవాలు అపారం. అందుకే—

"ఒక్క వాల్మీకి కాక వేఱొక్కడెవడు
సుకవి శబ్ద వాచ్యుండిక గుకవినింద
యప్రశస్త పథంబుగా నవుటఁజేసి
ముని ఋణము దీర్పనీకావ్యమును రచింతు" —అవతారిక

అనియు

"అచ్చమయిన యమృత మమరులు త్రాగినా
రోయి దానికే నసూయపడమ
పరమ మౌనియైన వల్మీకి కృతరామ
సత్కథా సుధారసంబు ద్రావి" —అవతారిక

అంటూ సర్వశిల్పభూమి అయిన ఆదికవి వైశిష్ట్యాన్ని హృదయంగమంగా ఉగ్గడించారు.

శ్రీమద్రామాయణంలోని పాత్రల్లో విశ్వామిత్రుని పాత్ర ముఖ్యమైంది. బాలకాండలోని 55 సర్గల్లో [18-73 సర్గల్లో] విశ్వామిత్రుడు ప్రముఖంగా కన్పిస్తాడు. దీంట్లో ఆయన తనను గురించి, ఇతరులను గురించి, ఆయన గురించి మరొకరు చెప్పటం ఉంది.

రాముని శస్త్రాస్త్ర ప్రావీణ్యానికీ, సీతారాముల కళ్యాణానికీ, దుష్ట శిక్షణ ప్రారంభానికీ విశ్వామిత్రుడు ప్రధానహేతువు. వాల్మీకి విశ్వామిత్రునిలో ఎక్కువగా ఋషిలక్షణాలే చూపాడు.

"అహం వేద్మి మహాత్మానం
రామం సత్యపరాక్రమం
వసిష్ఠోఽపి మహాతేజా
యేచే మే తపసిస్థితాః" [బాలకాండ. 19-14]

అనే శ్లోకంలో యోగబలంతో తాను శ్రీరాముణ్ణి చక్కగా ఎరుగుదును అని చెప్పటంచేత వశిష్ఠాది మహర్షుల యోగతపోబలం ఈయనకు కూడా ఉందని తెలుస్తుంది.

విశ్వనాథవారి కల్పవృక్షంలో విశ్వామిత్రునిపాత్ర బాలకాండలోని అహల్య- ధనుస్సు- కళ్యాణఖండాల్లో అధికంగా కన్పిస్తుంది. విశ్వనాథ పాత్రల్లో, వైవిధ్యం అనేక రీతుల గోచరిస్తుంది. ఆపాత్రలన్నీ జీవలక్షణాల్తో స్ఫురిస్తుంటాయి. ఇంచుమించుగా అందరూ ఆత్మాభిముఖులుగా కన్పిస్తారు. అందులో విశ్వనాథవారి లక్షణాలుకూడా కొన్ని గోచరిస్తాయి. లోకానికి ఆదర్శమైన సీతారామకల్యాణ సంధాత కావటంవల్ల విశ్వామిత్రుడు విశ్వానికి అమిత్రుడుకాక విశ్వానికి మిత్రుడై విశ్వశ్రేయస్సు సంపాదించాడు.

విశ్వనాథ చిత్రించిన విశ్వామిత్రునిలో రాజస-ఋషి తత్త్వాలేకాక ఉత్తమ మానవత్వం, ఆర్ద్రహృదయం స్ఫురిస్తాయి. విశ్వామిత్రుడు బ్రహ్మర్షి కావటానికి చేసే ప్రయత్నాల్లో అతనిలో ఉన్న కామం, క్రోధం, మాత్సర్యం పాఠకులకు ప్రత్యక్షమౌతాయి. అంతేకాక కల్పవృక్షంలో విశ్వామిత్రుడు కథకుడుగాఎట్లు దర్శనమిస్తున్నాడో చూద్దాం.

కథాకథనం ఒక గొప్పకళ. దీంట్లో నన్నయ కృతహస్తుడు. ఆయన లోని కథాకథన శిల్పాన్ని వడబోసి వడబోసి అందలి సారాన్ని గ్రహించారు విశ్వనాథ.

ఒక విషయం మనస్సుకు హత్తుకోవాలంటే కథారూపంగా చెప్పటం ప్రపంచ సాహిత్యంలో ప్రాధాన్యం వహించింది. కథకులు లోకాతీత విషయాలను లోకవిషయాలను, తమ అనుభవాలను, ఊహాపోహలను, వర్ణనానైపుణ్యాన్ని నీతులను కథల్లో ప్రవేశపెడతారు అన్ని కథలను ఒకే రీతిగా చెప్పటానికి వీలులేదు. పాత్ర, రస, భావ సన్నివేశాలను బట్టి కథలను భిన్నభిన్న మార్గాలల్లో చెప్తారు. ఈ మార్గాలన్నింట విశ్వనాథ నిగ్గుతేలిన వారు. ఎవరో ఒకరు కథ చెప్తుంటే వినేవారు మధ్య మధ్య ఆ కథాకథన పద్ధతుల్ని వ్యాఖ్యానం చేస్తుంటారు.

కల్పవృక్షంలోని బాలకాండలో ప్రధాన కథకు అంగంగా పెక్కు ఉప కథలున్నాయి. అందులో చాలా భాగం విశ్వామిత్రుడు రామలక్ష్మణులకు చెప్పినవే. సందర్భోచితంగా వాటిని మూడు రకాలుగా విభజించవచ్చు. 1. హ్రస్వకథలు, 2. దీర్ఘకథ, 3. నాతిదీర్ఘ నాతి హ్రస్వకథలు అని. ఇవికాక జనకపురోహితుడైన శతానందుడు చెప్పినవి కొన్ని ఉన్నాయి. రామ లక్ష్మణులకు చెప్పే కథలన్నీ ప్రశ్న-సమాధాన రూపంలో ఉంటాయి.

కల్పవృక్షంలో విశ్వామిత్రుడు బాల రామునికి, తక్కిన మునులకు నచ్చేవిధంగా కథలు చెప్పటం, పరతత్త్వాన్ని, రాముణ్ణి తెలుసుకోవడంలో భక్తిభావాన్ని వెలువరించటం, కౌశికీ నది వృత్తాంతం చెప్పేటప్పుడు సోదరీ ప్రేమను వెలువరించడం, సౌహార్దం, ఆత్మీయత మొదలైన విశేషాలను వ్యక్తీకరించటం, విశ్వనాథ వారి విశిష్టత. జీవితంలో సుఖదుఃఖాలన్నింటినీ అనుభవించి పరిణతిపొందిన ఒక మహావ్యక్తిగా విశ్వామిత్రుణ్ణి విశ్వనాథ పరిష్కరించారు.

శిశువులు రసానుభూతి పొందటం ఏమిటి ? మనస్తత్త్వానుసారంగా చూస్తే కామక్రోధాదులు జీవలక్షణాలు. అవి మాతృగర్భం నుంచే ప్రారంభ మౌతాయి. ఇవి సహజాతులు. వయసును బట్టి వాటిని శారీరకంగా అనుభ వించే యోగ్యత కలుగుతాయి. మానసిక వికాసాన్ని బట్టి మానసికంగా వాటిని

ఊహాలో పొందవచ్చు. అందువల్లే "పరిహాసాశ్చర్యభీరౌద్ర శృంగార" స్థానుత్తైన కథల్ని వినటంవల్ల రామలక్ష్మణుల్లో ఆయారసాలకిఅనుకూలంగా స్పందన ఏర్పడ్డట్లు విశ్వనాథ వివరించాడు.

"తపము కలుగునేమో యరుదార మహత్తులు కలుగునేమో! యీ
కృపయును గల్గునేమో మరియే ఋషులందుననే రసోల్బణా
నుపముగా గథాకథనముండదు మీవలె! మాకు జెప్పడా !
యిపుడన రామచంద్రుడు చనుదెంచి హసించుచు మౌని యిట్లనెన్"
[అహల్య-224]

మహా తపస్సు- కృప- మహత్తులు అనేవి సర్వసామాన్యంగా మహర్షులకుండే లక్షణం. కాని ఋషులందరిలోనూ రసోల్బణంగా కథాకథనం ఉండదు. 'మీవలె' అని రాముడు విశ్వామిత్రుని కథాకథనాన్ని ప్రస్తుతించాడు. కథ చెప్పడమే ఋషి ప్రధాన లక్షణంకాదు. కాని విశ్వామిత్రునిలో యీ లక్షణం ఉంది, అంతే గాదు ఆ కథాకథనం రసోల్బణంగాను, అనుభవంగానూ ఉంటుంది.

'కథాకథనం ఉండదు మీవలె' అని రాముడన్న వెంటనే విశ్వామిత్రుడు

"ఛిన్న కథ జెప్పి నీకు నీచేత నొక్క
యే మహాకార్యమేను జేయింతు నింత
యల్ప సంతోషివేమి రామా ? యటంచు
నవ్వె ఋషి; యెల్ల ఋషులును నవ్వినారు." [అహల్య-225]

సహజంగా పెద్దవాళ్ళ పిల్లలచేత పనులు చేయించాలంటే చమత్కారవంత మైన కథలు ఉత్సాహం కలిగించే మాటలు చెప్తారు. అలా చెప్పి విశ్వామిత్రుడు రామా ! నీచేత యే మహాకార్యమో చేయిస్తానన్నాడు. ఈ విధంగా విశ్వామిత్రుడు రాముని పరిహాసం చేసి హాస్యరసాన్ని పోషించాడు

పిమ్మట విశ్వామిత్రుడు అంగదేశవృత్తాంతం, సరయూనది వృత్తాంతం, తాటక చరిత్రలనే చిన్న కథలు చెప్పి, రాముని మనస్సు ఆకర్షించి తాటక సుబాహుల సంహారం అనే మహాకార్యం రాముని చేత చేయించాడు. అప్పుడు

"తలవంచుకొనియె రాముడు
సౌలపున నగ్రజునివంక జూచెను దమ్ముం
దలఘువు మౌని కథాకథ
నలపన దళదభిముఖీన నయనుండగుచున్" (అహల్య-226)

లక్ష్మణుడు అసామాన్యమైన విశ్వామిత్రుడి కథాకథనమందు అభిముఖీనమైన కన్నులు కలవాడైనాడు. శ్రోతలు కథలు వినేటప్పుడు వక్తముఖం చూడటం సహజం. కొంతమంది రెప్పవేయకుండా తన్మయులై కథ వింటారు. ఆ లక్షణాన్ని విశ్వనాథ పై పద్యంలో సూచించాడు.

కల్పవృక్షంలో, ముఖ్యంగా వామనావతార కథ- గంగావతరణకథ- విశ్వామిత్రకథ- అహల్య కథలను చెప్పటంలో అనుస్యూతంగా వచ్చే ఒక సంప్రదాయం కనబడుతుంది.

వామనావతార కథలో రాముడే వామనుడని విశ్వామిత్రునకు విస్పష్టంగా తెలుసు. లక్ష్మణునికి కూడా అంతరాంతరాల్లో తెలుసు. అందుచే వటువుని గూర్చి చెప్తూ విశ్వామిత్రుడు.

"ఒగివటువెంత యందముగ నుండె నటందువటన్న లక్ష్మణుం
డ గు వటువెంత యందముగ నైనను నుండు నటన్న రాముడున్
నగవు మొగంబు తోడ బయినన్ గథ చెప్పుడటన్న వామనుం
డెరుగుచు బోయి మూడడుగు లిమ్మన నిచ్చెను దైత్యరాజునున్"
—బాల-అహల్య-188

విశ్వామిత్రుడూ లక్ష్మణుడూ 'వటువెంత అందంగా ఉన్నాడో' అంటే రాముడు 'వటువు మహా చక్కగా ఉన్నాడని' అనడు. ఎందుకని. ఊహించుకుంటే తానేకదా ఆవటువు. తన్నుగురించే గదా ఇంతముచ్చటగా వీళ్ళు చెప్పుకుంటూంట ! అని ఆయనకు తెలిసిపోయింది. అదెలా తెలిసిందంటే రాముని నగవు మొగంబువల్ల అర్థమైంది. ఇక ఆమీద కథను చెప్పమనడం వల్ల అర్థమైంది. అసలు విశ్వామిత్రుడీ కథను ఎందుకు చెప్పాడంటే ఈ కథ నాలంబనంగా తీసికొని స్పష్టా స్పష్టంగా, దృశ్యాదృశ్యంగా రాముణ్ణి తానెవ్వరో తెలిసికోమంటున్నాడు. రాముని కీ విషయం తెలుస్తూనే ఉంది. కాని తెలిసినట్లు లోకానికి కనబడదు. లోకకళ్యాణం కోసం ఎన్నో పనులు ఆయన

చేత చేయించడానికీ, చేయడానికీ ఈ ఆత్మజ్ఞానం అవసరం. ఈ మేల్కొల్పు కావాలి. వామనావతార కథయీ మేల్కొల్పులో ఒక భాగం

పిమ్మట గంగ, త్రిపథ అయిన వృత్తాంతం అడుగుతూ రాముడు "కథాత్తానంత విజ్ఞాన మేవిశ్వంబుల్ వెలిగించు నాయెడద నేవిందున్ వచింపంగదే" అని ప్రార్థించాడు. (అహల్య-275)

కథ వింటం కేవలం ఉబుసుపోకకో, కాలక్షేపానికో కాదు. దానివల్ల విజ్ఞానం కలగాలి. ఆ విజ్ఞానం కూడా విశ్వానికి వెలుగు ప్రసాదించేదిగా ఉండాలి. అలాంటి మహాప్రయోజనవంతమైన కథలను మాత్రమే వింటం ఉత్తముల లక్షణం. ఒక కథ వినటం వల్ల ఇహశక్తిగాని పరశక్తిగాని పెంపొందాలి.

విశ్వామిత్రుడు రామునికి చెప్పిన కథల్లో కొన్ని ఇహశక్తిని, కొన్ని పరశక్తిని కలిగించాయి. రాముని భవిష్యత్తును తీర్చిదిద్దటంలో ఈ కథలు ఎంతగానో ఉపయోగపడ్డాయి. అలాంటి అనంత విజ్ఞానం కథకథన పరమ లక్ష్యం కావాలి.

రాముడు గంగ త్రిపథ అయిన వృత్తాంతం అడిగితే విశ్వామిత్రుడు కుమారస్వామి జననం చెప్తాడు. శ్రోతకు కలిగే పై సందేహానికి సమాధానం చెప్పిన స్ఫురించదు. ఇక్కడ విశ్వనాథవారి విశ్వామిత్రుడు

"అడిగినదేమో చెప్పకువె యా యితరమ్మఖిలంబు చెప్పమా
యుడుగక యట్లేవించుబడియుందురు శ్రోతలు నిద్దియే సుమీ
గడుసరియౌ గథాకథన కౌశల మేమియటందు రన్న రా
బుడతలు రామలక్ష్మణుల మోముల నవ్వులు మ్రోసెమువ్వలై"
(అహల్య-306)

కథాకథన కౌశలంలోని గడుసుతనం ఇదే సుమా ! అని విశ్వామిత్రుడంటే రామలక్ష్మణులు కిలకిలా నవ్వారు.

అడిగిందేదో చెప్పేవాడు వెంటనే చెప్తే ఉత్కంఠ తొలగిపోతుంది. వారి కింకా వినాలనే శ్రద్ధ ఉండదు. అడిగింది వెంటనే చెప్పేయక దానికి పూర్వరంగమైన ఇంకో వృత్తాంతాన్ని మొదలుపెడితే తామడిగిన విషయం

వస్తుందనే తలంపుతో శ్రోతలు తత్పరులై వింటారు. ఇక్కడ అదే జరిగింది. కుమారస్వామి జననంలో కూడా గంగ పాత్ర కొంత ఉంది. అందువల్ల రాముని ప్రశ్నకు ఇది కూడా సమానమే. కాని కుమారస్వామి కథ మొదలు పెట్టిన వెంటనే ఈ పరమార్థం స్ఫురించదు.

అక్కడి నుంచి 'విశ్వామిత్రుడు', అసలు కథ చెప్పెదను వినుడని' అయోధ్య నగరం గురించి చెప్పి వాళ్ళను నవ్వించాడు.

ఇక్కడ రాముడు వేసిన ప్రశ్న ఒకటి కాగా విశ్వామిత్రుడు రెండు విషయాలు చెప్పాడు. 'ఏకక్రియాద్వ్యర్థికరీబభూవ' అన్నట్లు ఒకటి అంగ దేశవృత్తాంతం. రెండోవది తన వంశ వృత్తాంతం.

"ఇది యీ దేశపు గథన
మ్మిదియును నాజన్మకథ మీవడుగుటచే
నిది చెప్పకుండ నాగక
వదిలితి సర్వంబుద్వత్కృపాశ్రోతృతకై" (అహల్య-252)

ఇది వాల్మీకంలో లేదు. దీన్ని ఎందుకు చెప్పాల్సి వచ్చిందంటే విశ్వామిత్రుడు తన జన్మవృత్తాంతాన్ని చెప్తూ తన మాతృభక్తిని ప్రకటించుకున్నాడు. అమూలకం అయిన ఈ కథనం వల్ల కవి ఆత్మీయత, ఆయన దేశభక్తి ఎట్టిదో తెలుస్తుంది. విశ్వామిత్రుడు తన జన్మ కథ చెప్పి అది ఈ దేశం కథనం. ఇది నా జన్మ కథ అని చెప్పకోతగింది. అయినా తత్కృపాశ్రోతృతకై సర్వము వదిలినాను అని చెప్పాడు.

క్రమంగా గంగ త్రిపథ అయిన వృత్తాంతాన్ని విశ్వామిత్రుడు సమగ్రంగా, సుదీర్ఘంగా చెప్పాడు. బహుశ ఆ కథ ప్రాతఃకాలం నుంచి సంధ్యా కాలం దాకా సాగి ఉంటుంది. ఆ రాత్రి కొంత గడచినా ఎవ్వరూ నిద్ర పోలేదు. రాముడు-లక్ష్మణుడు ఆ కథల్లోని పాత్రల్ని, వారి స్వభావాల్ని చక్కగా ప్రశంసించారు. వారికి కావలసింది భగీరథుల పట్టుదల. అప్పుడు అక్కడ మేల్కొన్న ఋషులు.

"జామిపువులోని కేసరచ్ఛవి వహించి
ప్రాచి తెలు వెల్గు రేఖలు పారుదెంచె

నేమి సాగరుల్ వారలదేమి ప్రభులు !

ఏమికథ ? యేమి చెప్పుట? యేమి సొగసు?" అనుకుంటూ శయ్యా గతులయ్యారు. విశ్వామిత్రుడు చెప్పిన సాగరుల కథ ఋషులన్నట్లుగా అత్యంత సౌందర్యసముపేతంగా ఉంది. విశ్వనాథ ఇక్కడ చూపించిన విశే షాలను గమనిస్తే సహృదయ శ్రోతలంతా ఏమికథ ? ఏమి చెప్పుట ? ఏమి సొగసు' అని ప్రశంసించారు. ఈ కథలన్నీ రామునికి బలాన్ని ఆత్మగుణా లను పెంపొందించాయి.

మరుత్తుల వృత్తాంతలో దితిగర్భాన్ని అమరేంద్రుడు చీల్చబోతే దితి తొలుత కోపించి పిమ్మట ఆతన్ని క్షమిస్తుంది. ఈ కథ విన్న రాముడు విశ్వామిత్రుని చూచి

"ముని భృశాశ్వుని విద్యలిచ్చినది ఘనమొ
మునిపతీ! యీ కథాళి చెప్పినది ఘనమొ" (అహల్య 498)

అని ప్రశ్నిస్తాడు. భృశాశ్వ సంబంధులైన అస్త్రవిద్య లిచ్చినప్పటి ఆనందం కంటే రామునికి విశ్వామిత్రుడు చెప్పే కథలు వినేప్పుడుండే ఆనందమే ఆనందంగా ఉందట.

ఇట్లా నన్నయవలె విశ్వనాథకూడా 'కథాకథనం'లో వైశిష్ట్యాన్ని చూపించాలనే ఆశయం ఉన్నవాడు. అందువల్లనే తనకు ఇన్ని కథలు చెప్పిన విశ్వామిత్రుని సంపూర్ణవృత్తాంతాన్ని శతానందుని ద్వారా రాముడు వింటాడు.

బాలకులైన రామలక్ష్మణులకు కథలు చెప్పేటప్పుడు విశ్వామిత్రు నిలో ఋషిత్వం, నియమనశక్తి, సౌహార్ద్రం గోచరిస్తాయి. జీవలక్షణమైన కామాన్ని అనుభవించడాన్ని నిర్వచించడంలో విశ్వనాథ విశ్వామిత్రను చక్కగా రూపొందించారు. ఈ విషయాన్ని బాలకాండాంతంలో విశ్వనాథ

"అమరీ కైశిక పారిజాత కుసుమోహాస్వాదువీ బాల కాం
డ మునీ భక్తుడు శోభనాద్రి దగు సంతానంబు జన్మాద్యపా
యముఁ దప్పించుట! యెన్ని పుట్టువుల పేట్టితిన్ శివా ! యేమికా
మము? కోపంబదియేమి? యేమి యగు నీ మాత్సర్యమోహో ప్రభూ"

రామాయణ కావ్యమే కాగు అందులోని బాలకుండే కాదు. ఏకావ్యమైనా అది స్వాదు వైనప్పుడే రసాన్ని పండించుకుంటుంది. అయితే బాలకాండ కేవలం స్వాదువవడమేకాదు, ఇందులోని రుచి, వాసనా, గుణాలు అన్నీ ఎక్కడో స్వర్గంలోని పారిజాతపు స్పృహను కల్గిస్తున్నాయని కవి భావన. అంటే ఇందులోని స్వాదుత్వం లౌకిక పరిధులను దాటి స్వర్లోకపుటంచుల్ని తాకుతుందన్నమాట ! అందుకే ఈ బాలకాండ 'జన్మాద్యపాయాన్ని తప్పించుగాక !- అని కవి కోరుకున్నాడు.

"ఏమి కామము ! కోపంబదియేమి ? ఏమి మాత్సర్యమోహో !"
అని కవి ఎంతో బాధపడుతున్నాడు.

కవిది విశ్వామిత్ర సృష్టి. సృష్టికి విశ్వామిత్రునకున్నంత కామం,కోపం, మాత్సర్యం ఉండాలి. అంటే మౌలికమైన ఉద్రేకాల అవధుల్ని చూడకల్గినవాడే జీవితాన్ని దర్శించ గలుగుతాడు.

విశ్వామిత్రుడు బ్రహ్మర్షి అవటానికి కారణం వశిష్ఠునితో ఏర్పడ్డవైరమే. విశ్వామిత్రుడు వశిష్ఠుని వంటి వాడు కాదు. ఆయన సరిగ్గా మనవంటివాడు, పైగా మన అందరికన్న ఆయనకు కోపం పదిరెట్లు కాదు వెయ్యిరెట్లుఎక్కువ. ఆయనలో కామం ఉంది. లోభం ఉంది. పుట్టుకచేత రాజవడంవల్ల సంక్రమించి, అధికారం వల్ల పోషింపబడిన మదం ఉంది. వీనివల్ల మోహం ఏర్పడింది. తాను కోరింది తనకు చేజిక్కకపోతే, తాను ఆశించిన పని జరక్కపోతే విశ్వామిత్రునికి క్రోధం కొండెత్తు పెరుగుతుంది.

తానొక యజ్ఞం చేస్తున్నాడు. ఆ యజ్ఞానికి అందరినీ రమ్మన్నాడు. వచ్చిన వాళ్ళు వస్తారు. రానివారు రారు అని ఊరుకోడు. ఎందుకురారో ఏమన్నారో కనుక్కోమంటారు. యజ్ఞానికి వశిష్ఠుడు రాలేదు. ఆయన పుత్రులు రాలేదు. తన్నేదో అన్నారని విశ్వామిత్రుడికి పట్టరాని కోపం వచ్చింది.

"నన్న దుష్టుని నిందించినాడెవండు
నామహోగ్రతపంబాడి నాడెవండు
వాడువాడు నిర్దగ్ధుడై భస్మమగుత
మగుచు నీళ్లలు వదలె గోపాత్త బుద్ధి" -(బాల-ధనుస్సు-136)

వెంటనే వశిష్ఠ పుత్రులు వందమంది భస్మీభూతులైపోయారు. కాని విశ్వామిత్రుని కోపం తగ్గదు. కోపంపట్టజాలక 'వీరు కాలపాశనీతులై యేడువందల జన్మములు కుణపఖాదుల వాలన్నాడు. శ్వమాంసాహారులు కావాలన్నాడు. విరూపులవాలి అన్నాడు.

"ఈమహోదయుండు నేల దూషించె న
న్నది యకారణముగ నాతడును ని
షాద జన్మమెత్తి సత్యదయా ధర్మ
దూరుడగు నటంచు దూరువెట్టి" (ధనుస్సు-138)

అంతటి ముక్కోపి విశ్వామిత్రుడు. అంత కోపం కల్గడానికి కారణం లేక పోలేదు. అడగ్గానే కామధేనువును వశిష్ఠుడు ఇవ్వకపోవడమే. అందుకేవానిలో మాత్సర్యం. మేనకా విశ్వామిత్రుల శృంగార లీలలవల్ల కమండలువు, అగ్నులు, దర్భలు మూలకు తోసిన విషయమే విశ్వామిత్రునకు జ్ఞప్తికి రాలేదు.

విశ్వామిత్రుణ్ణి నీవు రాజర్షి వంటే తృప్తి కల్గలేదు. ఋషివంటే తృప్తి కల్గలేదు మహర్షివంటే తృప్తి లేదు నీవు బ్రహ్మర్షివని అనిపించుకోవడానికి భయంకరంగా శరీరాన్ని కష్టపెట్టుకున్నాడు. అప్పుడు కోపాన్ని దరికి చేరనీయలేదు. కామాన్ని కంటిచూపుతో గెంటివేశాడు. మాత్సర్యాన్ని దరికి చేరనీయలేదు. ఎవనిపట్ల మాత్సర్యాన్ని వహించి తాను బ్రహ్మర్షి అయితే చాలు ననుకొన్నాడో ఆయనకు అత్యంత సన్నిహితుడైపోయాడు. ఆయనే వచ్చి తన్ను 'బ్రహర్షివయావు అని అనాలన్నాడు. విశ్వామిత్రుడు అడగ్గా

"ఏమీ మహోరాశి ! యేను బ్రహ్మర్షినా ?
యనినంత నౌను బ్రహ్మర్షివంచు
ఏమీ జగన్నాథ ! యేను బ్రహ్మర్షినా ?
యనినంత నౌను బ్రహ్మర్షివంచు
ఏమీ తపోమూర్తి ! యేను బ్రహ్మర్షినా ?
యనినంత నౌను బ్రహ్మర్షి వగుదు

నీవు బ్రహ్మర్షివే నిక్కంబు సందేహ
మింత లేదని వచియించె నవ్వ
శిష్టుడానంద పులకిత చిత్త వీధి
గాధి సూతి వశిష్ఠుని గౌగలించె
గాధి జాతు వశిష్ఠుడు కౌగిలించె
శివుని శ్రీపతి శ్రీపతి శివుడువోలె" (బాల-ధనుస్సు-257)

అని సమాధానం. ఇందులోని ఒక్కొక్క భాగం ఒక్కొక్క మజిలీ. ఒక్కొక్క మజిలీని దాటేసరికి ఒక్కొక్క అంతశ్శత్రువును జయించడం, లోబరచుకోవడం కనిపిస్తుంది. కొందరు మొదటి మజిలీ దగ్గరే ఆగిపోతారు. కొందరు యాత్రనే ఆరంభించరు. ఏ కొద్దిమందో ముందుకు సాగిపోతారు. విశ్వామిత్రునికి మాత్రమే బ్రహ్మర్షి అయేవరకు విశ్రాంతి లేదు.

అందుకే జనకుడు విశ్వామిత్రుని గూర్చి
"నీవొక వెల్గుకంబమవు నీగుణముల్ జగతే మహౌఘ సం
ప్లావన దక్షముల్ మృదు కృపామతి! నీకథ దివ్యబోధ ! నా
భావన దాటిపోయెను; భవత్కథలోని మహత్తులన్ వినన్
నీవరుదేర నాక్రతువు నింగిని నిల్చె మహర్షి చంద్రమా !

అని అంటాడు. (ధనుస్సు-262)

ఇంక విశ్వనాథ దృష్టిలో విశ్వామిత్రుడు తనవంటివాడు. ఎలాగంటే,
"అదిని బంధుహేతువయినట్టివి సంగత మోహకోప కా
మాదులు త్రుంచికోను నిను నాశ్రయమంది త్వదర్థమైన
వీవాదములం దగుల్కొనుచు వాదసమాగత మోహకోప కా
మాదుల చేతగట్టు పడునట్టుల జేయకువే! మనఃపతీ !"

అని ప్రార్థిస్తాడు.

విశ్వామిత్రుడు శమదమాదులను ఎలా సాధించాడో, ఎలా జితేంద్రియుడయ్యాడో ఆయన కథలో వివరింపబడింది. మానవుడు ఆధ్యాత్మిక ఔన్నత్యం కోసం చేసే నిరంతర యాత్ర విశ్వామిత్రుని కథ.

రామునికి వశిష్ఠుడెంత అవసరమో విశ్వామిత్రుడును అంతే అవసరం. రాముడే యీ విధంగా అనుకుంటాడు మనస్సులో:

'నాకు వశిష్ఠ బ్రహ్మ దండంబు రక్ష
నాకు గాధేయ నస్త్ర సంతకులురక్ష'

చిత్రమేమిటంటే అందరి అస్త్ర గురువులవంటివాడు కాదు విశ్వామిత్రుడు. ఈయన బ్రహ్మర్షిత్వాన్ని సాధించిన అస్త్ర గురువు.

అన్ని కథలు ఒక ఎత్తు. అహల్య కథ ఒక ఎత్తు. ఇందులో విశ్వామిత్రుడు ఇహలోక విషయాలను కాచివడపోశాడు. కామం ఎంత పతనావస్థను కల్పిస్తుందో స్వయంగా తెలుసుకొన్న కథకుడు విశ్వామిత్రుడు. కథకుడు సంస్కారి అయితే కథాకథన రీతి లోకోత్తరంగాను, గుణోత్తరంగాను ఉంటుంది. అతడు శ్రోతల అర్హతలనుబట్టి ఔచిత్యాన్ని అనుకరించి కథ చెప్తాడు. ఈ కథలో శిష్యుడైన బాలరామునికి విశ్వామిత్రుడు ఋషి అని తెలియాలి. అసభ్యత ఉండకూడదు. పిల్లలకు చెప్పటానికి వీలులేని విషయాన్ని విషయం మాత్రం అర్థమయ్యేటట్లు వ్యంగ్యరూపంలో అందిస్తాడు. ఇదే విశ్వనాథ వారి శిల్పలక్షణం.

తరువాత రాముడు ఏకాంతంలో లక్ష్మణునితో

"ఈ ఋషు లెవ్వరు చెప్పిన
సార కథాకథన మొక్కచాయనే నడచున్
వీరంతర్ద్రష్టలు బహు
ధారాసిత సూక్ష్మతర కథాంశలు సుమ్మా" (ధనుస్సు—271)

అంటాడు. ఇదే విశ్వనాథ కథాకథన శిల్పం. ఋషు లెవ్వరు చెప్పినా ఆ కథాకథన విధానం ఒకే పద్ధతిలో నడుస్తుంది. దానికి కారణం వారు అంతర్ద్రష్ట కావటం. అంటే ఆత్మోన్ముఖులుగా మారటం. సర్వప్రాణులకు ఇంద్రియాలు బహిర్ముఖంగా ఉంటాయి. వాటి ప్రవృత్తి అంతా బహిర్జగత్తుపైనే. విశ్వామిత్రుడు అలాంటి అంతర్ద్రష్ట. శతానందుడు కూడా అలాంటివాడే. అందువల్లే రాముడు ఆ కథల్లో అనేకమైన సూక్ష్మాసూక్ష్మములయిన ధర్మా

అను కథాకథన రూపంలో వ్యక్తీకరిస్తుంటారు. వాటి అన్నింటిలో బహి సౌందర్యంకంటె అంతః సౌందర్యం ప్రధానంగా ఉంటుంది.

ఈ విధంగా విశ్వామిత్రుడు మానవ సహజమైన దౌర్బల్యాలను అనుభవించి వాటిలోంచి బయటపడి స్థితప్రజ్ఞు డౌతాడు. రాముని సాక్షాత్ పరబ్రహ్మస్వరూపుడిగా, ధ్యానస్థితిలో అనుభవపూర్వకంగా తెలుసుకున్న విశ్వామిత్రుడు మనకు కనబడతాడు. రాముని సన్నిధిలో ఉన్నంతసేపూ విశ్వామిత్రుడు ఒక భక్తుడుగా దర్శనమిస్తాడు. తాను మహర్షి- రాముడు బాలుడనే దృష్టికూడా ఉండటంవల్ల వ్యావహారిక జగత్తులో విశ్వామిత్రుడు గురువుగా, హితోపదేశకుడుగా, కథకుడుగా దర్శనమిస్తాడు. ఆ సందర్భంలో ఆయనలో గుప్తమైన వాత్సల్యం కూలంకషంగా కట్టలు త్రెంచుకుంటుంది. ఈ విధంగా విశ్వనాథ విశ్వామిత్రుని పాత్ర ప్రాముఖ్యం కల్పించాడు. అదే సత్యం శివం సుందరం.



# జాషువ నాటకం-తెరచాటు

డా. తేళ్ళ సత్యవతి

జాషువా ఖండకావ్యాలు ప్రసిద్ధి చెందినంతగా వారి నాటకాలు ప్రచారం లోకి రాలేదు జాషువ నాటకాలు రచించారా? అని ఆశ్చర్యపోయేవారు కూడ లేకపోలేదు.

వీరి నాటకాలను పౌరాణిక, చారిత్రక, సాంఘిక అని మూడు విధాలుగా విభజించవచ్చు. రుక్మిణీ కల్యాణము, మదాలస, దావీదు చరిత్ర, చిదానంద ప్రభాతము, ధృవవిజయము పౌరాణిక నాటకాలు 'వీరాబాయి' చారిత్రక నాటకం. తెరచాటు సాంఘిక నాటకం. ఇందులో మదాలస,దావీదు చరిత్రలు అముద్రితాలు, అలభ్యాలు.

**1 పౌరాణిక నాటకాలు :-** a) రుక్మిణీ కల్యాణం : రాజమండ్రి లోని చింతామణి నాటకమండలి నిర్వాహకులు సత్యవోలు గన్నేశ్వరరావు గారి ప్రోత్సాహంతో 1918-19 సం॥ల మధ్యకాలంలో రచించి గుళ్ళపల్లి వెంకట్రామయ్య చౌదరిని కృతిపతిని చేశారు. శ్రీ రాధాకృష్ణ విలాస సభ వారు దీనిని మొదట ప్రదర్శించారు ఇతివృత్తాన్ని ఆంధ్ర మహాభాగవతం లోని దశమ స్కంధం నుండి గ్రహించారు. రుక్మిణి తన సందేశం ద్వారా శ్రీకృష్ణుని రప్పించి రాక్షస వివాహం చేసుకోవడమే ఇందలి ఇతివృత్తం.

b) చిదానంద ప్రభాతం :- క్రీస్తు జనన మహత్మ్యాన్ని తెలియజేసే 'చిదానంద ప్రభాతము' అనే నాటకాన్ని కూచినపూడి గ్రామవాసి కర్రా యేసేపు గారి ప్రోత్సాహంతో రచించారు. గుంటూరులో తెలుగు పండితునిగా పని చేస్తున్నపుడు క్రైస్తవ సమాజంతో కలిగిన పరిచయం 'చిదానంద ప్రభాతం' రచించడానికి కారణముయింది. పరిశుద్ధ గ్రంథమయిన బైబిలు క్రొత్త నిబంధనలో చెప్పబడిన క్రీస్తుపుట్టుకను ఇతివృత్తమూలంగా గ్రహించారు. క్రైస్తవ సాహితీ మిత్రుల కోరికతో రచించిన ఈ నాటకం ప్రజల ఆదరణకు నోచుకోలేక పోయింది. దీనిని ఎవరికీ అంకితమివ్వలేదు.

c) ధృవవిజయం :- రాధాకృష్ణ విలాససభ వారి కోరిక ననుసరించి రచించిన పౌరాణిక నాటకం ధృవవిజయం. శ్రీమదాంధ్ర భాగవతం లోని దశమ స్కంధమందలి ధృవోపాఖ్యానం కథామూలంగా గ్రహించిన కరుణరస ప్రధానమైన రచనయిది.

**2.** చారిత్రిక నాటకం: వీరాబాయి: గుంటూరు బాలమిత్రసమాజం కోరిక మేరకు 1926 లో వీరాబాయి రచించారు. హిందూ ముస్లిం మైత్రిని మనసు నందుచుకొని ఈ చారిత్రక నాటకాన్ని రచించినట్లు కవి పేర్కొన్నాడు. మేవాడ పాలకుడైన ఉదయసింహుని భార్య వీరాబాయి శౌర్యసాహసాలు ఇందులో వర్ణించబడ్డాయి.

సాంఘిక నాటకం : తెరచాటు : అనాటి సాంఘిక సమస్యలను ప్రతిబింబించిన నాటకం యిది. గూడవల్లి రామబ్రహ్మంగారు ఏర్పాటు చేసిన నాటక పోటీకోసం 1935 లో రచించారు. మూడు గంటల కాలపరిధిలో ప్రదర్శించగల నాలుగు అంకాల విషాదాంత నాటక మిది. అనివార్య కారణాల వలన పోటీలు విరమించుకోగా కవి తానే స్వయంగా 1946లో దీనిని ముద్రించారు."నామనస్సును వేధిస్తూయున్న పెక్కు విషయాలను సమకూర్చు కొని నేనీ నాటకాన్ని వ్రాసినాను. సంస్కరణాభిలాష నాకు మిక్కుటంగా కలదు. కథ కేవలం కల్పితం. బాల వితంతువుల హృదయావేదన, తత్ఫలితంగా కలుగు ననర్థాలు, నేటి ఇంగ్లీషు వైద్యుల నిష్కరుణ, సనాతనుల స్వార్థపరత్వం, ముసలి మగళ్ళు పడుచు పెండ్లాలతో అనుభవించు కష్టాలు మున్నగు విషయాలను లోకానికి వెల్లడించుటయే నాముఖ్యోద్దేశం" అన్నారు జాషువ. వ్యావహారికంలో ఉన్నవచన నాటకమిది.

తెరచాటు అనే పదాన్ని మరుగు అనే అర్థంలో ప్రయోగించారు. ఈ నాటకంలో బాల వితంతువైన కల్యాణి జీవితంలో తెరవెనుక జరిగిన దుర్భర దుస్సంఘటనల ఫలితాలను విశదీకరిస్తూ సంఘంలో అనాటి బాల వితంతువుల యొక్క జీవితాలలో చెలరేగిన బడబాగ్నిని, సంఘంలో దాగున్న కుటిల నీతిని బయటపెట్టి మూఢనమ్మకాలను నిరసిస్తూ సమాజాన్ని ఆలోచింపజేసిన రచనయిది. ఇందులో కవి చూపించిన సమస్యలు అనాటి స్త్రీజాతిని పట్టి పీడిస్తున్న సమాజంలోని సమస్యలకు ప్రతిబింబాలు.

## 1. బాల వితంతువుల హృదయావేదన - అనర్థాలు :-

బాల్య వివాహాల వలన స్త్రీ విద్యారంగానికి దూరమయి సమాజంలో అనేక కట్టుబాట్లకు గురయింది. శారీరకంగాను, మానసికంగాను ఎదగని వయసులో వివాహం చేసుకొని పిల్లల్ని కని రోగాల రొంపిలో కూరుకు పోయింది. భర్త చనిపోయినపుడు సహగమనం చేయడమో లేక ఇతరుల అవమానాలు సహిస్తూ జీవితాంతం వైధవ్యాన్ననుభవిస్తూ జీవచ్ఛవంలా కాలం గడపవలసి వచ్చేది. ముక్కుపచ్చలారని బాలికల దుస్థితిని చూచి జాలిపడిన జాషువ వేదన వర్ణనాతీతం.

తెరచాటు నాటకంలో బాల్యవివాహాలు, తత్ఫలితంగా వచ్చే అనర్థాలను గూర్చి చక్కగా వర్ణించాడు. స్వార్థపరుడైన కామశాస్త్రి తన 9సం॥ల కూతురుకు వివాహం చేయాలనే తలంపుతో అనేక ప్రయత్నాలు చేశాడు. బ్రహ్మశాస్త్రి కోడలు మరణావస్థలో ఉన్నదని తెలిసి వెళ్ళి సానుభూతి ప్రకటిస్తూనే ఆమె చనిపోతే తన కూతుర్ని ఆ ఇంటికి కోడలుగా చేయడానికి ప్రయత్నాలు మొదలెట్టి ఆమె కోలుకున్నదని తెలిసి నిరాశచెందాడు. తన ఆశాసౌధాలు కూలిపోయాక కూతురు వ్యక్తురాలౌతుందేమోనన్న భయంతో ముందు వెనుకలు ఆలోచించకుండా కాళ్ళు కడిగి కన్యాదానం చేశాడు. ఆ అల్లుడు కాళ్ళవాచి మరణావస్థలో పడ్డాడు. బిడ్డ వివాహం చేసి పుణ్యలోకాలు సంపాదించుకుంటున్నామనే తృప్తి తప్ప బిడ్డల సుఖాన్ని గురించి పట్టించుకోని తల్లిదండ్రులు వీరు.

బాల వితంతువుల దుర్గతికి వారి తల్లిదండ్రులే కారణం. కాటికి కాళ్ళు చాచుకుకూచున్న వృద్ధ ధనికులకు కూతుళ్ళ నిచ్చి వారి మరణానికై ఎదురు చూచి ఆమెను జీవచ్ఛవాన్ని చేసిన సమాజమది. వయసు పొంగులో ఆమె చేసిన తప్పులను కప్పిపుచ్చుతూ భ్రూణహత్యలు చేసి ఆమె ప్రాణానికి ముప్పు తెచ్చే పరిస్థితులు కల్పించిన తల్లి దండ్రులు క్షమార్హులు కారు.

ఈనాటికలోని కల్యాణిపాత్ర ఆనాటి సమాజంలోని బాల వితంతువులకు ప్రతినిధి. వారి కష్టనష్టాలకు, వాటివల్ల వచ్చే అనర్థాలకు ఈమె ప్రతీక. ఆమెతల్లి బుచ్చిరామమ్మ. తన మూడేళ్ళకూతురుకు పెళ్ళిచేసి అచ్చటముచ్చట తీర్చుకోవాలనే మూర్ఖురాలు. అజ్ఞానంతో డెబ్భైఏళ్ళ వయసున్న అన్నయ్యకు

తన కూతురును కట్టబెట్టి ఆమెకు ఐదోఏడు వచ్చేసరికి బాలవితంతువుల జాబి తాలో చేర్చింది. అందుకే ఇలాంటి తల్లులను తల్లికాదు జంగుబిల్లి అన్నారు జాషువ. బొట్టు, కాటుక పెట్టుకొని, దొడ్లోని పూలన్నీ తలలో పెట్టుకోవాలనే కూతురి కోరిక విని ఆమెకు పరిస్థితి ఎలా తెలియజేయాలో అర్థం కాక మాతృ హృదయం విలవిలలాడింది. పూలుపెట్టుకోవాలనే కోరికను అణచుకోలేని చిన్నారి, వదిన ప్రోత్సాహంతో అలంకరించుకొని మురుసుకొనేలోపే ఆమెను ఇలాంటి పరిస్థితుల్లో ఎవరైనా చూస్తారనే భయంతో తల్లి ఆ అలంకరణను లాగేస్తుంది. ఓ పసిహృదయం పగిలిపోవడానికి ఇంతకన్నా పెద్దకారణం యింకేం కావాలి ? ప్రపంచానికి నేనొక ముచ్చుబొమ్మను, వంటింటి యంత్రాన్ని అని ఆమె చేత పలికించాడు కవి.

"జిలుగు మాంధాళి జలతారు చీరలోనఁ
బొదిలి సేవింపఁదగు మల్లెపూల గుత్తిఁ
బీనుగుల మీద గప్పు పాపిష్టి కలుష
వస్త్రపు ముసుంగులో పట్టివైచినారు" (తె.తృ.పు. 35)

జలతారు చీరెలో పొదివి సేవించదగిన మల్లెపూల గుత్తిలాంటి కల్యాణిని పీనుగులమీదవేసే కలుషవస్త్రపు ముసుగులో చుట్టివేశారని కవి బాధపడ్డాడు. శవాలమీద తెల్లగుడ్డ వేస్తారు. జీవచ్ఛవంలా ఉన్న కల్యాణికి శవంమీద కప్పినట్లు తెల్లని వస్త్రం కట్టారని తన నిరసన వ్యక్తంచేశాడు.

పడుచు పిల్లలకు ముసలివాళ్ళను ముడిపెట్టిన ఫలితంగా ఆమె పసుపు కుంకుమలకు దూరమై తన పాపాలకు ప్రతిరూపమన్నట్లుగా అనాథయయి ప్రత్యక్షమయిందని కాలుజారిన బాలవితంతువుల నుద్దేశించిఆవేదనచెందారు. హృదయం లేని ఎనుబదేళ్ళ ముసలివాని కౌగిట్లో బంధింపబడి పసిపత్ని కడుపులో సాగుతున్న సంకుల సమరఘోష ఏ శృతులకు వినిపిస్తాయని ప్రశ్నించాడు.

ఈ నరమేధం కంటే నరబలి సుఖమయిందన్నారు కందుకూరి. నరబలి ఒక్కనిముషంలో జరిగిపోతుంది. కాని బాల్యవివాహాల వలన కలిగే దుష్ఫలి తాలకు బలైన బాలిక జీవితాంతం కష్టాలు అనుభవించాలి. అందుకే ఇది నరమేథంతో పోల్చబడింది.

బాల వితంతువు కల్యాణి తనకు పుట్టినబిడ్డను విధికి బలిచేసి ఒంటరిగా వదలివెళ్ళడం యిష్టం లేక బాధపడుతూ నాకడుపులో కత్తులు దూసుకొని పోతున్నాయి. ఫిరంగులు పేల్తున్నాయంటూ శోకించింది. ఈ రాక్షస సంఘం వేయినోళ్ళతో, వేయినాల్కలతో నాకు కడుపు చిచ్చుపెడుతున్నది. ఈ సంఘానికి నాశనం లేదన్నది. తన తెరచాటు కొడుకును కరకరమని చప్పరించే రాక్షస సంఘం ఉక్కు రథాన్ని వాయువేగంతో దొర్లిస్తున్నదనీ, పసిబిడ్డల ప్రాణాలు హరణాలు అయ్యాయనీ, వితంతువుల గుండెలు గుగ్గిలాలనీ కల్యాణిద్వారా కవి సమాజంమీద తన ఆక్రోశాన్ని వ్యక్తంచేశాడు.

ఆంగ్ల వైద్యుల నిష్కరుణ : 'వైద్యోనారాయణోహరిః' అనే నమ్మకాన్ని వమ్ముచేస్తూ ఆ వృత్తికి కళంకం తెస్తూ ఆనాటి సమాజంలోని ప్రజలపట్ల నిర్లక్ష్యాన్ని ప్రదర్శిస్తున్న ఆంగ్లవైద్యులను ఈ నాటకంలో విమర్శించాడు. రోగి ప్రాణాపాయస్థితిలో వున్న పట్టించుకోకుండా పేకాటకు దానిపై కాలాన్ని గడుపుతున్న డా. పిళ్ళే ఆంగ్ల వైద్యుడు.

ప్రమోదుని భార్య ప్రాణాపాయస్థితిలో వున్నదని అతను బతిమలాడుతున్నా, ఈ రోజు ఆదివారం గనుక రావడానికి వీలుపడదని కఠినంగా మాట్లాడాడు. ప్రజల అమాయకత్వాన్ని ఆసరాగా చేసుకొని ఎక్కువ డబ్బు గుంజి సరైన వైద్యం సకాలంలో చేయని ఆంగ్లవైద్యులను కవి విమర్శించి బ్రహ్మశాస్త్రి చేత నోటికి వచ్చినట్లు తిట్టించాడు. ప్రాణాపాయస్థితిలో ఉన్న రోగులను రక్షించవలసిన డాక్టరు ఆమెకు South African sleeping disease వచ్చిందని భయపెడుతూ వారికి అధైర్యం కలిగించడమే కాకుండ డబ్బు యివ్వని వాళ్ళ వద్ద నుండి డబ్బు గుంజడానికి కోర్టుకు వెళ్ళి దావా వేసుకొనైనాసరే సంపాదించ గలననేకుసంస్కారి ఆంగ్లవైద్యుడు డా. పిళ్లై. ఆనాటి ఆంగ్లవైద్యులు అజ్ఞానులైన ప్రజలమీద చూపిస్తున్న నిష్కరుణను కవి తెరచాటుతో విమర్శించాడు.

### 3. సనాతనుల స్వార్థపరత్వం :

పురుష ప్రధానమైన సమాజం కనుక శాస్త్రాలు, ధర్మాలు వారికి అనుకూలంగానే రచించబడ్డాయి. సనాతనులు ఈ ధర్మాలను తు. చ. తప్పకుండ పాటించాలనుకోవడం వలనే స్త్రీల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు హరించ

బడ్డాయి. సనాతనుల స్వార్థమూలంగానే బాల్యవివాహాలు, బాలవితంతువుల సంఖ్య పెరిగింది. దుర్భరమైన కట్టుబాట్ల మధ్య స్త్రీలు శారీరకంగాను,మానసికంగాను నలిగిపోయారు. సృష్టి ధర్మాలకు లోబడి బలహీనులై అక్రమ మార్గాలనుసరించి పతనమైపోయేవారు. తెరచాటులోని నాయిక కల్యాణి సనాతనుల స్వార్థపరత్వానికి బలైపోయింది.

బాలవితంతువైన కల్యాణి యుక్తవయసులో కోరికలను అణచుకోలేక కవియైన కిషోరిడితో స్నేహం చేయడం, ఆమెను హృదయరాణిగా చేసుకొన్న కిషోరుడు కష్టకాలంలో ఆమెకు అండగా ఉండకుండా ఆమెను సమాజపు కర్కశత్వానికి బలిచేయడం సనాతనుల స్వార్థఫలితమే. బాల వితంతువుల పట్ల సమాజపు దృష్టిని, యువకుల ప్రవర్తనను కవి చక్కగా చిత్రించాడు.

ఈ నాటికలో సంప్రదాయం మీద అచంచల విశ్వాసాన్ని ప్రదర్శించిన వారు రామచయన్లు, బుచ్చిరామమ్మ, కామశాస్త్రి. తరతరాలనుండి వస్తున్న ఆచారసంప్రదాయాలను అడ్డంపెట్టుకొని పసికందైన తన కూతురు కళ్యాణిని డెబ్బై సంవత్సరాల తన అన్నకిచ్చి ఆమె జీవితాన్ని బలితీసుకొంది. భార్య మరణించిన తన అన్నకే కూతురునివ్వాలనే స్వార్థంతో భర్తతో పోరుపెట్టింది. సంప్రదాయాన్ని, ఆచారాలను పాటించే విషయంలో రాజీపడకుండా కఠినత్వాన్ని ప్రదర్శించిన బుచ్చిరావమ్మ జీవితంలో సాధించిన దేమీలేదు. పడుచుభార్యతో సుఖపడలేకపోయిన కామశాస్త్రి మళ్ళీ తన కుమార్తెకు అలాంటి వివాహం చేసి శారదా చట్టం కింద గిట్టనివాళ్ళు అర్జీ పెట్టినందువల్ల కోర్టు పాలయ్యాడు. వయోవృద్ధుడైన భర్తతో తాను సుఖపడింది లేదు గనుక ఈ వివాహాన్ని ఆపడానికి రాజ్యలక్ష్మి ప్రయత్నించినా ఫలితం లేకపోయింది. సనాతనాచారాలను అడ్డంపెట్టుకొని స్త్రీలను బంధించి బాధిస్తున్న సమాజ స్వార్థపరత్వాన్ని కవి విమర్శించాడు.

ముసలి మగళ్ళు పడుచుపెండ్లాలతో పడేకష్టాలు :-

ముసలిభర్తలు పడుచు భార్యలతో పడే కష్టాలకు ప్రతీకగా తెరచాటు నాటకంలో రాజ్యలక్షి, కామశాస్త్రి దంపతులు చిత్రించబడ్డారు. రాజ్యలక్ష్మి కామశాస్త్రికి మూడవ భార్య. భార్యకూడ ప్రాణమున్న వ్యక్తేననీ, ఆమెకూ

కొన్ని యిష్టాయిష్టాలుంటాయనే భావన శాస్త్రికి లేదు. పక్షిని పంజరంలో బంధించినట్లుగా ఆమెను గదిలో పెట్టి తాళం వేసి తన అనుమానపు నైజాన్ని ప్రకటించుకొన్నాడు. అందుకు ఆమె కోపంతో నేను ఎలుగునను కున్నారా? పులుగుననుకున్నారా అని ప్రశ్నిస్తుంది. ఒక రోజు ప్రక్కింటి గిరి రాజ్య లక్ష్మిని చూసి గది బయట తాళం వేసున్నదెందు కంటూ కొంత ప్రశ్నలు వేస్తే వారి సొమ్ము వారు దాచుకున్నారనీ, మనసులోని కోర్కె పట్టుకొంటే నిలుస్తుంది విడిస్తే పరుగెడుతుందని తెలివిగా సమాధాన మిస్తుంది. స్వార్థ పరుడైన కామశాస్త్రి పడుచుభార్యమీద అనుమానంతో ఇలాంటి అమానుషా నికి పాల్పడబట్టే ఆమె ఆడవాళ్ళ నెత్తురు పిండుకుతాగే సంఘం మరొకటి లేదనుకుంటూ సంఘం మీద విరుచుకుపడింది.

ముసలివాడిని వివాహం చేసుకొన్నందున సామాజిక కట్టుబాట్ల మధ్య యిమడలేక, వాటిని బహిరంగంగా ఎదుర్కొనలేక అక్రమ మార్గాన పయ నించే స్త్రీల మనసుల్లోని సంఘర్షణ వర్ణనాతీతం. ఇది కుటుంబంలో అనేక కలతలకు కారణమవుతుంది. రాజ్యలక్ష్మి తనలోని అసంతృప్తిని దాచుకో లేక భర్త దగ్గర ప్రకటిస్తూనే ఉంది. పూర్వం పతివ్రతలంతా ముసలి భర్త లతో కాపురం చేయలేదా ! నీ నొసటనే ప్రొద్దుపొడిచిందనుకున్నావా ? చ్యవన మహర్షి వెయేళ్ళ తపసు చేసి 12 సం॥ల సుకన్యను వివాహం చేసు కొన్నాడు. పరమయిల్లాలైన ఆమె అభర్త అడుగులకు మడుగులొత్తుతూ శుశ్రూషచేసి ఆయన అనుగ్రహం సంపాదించుకున్నది. అలాంటి పతివ్రతల కథలు చదవమని భార్యకు హితోపదేశం చేశాడు కామశాస్త్రి. ఆకథలే ఆడ వాళ్ళ కొంపదీశాయని నిరసన వ్యక్తం చేసింది రాజ్యలక్ష్మి. నన్ను పూజిం చుకో రాదూ ! అంటే నిన్న మావపరచిన చేతులు పుచ్చిపోతాయంటుంది కసిగా. కావలసిన తిండి, బట్ట వీధిలో ఎవరికీలేనన్ని నగలు సమస్తమూ తన భార్యకు సమకూరుస్తున్నానని సంతోషపడతాడు శాస్త్రి. ఇవే ప్రధానం కాదంటూ నొక స్త్రీననే విషయాన్ని గుర్తుచేస్తూ నా వొళ్ళే నాకు బరువు. ఈ సొమ్ములు నాకు యింకా బరువుచేటు అంటుంది. అతను సమకూర్చే నగలు కాక అతని ఆదరణ, ఆప్యాయత కావాలనుకుంటుంది. అది లభించనందు వల్లనే ఆమెలో అసంతృప్తి బయలుదేరింది. అందుకే మా ఉసురుపోసుకోవడా

నికి కాకపోతే నీ ఈడుకు పెళ్ళేమిటి ? అని ప్రశ్నించింది. ఈ ప్రశ్నకు సమాధానం కామశాస్త్రి వద్ద లేదు. భార్యనుకొట్టైనా లొంగదీసుకోవాలనే కామశాస్త్రిని తాను బావిలో దూకుతానని బెదిరిస్తుంది రాజ్యలక్ష్మి. ఆమె నిష్ఠూరాలు భరించలేక పొద్దుపోయే వరకు కాలక్షేపం చేసి ఇంటికి వచ్చి ఈ వివాహం చేసుకొని లేనిపోని అవస్థ తెచ్చిపెట్టుకొన్నానని బాధపడ్డాడు.

వృద్ధవివాహం భార్యాభర్త లిద్దరిని నరకయాతనకు గురిచేస్తుంది. దీనికి ప్రధాన కారణాలు తల్లిదండ్రుల దురాశ, ధర్మసూత్రాలు, మూఢనమ్మకాలు, దురాచారాలు. ముసలిభర్త వయోభారంతోపాటు శారీరక బాధలనుభవిస్తూనే పడుచుభార్యకు కాపలా కాయవలసి వచ్చేది. సహధర్మచారిణి వలన స్వర్గలోకం కలుగుతుందని నమ్మిన తనకు ఆమె ఈ లోకంలోనే నరకం చూపిస్తున్నదని బాధపడ్డాడు కామశాస్త్రి. పెళ్ళిమీద పెళ్ళి చేసుకొని తనను తాను ఉద్ధరించుకొని సమాజాన్ని ఉద్ధరిస్తున్నానని అనుకున్నాడేగాని ఈ అసమ వివాహాల వలన స్త్రీలు ఎన్ని హింసలకు గురౌతున్నారో, పురుషులు ఎంత మానసికక్షోభ ననుభవిస్తున్నారో ఆలోచించలేకపోయింది ఆనాటి సమాజం. ఇలాంటి వృద్ధ వివాహాలవలన అనేక సమస్యలు ఉత్పన్న మవుతున్నాయి గనుక ఇవి అవాంఛనీయమని కవి అభిప్రాయం.

జోషువ తన కాలంనాటిసమాజంలో ఉన్న సమస్యలన్నిటిని 'తెర చాటు నాటకంలో ప్రతిబింబిస్తూ ఆ సమస్యల వలన ఉత్పన్నమయ్యే కష్టాలు, వాటినీ దాటలేక స్త్రీలు పడే ఆవేదన, బాల వితంతువు వితంతువుగానే మాతృత్వాన్ని పొందిన వైనం, తత్ఫలితంగా తెరచాటున జరిగే దుష్పంఘటనలన్నింటి తెరతీసి చూపించాడు.



# విశ్వనాథవారి కృష్ణకవిత

—ఆచార్య బొడ్డుపల్లి పురుషోత్తం

**కవులు-జయంతులు :**

(i)

ఆధునిక నాగరకతాచారాలు బహు విచిత్రాలు. బహుముఖాభిమాన పురస్కృతాలు కవులకు జరిగే శతజయంత్యుత్సవాలూ ఇటువంటి వైచిత్రిలోవే. ఇవీ లేకపోతే జాతి పూర్తిగా నిర్జీవమైనట్లే.

కవికి జయంత్యుత్సవాలు తక్కిన వాళ్ళకన్నా భిన్నంగా జరగాలి. ఎందుకంటే అతని వ్యక్తిత్వం అక్షరరూపమైంది. విశేషంగా అంతర్ముఖమైంది. 'సహృదయుడైన పాఠకుడు, బ్రహ్మానంద సబ్రహ్మచారియైన ఆనందానుభూతి కర్రులు సాచి, పునఃపునః కావ్యపఠనోత్కంఠితుడవుతున్నప్పుడల్లా, తత్కర్తయైన కవి పుడుతుంటాడు. అదే కవికి అసలు 'జయంతి'. ఏవం విధంగా కవులు సహృదయ హృదయ పీఠాలపై నవనవంగా జన్మిస్తూ జరామరణ వర్జితులౌతారు.

భగవాన్ భర్తృహరి అందుకే అంటాడు-

జయన్తితే సుకృతినో
రససిద్ధాః కవీశ్వరాః
నాస్తి తేషాం యశఃకామే
జరా మరణజం భయమ్.

'సాధ్యోహిరసో యథాతథమ్ కవిభిః అని చింతామణి, కవులు తమ తమ ప్రతిభా సామర్థ్యానుసారం రసం సాధిస్తారు. రంజకత్వం అధికంగా ఉన్న కవులు అధిక సంఖ్యలో గోచరిస్తారు. వీరే 'ప్రజా కవులు'గా ప్రసిద్ధులు, వీరిలోను తరతమ భేదాలుంటాయి. వీరిలో 'మరమరాలకవులు' 'బటానీల కవులు' అనీ చమత్కారంగా కొందరు విభజించి వెక్కిరిస్తారు. వీరిని ఎల్లకాలం జాతి స్మరించకపోవచ్చు.

ఇక రెండో శ్రేణి కవులు- విద్వత్కవులు. వీరిలో కేవల రంజకత్వం

కన్న మిన్నగా భావమథనం ఉంటుంది. ప్రతిభకన్న వ్యుత్పత్తి ప్రాధాన్యం వహిస్తుంది. అశేష ప్రజానీక ప్రశంస కన్న వీరికి ఏకాలానికైనా ఏకపండిత ప్రశంస మిన్న. "ఆపరితోషాత్ విదుషాం న సాధు మన్యే ప్రయోగవిజ్ఞాన" మన్న కాళిదాసోక్తి వీరికి అన్వయిస్తుంది. 'విద్వత్ సంస్తవనీయ భవ్య కవితా వేశం' వీరిది, 'కాలోహ్యనంతం, విపులాచ పృధ్వీ' అనే భవభూతి సాంత్వ నం వీరి నుజ్జీవితుల్ని చేస్తుంది.

ఎప్పటికప్పుడిలా కవులు విడిపోతుంటారు– సమన్వయం సాధించలేక. సమన్వయ ప్రయత్నం ఎప్పుడో మహనీయుడు ఆది కవి నన్నయ కావించి కృతకృత్యుడైనాడు. అందుకాయన ఎంతో తపస్సు చేసి వుంటాడు. తన సమన్వయాంశాలు నన్నయ్యగారే వివరించారు.

(1) అక్షర రమ్యత : ఇది పండిత పామర జనరంజక రచనా విధానం. నానారుచిరార్థ సూక్తులతో నిండింది. ఇది అంతస్సారంతో కూడిన బాహ్యాకర్షణ. పరిణతాను ప్రాసలతో నిండిన అక్లిష్ట మనోహర సుస్నిగ్ధ శబ్ద ప్రయోగ చతురత. ఇట్టిరీతిని పురస్కరించుకొని పండితరాజు జగన్నాథుడు "రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యమ్" అని కావ్యానికి తుది నిర్వచనం ప్రసాదించాడంటారు. రమణీయమైన అర్థాన్ని ప్రతిపాదించే రమణీయ శబ్దమే కావ్యం. అంతేగాని కేవల అర్థంగాని, కేవల శబ్దంగానీ రమ్యంగా వుంటే చాలదు. రమణీయమంటే "క్షణేక్షణే యన్నవతాముపైతి తదేవరూపం రమ ణీయతాయాః" అని మాఘుడు.

(ii)

ప్రసన్న కథా కవితార్థయుక్తి : సామాన్యులకు పైకి కథ కళ్ళకు కడుతున్నా, ధీమాన్యులకు లోలోపలికి వీక్షించే కొలదీ అక్షయార్థ సంపద సాక్షాత్కరింపచేసేది దీన్ని మొట్టమొదట వివరించిన విమర్శక శిరో మణి శ్రీ విశ్వనాథ. ఆయన విమర్శ మార్గంలో అధ్యయనం చేసి నన్నయ్య గారి కవిత నెందరెందరో ప్రసన్నం చేసుకొన్నారు. అయితే విశ్వనాథ రెండవ నన్నయ్యగారు కాగల్గారా? అంటే ఆయన కేవలం రెండవనన్నయ్య గారే కావాలని కాంక్షించలేదు. నన్నయ్య, తిక్కన, నాచన, తెనాలి రామ కృష్ణాది అనేకాంధ్ర మహా కవుల కవితామార్గాల్లో నిష్ణాతుడు కావాలని, తెలుగు కవితా కల్పవృక్షం కావాలనీ ఆశించినట్లు అర్థమౌతుంది. ఆయన

ఆంధ్ర కవితా విశ్వ విరాట్పురుషుడుగా మూర్తీభవించాలని మహా కవిత్వ దీక్షాకాంక్షాదక్షుడైనాడు. ఇంతటి మేరునగ శిఖరోన్నతా కాంక్షోద్దీపిత కవితా జీవి ప్రపంచంలోనే నభూతోనభవిష్యతి అనవచ్చు.

కాళిదాసుకి మల్లినాథుడులాగా విశ్వనాథ కృతికి వ్యాఖ్యాతరావాలి. ఏవో కొన్ని పద్యాలలో, ఘట్టాలో ఉపరితలంలో వివరిస్తే చాలదు. కావ్య సముద్రంలోని అగాథ తలాలకు పోయి భావమణుల్ని ఆవిష్కరించాలి.

(iii)

సంప్రదాయ సముద్ధరణ :— నానాటికీ ఆర్ష సంప్రదాయాన్ని రసోదంచితంగా సముద్ధరించటానికి అహరహం అహమహికతో అహంకరించిన స్రష్ట, ద్రష్ట శ్రీ విశ్వనాథ. సంప్రదాయమంటే కతిపయాచార విధులతోగూడిన గూడుగా పాడువడ్డ బావిగా భావించకూడదు. అది మహా సముద్రం. అనేక స్రవంతుల్ని తనలో అంతర్భుక్తం చేసుకోని, తన వ్యక్తిత్వాన్ని అభివృద్ధి చేసుకొనేది, ఇందుకు మంచి నిదర్శనం: వైదికేతరమతాలైన బౌద్ధ, జైనమత సిద్ధాంతాలనేకంవల్ల ఆర్ష ధర్మంలో వచ్చినమార్పులే ఈ సందర్భంలో బుద్ధభగవానుణ్ణి గూడా దశావతారాల్లో చేర్చి కీర్తించటం గమనించాలి.

సాంప్రదాయిక కవితా విధానాన్ని విశ్వనాథ నినదించాడు. ఇందులో వస్తువెంత ప్రాచీనమైనా కావచ్చు. కాని దాన్ని ఆవిష్కరించే తీరు రస నిర్భరంగా ఉండాలి. ఇది కవి అమోఘ ప్రతిభపైనే ఆధారపడి వుంటుంది. తరతరాలుగా వస్తున్న ప్రశస్త పథమిది.

రామరాజ భూషణు డీ బాటను ఎప్పుడో తేటపరచాడు.

"కేవల కల్పనా కథలు కృత్రిమ రత్నము
లాద్యసత్కథల్ వావిరివుట్టు రత్నము
లవారిత సత్కవి కల్పనా విశేషావహ పూర్వ
వృత్తములు సానలుదేరిన జాతిరత్నముల్"

ఈ బాట నుండి వైదొలగి పూర్వం పింగళి సూరన కవి 'కళాపూర్ణోదయ' మనే ఉత్పాద్యకావ్యం వివరించాడు. ఈ కావ్యరచనకు మూలం అనదగింది ఇంత వరకు లభ్యంకాలేదు పరిశోధకులకు ఈ కావ్యసృష్టి కూడా ప్రఖ్యాత

మని అనిపించడానికి సూరన, శ్రీకృష్ణుడు, నారదుడు, నలకూబరుడు, రంభ వంటి పురాణపాత్రలు కథలో ఇమిడ్చాడు. అయినా అప్పటి పాఠకుల కీ కావ్యం నచ్చలేదు. అందుకే ఊహించి తెలియరాకుండ సూరపరాజు అల కళాపూర్ణోదయము రచించె" అనే యీసడింపుకు గురి అయినాడు సూరన. అది మాపుకోటానికి "ప్రభావతీ ప్రద్యుమ్నమనే ప్రఖ్యాత ప్రబంధాన్ని విరచించి ప్రసిద్ధి వహించాడు పింగళి సూరన.

కట్టమంచి రామలింగారెడ్డివర్యుల వల్ల ఆధునిక నవలా యుగంలో కళాపూర్ణోదయానికి అఖండ ప్రశస్తి రావటం అందరూ గమనించారు. కట్టమంచివారి మనసు కెక్కటానికి ఎందరో పండితులు- దువ్వూరి వేంకట రమణశాస్త్రి, మల్లాది సూర్యనారాయణశాస్త్రి ప్రభృతులు తమ దృష్టి నా కళాపూర్ణోదయం మీదికి సాగించారు, విమర్శలు విరచించారు. అది పూరి పూర్ణాంధ్ర కవితా కళాపూర్ణోదయ మన్నారు.

జీవుని వేదన : విశ్వనాథ వారి 'జీవునివేదన' ఏ అలంకార శాస్త్రజ్ఞుడు ప్రతిపాదించంది, ఇది ఆధ్యాత్మికమైంది.

అనేక జన్మల సంస్కారాల్ని పురస్కరించుకొని ఒక్కొక్క జీవికి ఒక్కొక్క విలక్షణమైన వేదన వుంటుంది దాని ప్రేరణతో అనేక కార్యకలాపాలు నిర్వహిస్తాడు. కవిత్వం చెప్పటానికి కూడా కారణ మీ జీవుని వేదనే. తెలుగులో చెప్పాలంటే ఇదో రకమైన పిచ్చి, 'ఎవడి పిచ్చి వాడికానంద' మంటారు. రత్నాకరుడు వాల్మీకి కావటానికి, వాల్మీకి రామాయణం రచించటానికి ఆ జీవునిలోని వేదనే కారణం. వ్యాసుడు భారత రచన చేయటానికి హేతువు- ఆ జీవుడికి ధర్మాన్ని గూర్చిన పరిదేవన వ్యాసుని భాగవతరచనకు వ్యాస జీవవేదనే హేతువు. ఏ వేదనాలేని జీవుడు, నిర్జీవుడే.

వ్యక్తి విశిష్టమైన వేదనలాగా జాతి విశిష్టమైన వేదనకూడా ఉంటుంది. మహా కవి ఈ జాతి వేదనను తన వేదనగా ఆవిష్కరిస్తాడు. అల్పకవి తన వ్యక్తిగత వేదననే నివేదిస్తాడు. వాల్మీకి ఒక్కడే, స్వకీయవేదనను ఎక్కడా వినిపించడు. పాత్ర గత జీవుని వేదనే రామాయణమంతటా వినిపిస్తుంది. దుర్భర తపో విభవాధికు'లకే అంతటి పాత్ర తాదాత్మ్యం సాధ్యం. అంటే భగవత్సృష్టితో తన సారస్వత సృష్టిని సమైక్యపరచటంలోనే కవిజన్మ

సార్ధకం. అలా శ్రుతికల్పలేకపోవటం కవి వైఫల్యం. అందుకే విశ్వనాథ ఇలా ఆవేదిస్తాడు.

"నాకవితన్ విశాల జఘనా!
        యొక ఔచితిలేదు, భాషలే
దాకృతి లేదు: ఊరక
        రసాత్మతనే ద్రవియించిపోదు; నీ
వాకృతి అందమాచిన
        రసాత్మవు. నీకును నాకభిన్నతా
శ్రీకత గల్గెనా ! పులక
        రించెను పొమ్ము రస ప్రపంచముల్"

(iv)

రామకవితకు పూర్వమే విశ్వనాథ కృష్ణ కవిత రచించాడు. శ్రీకృష్ణుడు 'శృంగార రత్నాకరుడు' అందులోని అనర్ఘ రత్నాలనదగిన కావ్యాలు రెండు మూడు సృజించాడు. వ్యాస భాగవతంలో గాని, దాని కనుసృజన (transcreation) అనదగిన తెలుగుభాగవతంగాని ఆ కావ్యగత విషయాలు మృగ్యం.

రాధాకృష్ణుల విరహవేదన నంత్యంతాక్షర రమ్యంగా పోషించి విశ్వనాథ పఠితల్ని రసముగ్ధుల్ని కావిస్తాడు. గోపికలతో రాసక్రీడలు కావించే శ్రీకృష్ణుని తీసుకురమ్మని రాధ దూతికను పంపిస్తుంది. దూతిక ఒక్కతే తిరిగివచ్చి, రాసక్రీడా విశేషాలు పూసగ్రుచ్చినట్లు చెప్పి రాధను తీవ్ర విరోహోత్కంఠను గావిస్తుంది.

"మార ధనుర్ద్వయంబు వలె
        మండలబద్ధ సహస్ర షోడశా
భీరకులైక హాయన విభీత
        మృగీ సమలోచనా దృగం
భోరుహ చంచలా సహిత
        మోహన తోయదమూర్తి వంశగ
ర్జావ శీలికిన్ మనము
        జ్ఞాపకమా! యదువంశమౌళికిన్"

అని దూతిక రాధను నిరాశ నిస్పృహలకు లోనుచేస్తుంది. సహనం తెచ్చు కోని "గోపసతీ జనతా మనఃపరా స్కంధి కుమారగోకులుని గాథలుచెప్పవె, యెట్టులున్నవో" అని అర్థిస్తుంది రాధ. ఆ వివరాలు విని ఆనందిస్తుంది రాధ. 'దివ్యషోడశసహస్రో ఢాంగనా పారిహార్యాభోగంబున బాలకృష్ణ సుషిరం బామ్నాయముల్ మ్రోసెడున్" అని ఆవిశ్వగాన లహరిలో రాధను కవి ముచ్చెత్తుతాడు.

రాధకు 'కృష్ణ సాక్షాత్కరం' గల్గుతుంది. రాధను సంతృప్తిపరచి, మరల కృష్ణస్వామి వేణువూది గోపికల నాకర్షిస్తాడు రాసక్రీడకు. 'బ్రహ్మ గీతము'నే శీర్షిక ఆత్మాశ్రయ ధర్మంతో గూడింది. దానితో ఆ వ్రజేశ్వరుడు వ్రజసతుల్ని తీవ్రసంతప్తలు గావించినందు కీ రీతిగా నిలబెట్టి అడుగుతాడు విశ్వనాథ.

"వేణువు బ్రహ్మగీతము చెవింబడెనో
స్మృతి తప్పి గోపికా
శ్రేణులు నీపదంబ భిలషించిరి
గేహములున్ దనూజులున్
బ్రాణపతుల్ తదీయ
విరహాగ్నికి నేమయినారొ? యెంతపా
షాణుడవో పురానుగత
సంధులు వ్రయ్యలు సేయ మాధవా!"

కొండలనక, కోనలనక, అర్ధరాత్రి ఒళ్ళు మరచి వస్తున్న గోపకాంతలకు దారి చూపినందుకు కృష్ణునిపై కవి కోపిస్తాడు ఈరీతిగా.

"దానదాన జారు బాష్పములు
దోసిట బూని భవత్పదాభిషే
కనియతి వచ్చుచున్న
వ్రజకన్యలు బృందము త్రోవ తప్పిరో
యని మదినైన నెంచ
వవురా! తటి చిక్కని గున్నప్రాలు త్రా
విన చిఱుబొజ్జలోఁ గలక
వెట్టడురా! జగదేకసుందరా !"

జీవుల్ని యేరీతిగా పరమాత్మ బాధించి వాళ్ళతో వినోదిస్తాడో ఈ పద్యం హృద్యంగా అవిష్కరిస్తుంది.

(v)

సంస్కృత భాగవతంలో గానీ, పోతన భాగవతంలో గానీ, యశోదా దేవి బాలకృష్ణుణ్ణి ఏరీతిగా నిద్ర మేల్కొల్పింది నిరూపితంగా లేదు. ఆ లోటు తీర్చారు విశ్వనాథ- ప్రాతస్స్రవ మనే శీర్షికలో. ఇదో రసవత్తర కావ్యఖండిక.

ఇప్పుడీ ప్రక్రియ ప్రతి శనివారం ప్రాతః కాలంలో ఇంటింటి ఆకాశ వాణి ద్వారా మనోజ్ఞంగా శ్రీ వేంకటేశ్వర సుప్రభాతం అనే పేరిట విని పిస్తుంది. పూర్వం 'మేలుకొలుపులుగా దేశి సాహిత్యంలో ప్రసిద్ధి వహించిందే యిది' శ్రీ వేంకటేశ్వర సుప్రభాతానికి అనుకరణంగా ప్రసిద్ధ దేవాలయల్లోని దేవుళ్ళకు సుప్రభాతాలేర్పడుతున్నాయి. అయినా శ్రీ వేంకటేశ్వర సుప్రభాత రచనా స్థాయి నవి అందుకోవు.

ఈ రీతి సుప్రభాత రచనకు బీజావాపం వాల్మీకి మహర్షే కావించాడు.

"కౌసల్యా సుప్రజ ! రామ !
పూర్వాసంధ్యా ప్రవర్తతే
ఉత్తిష్ఠ నర శార్దూల !
కర్తవ్యం దైవమాహ్నికం.
ఉత్తిష్ఠోత్తిష్ఠ గోవింద !
ఉత్తిష్ఠ గరుడ ధ్వజ !!
ఉత్తిష్ఠ కమలాకాన్త !
త్రైలోక్యం మంగళం కురు."

ఈ విధంగా విశ్వామిత్రుడు తన స్వాధీనంలో ఉన్న శ్రీరాముణ్ణి నిద్ర మేల్కొల్పుతాడు. ఇందులో రాముడు మూడులోకాల్ని మంగళప్రదం కావించాలన్న విశ్వామిత్రుని జీవన వేదన ధ్వనిస్తుంది. ఇతః పూర్వం స్వయంగా బిడ్డల్ని కన్నా ఇటువంటి వాత్సల్య రసానుభూతిని విశ్వామిత్రు డనుభవించలేదు. ఇప్పుడు మంచి అవకాశం లభించింది. శ్రీమన్నారాయ

ణుడే ఆదర్శనరుడుగా అవతరించాడు. ఆయనకే కర్తవ్యాన్ని ఉపదేశిస్తున్న దేశికోత్తముడైనాడు ముని, ఇటువంటి భాగ్యం వశిష్ఠ గురువు కల్పినట్లు ఏ కవీ నిరూపించలేదు.

ఈ సందర్భంలో విశ్వనాథ వారి విశ్వామిత్రుడీ రీతిగా రాముణ్ణి మేలుకొలుపుతాడు. ప్రభాతమనే చిన్న వృత్తాన్ని విశ్వనాథ కల్పించాడు. రెండోది వచనం అయినా నిశితం.

"ప్రభాతము

తొలివెలుగయ్యె నిదోయి ! యోయి! యోకో
సల సుత సుప్రజ! సాధు రామచంద్రా!!
తొలి వెలుగయ్యెని దోయి! కౌసలేయా!
మెలకువ వచ్చెనె మీకు రామభద్రా!!

వ॥ లేచి దైవమైన యాహ్నికంబు దీర్పుండనిన, దల్లి
పిలుపుకన్న ప్రేమార్ద్రము, మృదువు నైన ముని మాటకు
మేల్కొని దాశరథులు నవ్వుచులేచి, స్నాతులు,
గృతోదకులు, నిర్వర్తితజపులు, కృతాహ్నికులు,
మునిపాదకృత నమస్కారులు, సంహృష్టులునునై
గమనాభిముఖులైన"

ఈ మేలుకొలుపు నిత్యం నిర్వర్తించేది. అనీ 'కోసల సుత' అనీ ఆ శబ్దం సూచిస్తున్నది. మొదట ఏకవచనం ప్రయోగం. సంస్కృత మర్యాద. కాని నారాయణుడితడనే ఎరుక గల వాడీ విశ్వామిత్రుడు. తెలుగు మర్యాద ప్రకారం బహువచనం 'మీకు' అనేది గౌరవార్థంలో ప్రయోగితం. సాధువు-రామచంద్రుడు. జాగృతుడై ముల్లోకాలకు మేలు కూర్చాలి. భద్రత చేకూర్చాలి- కాబట్టి రామభద్రుడు, భద్రుడైన తెలుగు భక్తునకు దర్శనమిచ్చాడు. తెలుగు జాతి కారాధ్యదైవమనీ ధ్వని.

ఇతడు పూర్వపు విశ్వామిత్రుడుకాడు. ఇప్పుడితడు తల్లిలాగా వాత్సల్య రసోల్లసితుడు. కౌసల్యకంఠధ్వనిలాగా వినిపించింది ముని కంఠం. అల్లరి కృష్ణుణ్ణి మేల్కొల్పినట్లుగా ఈ బుద్ధిమంతుణ్ణి మేల్కొల్ప నవసరంలేదు.

ఇంతకన్న ఎక్కువ రచన చేస్తే అది అధిక ప్రసంగమే అవుతుంది. అనౌచిత్యమే, నవ్వుతూ నిద్రలేవాలి. అది ఉత్సాహ సూచకం. సోదరులు క్రమశిక్షణ గలవారు— తండ్రిలాగా. అందుకే వారు దాశరథులు. అలసత్వం లేకుండా కర్తవ్యాన్ని చెకచెకా నిర్వర్తించారు. గమనాభిముఖులైనారు. ఇంకో పద్యానికిక్కడ అవకాశం ఇవ్వని విశ్వనాథ, ఔచిత్యానికి కాణాచి.

ఇంతకుముందే ఈ ప్రక్రియను ప్రకృష్టంగా నిర్వహించారు శ్రీ విశ్వనాథ. యశోద అల్లరి కన్నయ్యను ఎంతటి సహజోల్లాసంతో యశోద నిద్ర మేల్కొల్పుతుందో ఆలకించండి.

"లే! యింకన్ నిదురించుటేమిటిర !
      లేవే చిట్టినాతండ్రి! కృ
ష్ణా! యన్నాయి కళిందజాపులిన
      దేశక్రీడ నార్థమ్ము అ
ద్దేపేయేగేన్, మరి నీవు కూడ చనవా!
      వేగమ్ము లేవయ్య తం
డ్రీ! యాదిత్య నవాంశువుల్
      పసుపు పండించెన్ గవాక్షమ్మునన్"

సూర్యకిరణాలు కిటికీలోనుండి ప్రవేశించటం ఎంత రమ్యంగా చిత్రితమో! పిల్లల్లో పోటీ స్వభావాన్ని ప్రేరేపిస్తుంది యశోద. ఎన్నో స్వరభంగిమల్లో ఈ పద్యాన్ని హృద్యంగా పఠించుకోవచ్చు పాఠకుడు, తన్నుతాను యశోదగా భావించుకొంటూ.

బలరాముని ప్రక్క చక్కగా చెక్కుచెదరకుండా పుస్తకంలాగా ఉంది. కాని కన్నయ్యో ప్రక్కంతా క్రుమ్మిక్రుమ్మి, చివరకు దిండో చోట, తలో చోటగా నిద్రపోతాడు. నిద్రపడితేగదా!

కృష్ణయ్య చిరునగవు చిందించాడు. మేల్కొనటానికి సూచనగా తల్లికి ఉల్లాసం కలిగింది. నాబిడ్డ ఎంత మంచివాడో అని పొంగిపోతున్నది- యశోద.

"ఇదిగో! తండ్రికి చిట్టినవ్వదయ
మయ్యెన్ లే! యదూత్తంస! నీ
వొదగన్ బోవని సందు సందులకునై
యూరెల్ల దానేడ్చెడున్
గద, నీయల్లరిలేక, గజ్జియలు
ఘల్ ఘల్ గా గృహమ్మెల్ల ద్రో
కెదు నాట్యమ్ముల లేవవయ్య ప్రభువా!
కృష్ణా!! యశోదాత్మజా !!"

అదృష్టమంటే యశోదదే. తాను కనని కొడుకు తన కొడుకైనాడు. వట్టి సోమరి కొడుకుగాడు. ఎంతో అల్లరి కొడుకు. ఊరంతట్నీ ఒక కొలిక్కి తెచ్చే వాడు. తన నట్టింట్లో పసివాడు నడయాడి ఎరుగదుపాపం యశోద. ఇప్పుడో నాట్యగాడు లభించాడు.

ఇంతమాత్రానికే నిద్రలేస్తాడా ఈ పిల్లడు కళ్ళు తెరచినట్లే తెరచి పడుకొన్నాడు. యశోద చక్కిలిగింత పెట్టింది. కేలుచంకకుహత్తించి నవ్వాడు. ఆ నవ్వుల చిరు వెల్గులో పెదవి ఉషోనవరేఖ అయింది. తిరిగి అవ్వలిమొగంగా పండుకొన్నాడు.

తల్లి, ఆశగొల్పింది కొడుక్కు. మీగడ, వెన్న కల్పిన చెరకు రసం తండ్రి సిద్ధంచేసి ఎదురుచూస్తున్నాడు లెమ్మన్నది. అందుకేమి బాలుడు ఆశ పడలేదు. లేత కోతులు పండ్లికిలించుకొంటు తొంగి తొంగి చూస్తున్నాయి లెమ్మన్నది. ఊహూఁ. చంద్రవంక సవదరిస్తాను. జడకుప్పెలుపెట్టి జుత్తు దువ్వుతాను లెమ్మంది. ఆ తల్లి కెంత వేడుకో! పిల్లవాడైనా, పిత్తైనావాడేగా.

తల్లికి కొంచెం విసుగు పుట్టింది, నిద్రగాని నిద్రపోవాకు, లే. త్వరగా లేచి ఊళ్ళో కయ్యాలు తెద్దుగానివిలే అన్నది. అనేకొద్దీ బిర్రబిగిసాడు. బిడ్డకు కోపం వచ్చి ఉంటుందని బ్రతిమాలింది- జనని. 'ఓ అయ్యా! కోపము వద్దులే; అననులే. ఔపైడి ఖిల్లావులే, సయ్యాటంబుగ అంటిలే, యదుకుల స్వామీ! రమావల్లభా!!' అని.

పులిగోరు గుచ్చుకొంటుందని హెచ్చరించింది. 'అచ్చపు వేల్పు బువ్వ బుడగై, తరగై గరుడాళువారిపై వచ్చింది' లెమ్మన్నది.

ఇలా సాగిన ప్రాతస్తవంలో గొప్ప శబ్ద చిత్ర మిమిడింది పద్యం.

"చిమ్ముల దూడవంక నెగ
జిమ్మెడు కోరల కన్నుదోయితో
గుమ్మము వద్దనున్న దదిగో
కను, నీకయి గుమ్మపాలగో
వమ్మ, మ రీవు త్రాగకయ
ఆ తన దూడను గూడ ద్రావనీ
దమ్మ! మరింకలే! నురుసు
లారకమున్నుగ ద్రావగావలెన్"

గుమ్మం దగ్గర గున్నపాలగోవమ్మ కన్నయ్య కోసం కనిపెట్టుకొని ఉన్నది. తన బిడ్డకంటె ముందుగా జనముద్దుబిడ్డకు పాలియ్యాలని ఆమె తహతహ. తను కన్న బిడ్డ ఆకలితో పొదుగుదగ్గరకు వస్తుంటే, కోరచూపులతో తల్లి తరిమివేస్తుంది. ఎంత ఉదాత్తభావన!! ప్రకృతి అంతా వాత్సల్యరసోల్లసిత మైంది. ఈ పాపని పుట్టుకతో.

ఇంకా ఆలస్యం చేస్తే అన్నయ్యవచ్చి పాలు, వెన్న అంతా ఆరగించి పోతాడు లెమ్మని యశోద బెదిరించింది. ఇంట్లోవి ఆరగిస్తే యేం ? ఇంకా మంచిది. ఇల్లు ఇల్లు తిరిగి ఇరుగుపొరుగు ఇండ్లలోవి అరగించవచ్చు గదా!

అమాయికపు యశోద తనలో తానే అనుకొంటున్నదీ రీతిగా:

"మతకరి బుద్ధు లెంతకును
మానవు! నిన్నునుబట్టి యాప బ్ర
హ్మతరము కాదు; నాకడుపు
నందెటు పుట్టితివోయి? చాలు. నా
మెతక తనమ్ముగాక
పుడమిన్ నినువంటి కుమారులుందురే?

అతివ గయాళిమూక యిపుడే
పడిపోవును వచ్చి నాపయిన్!!"

ఇందులో ధ్వని సామ్యాలకు కూడా అర్థమౌతుంది.

"వెన్నలు దొంగిలింతు, నీ
చేతము సుంతయున్ గుణము చెందదురా
నవనీతలుబ్ధుడా!!"

'గుణాతీతుడైన భగవంతుడే అవతరించాడు గుణాత్మక జగత్తులో' అని ఎంత నెమ్మదిగా చెప్పాడో కవి.

అనేక విధాలస్తుతింపగా స్తుతింపగా

"యదుకులోద్యాన కేకి నాట్యమ్ము చేసె
నందగర్భసరోహంస నడలు నెఱపె
నెమ్మి నాట్యమాడెను యశోదమ్మకొడుకు
అంచనడకలు నడిచె క్రిష్ణమ్మగారు"

ఇంకా గోపికాగీత లున్నాయి. ఇవన్నీ భాగవతానికి ఉపబృంహితాలు. అవి యింకో శతజయంతికి చూద్దాం.

నేను యశోదవంటి అమాయికుణ్ణి. రవ్వంత నాకర్థమైన ఘట్టమిది. దీన్ని అనేక సభల్లో చదివి ఈ కవికి జయంతులు నాకు తెలియకుండానే నిరాడంబరంగా జరుపుకొన్నాను. ఇప్పుడూ జరుపు కొంటున్నాను- మీ సమక్షంలో.

"శ్రీదములై వికుంఠ నగరీ
ముఖకుడ్యగతాత్మ దర్శనా
పాదిత సర్వమౌని జన
వల్లభ మోక్షములై పురాసమా

స్వాదిత మత్సమర్పిత
లసత్పరిరంభర సాబ్ధులో భవ
త్పాద సరో మహానుభవ
భాగ్యము విస్మృతిరాదు మాధవా!!"

అంటుంది రాధ.

విశ్వనాథవారి కావ్యాలు రసాబ్ధులు, వానిలోని అణిముత్యాలు వెలార్చాలంటే లోలోతులకు మునిగి తేలాలి. అలాంటి శక్తి భగవానుడు మనకు ప్రసాదించాలి, ముందుగా నాకు, ఆ తరువాత మీ కందరకూ.

ఏ కొంచెమో రచించిన కవి ఎంతగానో తన్ను స్మరించాలనిఆశిస్తాడు. అటువంటప్పుడు వాసిలోను, రాశిలోను ఎంతో సృజించిన కవిసమ్రాట్టును మన మెంతగా స్మరించినా తక్కువే. ఆ ఋణం తీరేదికదా!

జయతు జయతు విశ్వనాథ ! కవిసమ్రాట్ !
ప్రథమాంధ్ర జ్ఞాన పీఠబహుమాన పురస్కృతా !!



# కవికోకిల జాషువా - కవితా భూమిక

—ఆ. పున్నారావు

కవిత్వమొక భావనామయ జగత్తు. భావాల, స్పందనల, ఊహల, ఆలోచనల అక్షరరూపమే కవిత్వమైనపుడు, ఆ అన్నింటి వెనుక కొన్ని యధార్థఘటనలు, వాస్తవప్రవర్తనలు ఆధారాలుగా ప్రేరణలుగా ఉండటం సహజం.

కవిత్వం గొప్పదీ శాశ్వతమైనదీ సార్వజనీనమైనదీ కావాలంటే దాని వెనుకనున్న భూమికలో గూడ ఆ లక్షణాలు ఉండాలి.

ఆధునికాంధ్ర మహాకవులలో అందరిలో ఈ కవితా భూమిక ప్రస్ఫుటంగా సమున్నతంగా భాసిస్తూనే ఉంటుంది. నిజానికి ఆయా భూమికల ద్వారానే ఆ కవితలకుగాని, కవులకుగాని గుర్తింపు వస్తుంది. సామ్యవాద సిద్ధాంతం, ఒకప్పుడు యావద్భూగోళాన్ని కుదిపివేయబోతున్నట్లు కన్పించినది. అది శ్రీశ్రీ కవితకు భూమిక భారతీయ ధర్మాలుగా, కాక, ఆర్ష సంప్రదాయాలుగా చెల్లే ఆచారవ్యవహారాలు నియమ నిష్ఠలు సాంఘిక వ్యత్యాసాలు– వాటిపట్ల అచంచల భక్తి విశ్వాసాలు విశ్వనాథ సత్యనారాయణ కవిత్వానికి ఆధారం. ప్రకృతి, దానిలోని భాగాలు, ఆకులు పూవులు- వాటికై ఆరాటం, తరువాత వాటి లబ్ధితో పులకింతలు, గిలిగింతలు- వంటివి కృష్ణశాస్త్రి కవితకు ఆలంబనం.

అలా చూచినపుడు మరొక ఆంధ్రమహా కవి జాషువా కవితకు ప్రేరణ, భారత సమాజంలోని అధోజగత్సహోదరుల ఆర్తి, ఆక్రందనం, పరదేవనం- అని చెప్పవచ్చు.

పైని తొలుత పేర్కొన్నవారిలో కవితావిర్భావానికి వారి మూలచేతనలే, జీవుని వేదనలే కారణాలయినా, వారి చదువులు సంస్కారాలు, కుటుంబాలు, జీవన సరణులు, ఉద్యోగ విధులు ఇతర వ్యవహారాలన్నీ దోహదపడ్డాయి. దాదాపుగా అవి అన్నీ ఒకే తరహాలో నిర్విరోధంగా అప్రయత్నసిద్ధంగా సమాజంలో, వారికి అమరి అలరించాయి. అయితే జాషువా కథ అటువంటిదిగాదు. అతని పుట్టుక, పెరుగుదల, బ్రతుకు సమాజానికి దూరంగా

తిరస్కారపాత్రంగా జరిగాయి. ఇక చదువూ సంస్కారం, వృత్తీ ఉద్యోగం, పరిసరాలు పరిచయాలు అన్నింటా జాషువా ప్రాతికూల్యాన్నే ఎదుర్కొన్నారు. ఒక ఎత్తుకు, స్థాయికి ఎదిగేంతవరకు, అంటే, సులభంగా నిర్లక్ష్యంగా తీసిపారవేయడానికి వీలులేని వ్యక్తిత్వాన్ని కవిత ద్వారా కల్పించుకునే అంతవరకు అతని జీవితం నిరంతర సంఘర్షమయంగానే సాగి ఉంది. అన్నింటా అభ్యంతరాలే! అందరూ (ఒక్క కన్నతల్లి తప్ప) అందరూ అననుకూలురే. ప్రేమ, స్నేహం, గౌరవం, మర్యాద, మన్ననలు సమాజం నుండి పొందడం కోసం జాషువా తన జీవితకాలాన అసాధారణంగా ఎంతో కాలం వేచి ఉండవలసి వచ్చింది.

జన్మవశాననో, కాక పరిసర స్థితిగతుల పరిశీలనం వలననో అతనిలో యథావిధి స్థితిపట్ల ఒక అసహనం అసమ్మతి అసంతోషం కలిగాయి. అవి అతనిలో ఆవేదనను రేకెత్తించాయి. వేదనను రగుల్కొల్పాయి. కాగా ఆవేదనా వేదనలే అతని కవితకు భూమికగా మారాయి. అసాధారణ మానవ మూర్తులయెడ అది సహజ పరిణామమే మరి! అయితే అతనిలో జన్మసిద్ధమైన సంస్కారం ఓరిమిగుణంగా మారి, ఒకేసారి విస్ఫులింగాలను వెళ్ళగక్కనీయలేదు. ఎంత చీదరించుకున్నా అసహ్యించుకున్నా నిందించుకున్నా ద్వేషించుకున్నా నాటి సమాజంలోని వాస్తవాలు హఠాత్తుగా మంత్రదండంతో వలె మారబోవడం లేదు- అన్న యథార్థతాస్ఫూర్తి కవికి ఉంది. అందువలననే ఆయన తన స్థితినీ గతినీ, వాటి కారణాలనూ, వివరిస్తూ, సమాజం తనపైజూపె అకారణవైరదారుణాన్ని ప్రశ్నిస్తూ, ఒకనాటి తన యీ పతిత సమాజపు ఔన్నత్యాన్ని ఉగ్గడిస్తూ

"బహుదేశ మత మహా పరిషత్తు తువనాచ
పలికి వచ్చినది మా భరత సుతుడు
కండెబెట్టున నైదు ఖండాల నోడించి
కొలుపు అందినది మా కోమటన్న
సీమలో అచార్య సింహపీఠిక మీద
నిలిచి వచ్చినది మా తెలుగువాడు
విశ్వసన్మానంబు వెలయు నోబెలు కీర్తి
రంగమెక్కినది మా వంగసుకవి

చెట్టుచేమల సుఖదుఃఖ జీవితములు
నిజము తెల్పినవాడు మానేలవాడు
నన్ను వాలగోలి కెక్కించినారు గాని,
మొదట నందర మన్నదమ్ములము మేము"

అని తన సోదరత్వాన్ని పునఃప్రతిష్ఠించుకునే సత్ప్రయత్నం చేశాడు. దీని వలన అతని కవితకు నిబ్బరంతోపాటుగా ఉపాదేయత్వమూ సిద్ధించినది.

జాషువా రచనలన్నింటా అతని కవితా భూమిక అయిన ఆర్తి అగుపించినా, 'గబ్బిలము'లో అది అడుగడునా అవిష్కృతమై ఉంది.

తాను చిక్కినకాసుచే తనివిజెందు నమాయకుడననీ, నాల్గుదిక్కులున్న లోకాన దిక్కుమాలినవాడననీ, గర్భదరిద్రుడననీ 'అంటూనే' 'భరతోర్వరకు కడగొట్టు బిడ్డడ' నంటాడు కవి. ఎంత దారుణహింసకు గురిజేసినా, ఆ హింసకుని పాదము కందకుండా చెప్పులుకుట్టి, తన రెక్కల కష్టంతో అతని సస్యరమను పులకింపజేస్తూ, తాను మాత్రం భుక్తికి లేక గూడ 'నీతి మంతుడ'నై ఉన్నానంటూ,"అప్పువడ్డది సుమీ భరతావని(నాదు)సెవకున్" అని ఆక్రందిస్తూ చేసిన కవితా ప్రారంభం చివరకు "నిఖిలలోక మెట్లు నిర్ణయించిననాకు తిరుగులేదు: విశ్వనరుడ నేను" అంటూ ముగింపు నందడం అభినందనీయమైన ఆనందప్రదమైన విషయం.

కవిగా జాషువాలోని ఆర్తిని జాగృతం చేసి, అతనిచేత వేలవేల పద్యాలలో తెలుగు వాణిని అనితర సాధ్యంగా ధీరగంభీరంగా అర్చింపజేసిన భారతసమాజంలోని దౌష్ట్యపరంపరను అతని మాటలలోనే పరిశీలిద్దాం.

(i) "వాని తలమీద పులిమిన పంకిలమును
గడిగి కరుణింప లేదయ్యె గగన గంగ
వాని నైవేద్యమున నంటు వడిననాడు
ఏనాడు మూర్తులకును గూడ గూడులేదు"

ఇది అస్పృశ్యత. అసహజము. ఆపాదితము. అందుకనే తలమీద పులిమిన పంకిల మంటున్నాడు జాషువా. అతని రచనలో సందర్భం వచ్చినపుడు ఈ అస్పృశ్యతా జాడ్య తీవ్రతను ఉగ్గడించక మానడు కవి. స్వరాజ్యసిద్ధి తరువాతనైనా, ఈ దేశాన, ఈ జాడ్యం అంతరిస్తుందా ? అని సందేహించాడు.

"ఎంతోదూరము పోవనేమిటికి నేడింటింటికిం బ్రాకి యా
శాంత వ్యాప్తముగా రహించెడు స్వరాజ్య స్వర్ణ సూత్రంబు చౌ
దంతి స్తంభన మాచరించెగద! ఏ తద్దివ్య సూత్రంబు మో
కంతై నిక్కిన కట్టివేయగలదా ! యస్పృశ్యతా వ్యాఘ్రమున్"

అంటరానితనమనేది బెబ్బులి. చాల క్రూరమైనది. దాన్ని నిలువరించేశక్తి స్వరాజ్యమనే మోకులో ఉందా? అంటున్నాడు కవి.

హైందవ ధర్మమని పేర్కొనబడే దానిలో బాగోగులు మంచిచెడ్డలు అన్నిటికీ మూలం కర్మసిద్ధాంతం. దాని ఔచిత్యాన్ని ప్రశ్నిస్తాడు కవి.

ii) "కర్మ సిద్ధాంతమున నోరు కట్టివేసి
స్వార్థలోలురు నాభుక్తి ననుభవింత్రు
కర్మమననేమొ దానికీ కక్ష యేమొ !
ఈశ్వరునిచేత ఋజువు చేయింపవమ్మ"

కర్మసిద్ధాంతం వల్లిస్తూ పరాన్నభుక్కులుగా బ్రతికేవారిని కవి ఈస డిస్తున్నాడు.

ఎంతసేపూ తనపై జరిగే క్రౌర్యాల పరంపరల వర్ణనలే కవితా ఫలితాలా? అని అడగబోయే వారికి సమాధానంగా

"నాదు కన్నీటి కథ సమన్వయము సేయ
నార్ద్రహృదయంబు గూడ కొంతవసరంబు" అంటాడు కవి.

ఆ మాట వాస్తవం! ఆర్ద్రత సహృదయతకు మారుపేరు.

జాషువా పేరులో క్రైస్తవ మతమున్నా, అతని వ్రాత మొత్తం హైందవగ్రంథ సముదాయం చుట్టూ తిరుగుతుంటుంది.

"వ్యాసమునీ! భారతమును వ్రాసిన కవిగాథ !" అని సంబోధిస్తూ, భారతంలో అన్యాయాలుగా అక్రమాలుగా కనిపించే సంఘటలను ఎన్నింటినో ఎత్తిచూపిన జాషువాకు నిజానికి ఏమతమన్నా గౌరవాదరాలు ఉన్నట్లు కన్పడదు. మత స్వభావం అతని మాటల్లో

iii) "సమతలు సఖ్యమున్ బెదవిజారిన మాటలు కట్టుబాట్లు చ
ట్టములు బటుత్వమూడిన గుటారపు దూముడి బంధనాలు ధ
ర్మములు దయారసాల్ మొసలి రాలుచు న[శుకణాలుచి[త చి
[త్రములు మత స్వభావము లరామరగా వివరింప గల్గితిన్"

సరిగా వివరింపలేదంటూనే అన్ని మతాలలో ఉండే సామాన్య దుర్గుణరాశిని బహిర్గతం చేశాడు.

మతాలుగాని,సం[ప్రదాయాలుగాని ఆచారవ్యవహారాలుగాని-అన్నింటా బాగోగులు తప్పొప్పులు [గహించే శక్తి భరతజాతికి కలగాలని జాషువా ఆకాంక్ష. ఆ ఆకాంక్షను కవి వెలువరించే తీరు ఇది.

iv) "ఏనాడు మాకావ్య సృష్టికర్తల జిహ్వ
విశ్వసత్యము నాలకింపగలదో
ఏనాడు మాజాతి దృష్టి మాంద్యము వాసి
చుట్టు[ప్రక్కల దేరి జూడగలదో
ఏనాడు మాబుద్ధి లీజుట్టు తలలేని
పుక్కిటి కథలలో జిక్కుసడవొ
ఏనాడు మావిద్య లినుప సంఘమునందు
చిలుముపట్టిన [ప్రకాశింపగలవొ

"తనువు దాచక సోమరితనము మాని
ఎన్నడీ మతంబులు బిచ్చమెత్తికొనవొ
అట్టి శుభవేళకై కొంగుబట్టి నిలచి
నలిగి వాపోవుచున్నది నా మనస్సు"

ఆధునిక యుగస్వభావాన్ని గుర్తించి, మిగిలిన [ప్రపంచదేశాల అభ్యుదయ గమనాన్ని [గహించి వైజ్ఞానిక దృక్పథాన్ని అవలంబించి, అలసత్వాన్ని విసర్జించి, జాతిని బాగుపడమని వ్యథిత మనస్కుడైన కవి అర్థిస్తున్నాడు.

యాగస్వభావాన్ని గుర్తించి, తాను [గహించిన సత్యాన్ని ఇలా చాటుతున్నాడు జాషువా.

"గుఱ్ఱాలకు రెక్కలుగల, వెఱ్ఱియుగాల్ దాటిపోయె విజ్ఞానంబున్
బుఱ్ఱగల గాంధియుగమది! కఱ్ఱలు ఖడ్గాలు నేలగాలేవు [ప్రజన్"

అప్రాచ్య ప్రభావాల సోకు అంతగాలేని జాషువాపై గాంధీగారి ప్రభావం ప్రస్ఫుటంగా ప్రగాఢంగా ఉంది. దాని ఫలితమే గాంధి హత్యానంతర రచన 'బాపూజీ' 'బాపూజీ'లో ఆకవి దర్శించిన గాంధీ రూపాలు అనేకం. వాటిలో ఒకటి.

"అలిగి కూర్చుండు చిన్నబిడ్డల విధాన
నుపవసింతవు భువన ముత్తూతలూగ
విశ్వముల కెల్ల గారాల బిడ్డవకట!
చంపుకొన్నది భారతక్ష్మాతలమ్ము."

'విశ్వంభరానేతల చెమ్మగిల్ల జేసిన' ఆ దుర్దిన దుర్ఘటనకు జాషువా స్పందించిన తీరు ప్రశంసార్హం.

బహిరంతద్విషాణాలలో మునిగి అంతరాత్మ బాధనే కవితలుగా వెల యించిన జాషువా స్వభావతః హాస్యప్రియుడై ఉండాలి. గబ్బిలం కాళ్ళపైకి మొగం క్రిందికి పెట్టి వెళ్ళాడుతుండే స్థితిని, ఈ దేశంలోని దయాహీనులను మానవతాదూరులను నిందించడానికి ఎలా వినియోగించి పరిహసిస్తున్నాడో చూడండి.

"నరుని కష్టపెట్టి నారాయణుని గొల్చు
ధర్మశీలురున్న ధరణి మీద
కాలుమోపలేక గబ్బిల మొక్కటే
చరణయుగళి దివికి సాచినదచు"

ఈ అంటరానితనం అమానుషమని నిందించే జాషువా, ఈ దుర్లక్షణం అస్పృశ్యులుగా వ్యవహృతులయ్యే తనవారిలో గూడ వెళ్ళాని ఉండడం సిగ్గుచేటని వాపోవడం అతని నిర్మలత్వానికి నిదర్శనం.

"కలదమ్మా వ్రణమంటరాని తన మాకర్ణింపుమీ ఇండియా
పాలమందుంగల మాలమాదిగలకున్ భూతేశుడేగాదు కృ
ష్ణులు కృష్ణున్నిరసించు దైవములు కీస్తున్ మస్తుగా బుట్టినన్
కీలుపన్నేరరు రెండు జాతులను వక్కాణింప సిగ్గయ్యెడిన్"

అయినా భరతమాత ముద్దుబిడ్డగా జాషువా, యావద్భారత జాతి క్షేమాన్ని శుభాన్ని కాంక్షించాడు. ముఖ్యంగా మూఢాచారాల ద్వారా జాతి శక్తి సామ

ర్థాలు ఎలా వ్యర్థమైపోయ్యాయో, ఇంకా ఎలా వ్యర్థమైపోతున్నాయో తలచు కొని దుఃఖించాడా కవి.

v) మొక్కుబళ్ళనెపాన చక్కని పసిపాప లెందరు గంగలో గలిసిరొక్కొ!
సహగమనాచార దహనదేవత లెన్ని చిగురు గొమ్మల బూదిసేసెనొక్కొ!
చదువుదాచెడు దురాచార మెందరి కళా భ్యసన చాతురి గుంతుబిసికెనొక్కొ!
పొందెరుంగని పోరుబందాలచే బాహు బలమెంతగా చచ్చు వడియెనొక్కొ!
చిలిపిరాలకు నగిషీలు చెక్కిచెక్కి, కాలమెంత అనంతాన గలిసిరొక్కొ!
చదువనేర్చిన వెట్టిని జంపగలరె, ఒక్కబుద్ధుడు నొక క్రీస్తు ఒక్కగాంధి!

భరతజాతిలో జాషువా కవిని బాధించిన మరొక అవలక్షణం బహు దేవతారాధన. దానిని అంటుకుని ఉన్న విగ్రహపూజ.

vi) "ప్రతిమల పెండ్లి సేయుటకు వందలు వేలు వ్యయించుగాని దుః
ఖితమతులైన పేదల పకీరుల శూన్యములైన పాత్రలన్
మెతుకు విదల్ప దీభరత మేదిని: ముప్పది మూడుకోట్ల దే
వత లెగబడ్డ దేశమున భాగ్య విహీనుల క్షుత్తులారునే!"

అధిక్షేపించే సమయాన గూడ జాషువాలో హాస్యప్రియత్వం గోచ రిస్తుంది. దేవాలయాల్లో చీకట్లలో గబ్బిలాలు వేలాడుతుంటాయి. అదృశ్యాన్ని అడ్డంపెట్టుకొని కవి చేసే ఈ వ్యాఖ్యానం రమ్యం.

"అలయంబున నీవు వ్రేలాడు వేళ
శివుని చెవి నీకు కొంత చేరువగ నుండు
మేనిఖగరాజ్ఞి! పూజారిలేని వేళ
విన్నవింపుము నాదు జీవిత చరిత్ర"

"ఆపూజారులు విన్న నీకగును ప్రాయశ్చిత్తమీ మానుషున్
గోపించున్, వివరింపనేటికి నీకుం బొమ్ము వార్ధక్యమున్
దాపై పెంజెడ దెల్లనైనది నిశీధిస్త్రీకి నాఖేటక
వ్యాపారంబు ముగించి నీ పొరుగు గూబల్ గూండ్లకుం బోయెడున్"

పూజారుల మాటలకు తిరుగులేదు: దేవతలుగూడ వారిపక్షమే మరి!

"జీవకళలు చెక్కు శిల్పిని నిరసించి
శిల్పమునకు పూజసేయునట్టి
ప్రకృతిచరితులయిన వ్యక్తులు గల చోట
కళల కకట ! ప్రేతకళల గీతులు"

అంటూ శిల్పికి అపకర్షను గల్గిస్తూ శిల్పాన్ని అర్చించడంలోని అనౌచితిని ప్రస్తావిస్తాడు కవి!

ఇంతకూ జాషువా కాంక్షించే దర్శించే ఆదర్శ సమాజమేది?

vii) "భోగులాదరించు భుక్తికి కన్నుల జూచి
పరమపేదలు దుఃఖపడని చోటు
సాంఘికాచార పంచాస్య గర్జనమున
బెదరిక జ్ఞానంబు పెరుగుచోటు
జాతి వైషమ్య రాక్షస హతి
కందక కళలు పెంపొందుచోటు
పరిపాలక క్రూరతర కరాసికి లొంగి
పోకస్వేచ్ఛాలక్ష్మి పొదలుచోటు

అనదబిడ్డలు జాడ నెయ్యంపు నుతుల
ముద్దులాడని గుణనిధుల్ బుట్టుచోటు
చెప్పగదవమ్మ చూచివచ్చితివె నీవు
నిశ్చయంబుగ వాసముండెదను నేను"

కవి దర్శించే సమాజంలో కపటాలు కార్పణ్యాలు, నాగరకత పేరున మృషా బాంధవ్యాలు ఉండవు.

"పయిపైగౌరవంలు పల్కరింపులు మృషాబాంధవ్యముల్ సూపి ఆ
పయి శతృత్వము సేయు నాగరకతా భ్రష్ట స్వభావాధముల్
సయితాను చరియింపనట్టి ధర గోష్పాదంబు గన్పట్టినన్
దయతో నాకెరిగింపుమమ్మ యచటన్ నాయిల్లు గట్టించెదన్"

జాషువాకున్న తత్త్వదృష్టి ఎట్టిది ? ఆలోచనాశీలి, అనుభవశాలీ అయిన కవి ఈ సృష్టిని గురించి, జీవాన్ని గురించి, మరణాన్ని గురించి

కొన్ని నిశ్చితాభిప్రాయాలు ఏర్పచుకొని ఉంటాడు. వాటి ఆధారంగానే అతని ఆలోచనాధార కొనసాగే వీలుంటుంది.

viii) ఆశ్చర్యకర యంత్రాలు నిర్మించిన వైజ్ఞానిక శేఖరులు చచ్చారు, చావు పుట్టుకల జాడలు గ్రహించలేదు మరి! ఆ జాడలు గ్రహించిన వారు అనుకునే దేవతలూ చచ్చారు, ఆ చావును జయించే శక్తిని మానవధీశక్తికి అందకుండా దాచే ఆ చుప్పనాతివేల్పు ఎక్కడ దాగి ఉన్నాడని ప్రశ్నిస్తూ కవి

ఈ విషయంలో తన ఆలోచనా ధోరణిని ఇలా ప్రకటిస్తున్నాడు.

"మును మే నూడ్చిన వారియెమ్ము లెరువై భూదేవి పండించి నిం
చిన నానాఫల పుష్పరాజముల కిచ్చెన్ దివ్య మాధుర్యమున్
తను రక్తంబును మేఘమై కురిసి యానందంబు గల్పించు చ
చ్చునదేదీ ప్రతిజీవియుం దిరిగి వచ్చుం భిన్న రూపంబునన్
మరణితులయినవారి తనుమాంసము కొన్ని యుగాలు భూమిపై
ముఁరిగి రసాయనప్లుతుల పూర్ణ పరీక్షల నిగ్గుదేలి ఆ
ఖరుకు శిఘాత్కరాదులకు గాయముగా విలసిల్లకున్న ఈ
సురిచిర దివ్యకాంతులు నిసుంగుల మేన రహింప నేటికిన్"

మానవశరీరం మరణానంతరం భూమిలో నీరులో గాలిలో కలిసి పోతుంది. భూమి ఫలవంతమై ఫలిస్తుంది; నీరు మేఘమై వర్షిస్తుంది; నిజానికి చావు యధార్థంగా లేదు. ఉన్నది రూపాంతరీకరణమే. ఒకటి మరొకటిగా మారడమే సృష్టి స్వభావం!

నిజమో అబద్ధమో, ఖచ్చితంగా నిస్పందేహంగా ఇదీ తత్త్వం అని విశ్వసించేవానికి మతపరమైన దైవపరమైన భయాలూ ఆందోళనలూ, ఉండవు. చెప్పేమాట, చేసే 'ఆలోచన' విస్పష్టంగా ఊగిసలాటకుదూరంగా ఉంటాయి. అందుకనే జాషువా మాటకు ఆచేవ. ఊహకు, ఆ నిర్మలత్వం.

స్వభాన్ని బట్టి జాషువా కవిత్వం ఆర్తిజన్యంగా భాసిస్తుంది. అందుకనే తాజమహల్ అతనికి ఘనీభవించిన మొగలాయి రాజు తెలిగన్నుల బాష్ప ధారలుగా కనిపించింది. తొలుత ఆ ఆర్తి తనకు, తనతోటి వారికి చెందినదే

అయినా, రానురాను అది అఖిలభారతీయమై అనంతరం విశ్వమాననీయంగా పరిణతిని అందుకొని అజరామరమై ఆంధ్ర సాహితీలోకాన నిలిచిపోయింది.

అయితే కొసమెరపుగా ఒక చిన్న విషయం ఇక్కడ స్పృశించాలి. జాషువా తొలినాళ్ల లో చేసే రచనలో భాషాపరంగా అంటే ఆనాటి వ్యాకరణ శాస్త్ర దృష్టితో చూచినపుడు చిన్నచిన్న దొసగులు కొన్ని కనిపించేవి. పండితులైనవారు కొందరు వాటిని వెలెత్తిచూపి ఆయనను వెక్కిరించడానికి యత్నించి ఉంటారు. కాని, మహాప్రతిభావంతుడుగాబట్టి ఆ వెక్కిరింతలు అతనిని సమీపించలేదు. అయితే ఉచితజ్ఞుడైన జాషువా మాత్రం 'ఉభయ భాషాప్రవీణుడై' ఆ చిరుదొసగుల మరకలను తుడిచివేసికొన్నారు అయినా అతనికి ఈ వ్యాకరణ శాస్త్రమన్నా, తదధ్యేతలన్నా చాలా చిరాకు; చికాకు గూడ. అందుకనే

"వ్యాకరణశాస్త్రకాదరులు  
క్ష్మాకు కకారంబు విరతి గన్పడదని చీ  
కాకు పరతురంతె; కాని  
పాకము రసమింపు సొంపు పరికించెదరె"

అని వైయాకరణుల స్వభావాన్ని ఆక్షేపించారు. వారిది ఆర్ద్రిత దూరమైన కేవల శబ్దమయమైన రసహీనమైన సరణి, ధోరణి అంటూ మందలించారు. నిజమే! అయితే ఇక్కడ ఆ మహాకవి గమనించని భేదమొకటి ఉంది.

'క్ష్మా'కు కకారంతో యతి చెల్లుతుందనో, చెల్లదనో వాదిస్తూ చీకాకు పరచేవారు నిజానికి ఛందశ్శాస్త్రజ్ఞులుగాని వ్యాకరణశాస్త్రజ్ఞులుగారు. అయితే తెలుగులో మాత్రం వ్యాకరణాల్లో అక్కడక్కడా ఛందః ప్రసక్తి, ఛంద శ్శాస్త్రాల్లో అక్కడక్కడా వ్యాకరణ చర్చ కనిపిస్తాయి. బహుశః ఆ ధీసంస్కారవశాననే కవి పేర్కొని ఉండవచ్చు.



# జాషువా కవితలో మానవతావాదం

—శ్రీ రావెల సాంబశివరావు

మామూలుగా కట్టుకునే మడులకు దడులకు దూరంగా ఆచార్య వర్గం సరసన బోధనేతర వర్గానికి చెందిన నావంటివాణ్ణి నిలబెట్టిన సంస్కారానికి ముందుగా నమస్కరిస్తున్నా.

ఇలా ఎందుకు అంటున్నానంటే జాషువా కవిత్వం విని "సెహభాష్" చెప్పిన వాళ్ళే కులప్రసక్తి తెచ్చి అప్పటికిలా చప్పరించేవారట. ఆయన గుండెలో వాళ్ళు బాకు దింపినట్లు బాధపడేవారు. అయినా వాణి ఆయన రాణి అయ్యింది. ఆయన్ని వరించిన శారద ఆయనతోనే వుంది కడదాకా.

సరే అసలు విషయానికి వస్తా-జాషువా కవితలో మానవతావాదాన్ని స్పృశిస్తా-నేను మాటలు జాగ్రత్తగానే వాడుతున్నా. పరిశీలిస్తాననో, అనుశీలిస్తాననో, అవలోకనం చేస్తాననో అనటంలేదు. కేవలం "స్పృశిస్తా" అంటున్నా.

—భువనహితముగోరు కవితా వాణికి రవ్వలురాల్చి గరగరల్ పచరించిన దిట్ట జాషువ.

—మానవాళి అభ్యుదయానికి కంకణం కట్టుతున్న కవివరేణ్యు డాయన.

—మూఢాచారాల్ని సమూలంగా నిర్మూలించేందుకు నడుంబిగించిన నవయుగ వైతాళికుడు

—ఎంతో గుండె దిటవుతో "విశ్వనరుడనేను" అని చాటుకొని మానవతా సందేశాన్ని వాడవాడలా అందించినవాడు జాషువ.

—నరుని కష్టపెట్టి నారాయణుని గొల్చు ధర్మశీలురను బాగా దుయ్యబట్టిన వాడాయన.

"మలమలమాడుపొట్ట, తెగమాసినబట్ట కలంతపెట్టగా
విలవిల యేడ్చుచున్న నిరుపేదకు జాలిని జూపకుండ ను
త్తల పడిపోయి జీవరహితమ్మగు బొమ్మకు నిండ్లు వాకిళుల్
పొలమును బొ్ట్రటనిచ్చెడు ప్రబుద్ధ వదాన్యుల నిచ్చ మెచ్చెదన్"

అని కవిరాజు నవ్వుతూ నాలుగు వడ్డిస్తూంటే- ముప్పదిమూడుకోట్ల దేవత లెగవడ్డ దేశమున భాగ్య విహీనుల క్షుత్తులారునే?
అంటూ గొంతు కలిపాడు ఈ కవి చక్రవర్తి.

"ఒక్క జాతియందుద్భవమందికూడ
జన్మదోషంబు దృష్టిదోషంబటంచు
బతితమై పోవుచుండె బ్ర భ్రష్టమగుచు
దెలుఁగు జాతి పున స్సృష్టివలదె చెపుమ?

అంటూ కవి రాజు వేసిన ప్రశ్నకు సమాధానంగా జాతి పునస్సృష్టికి పాటు పడిన వాడు జాషువ.

కరుణ, మైత్రి, ముదిత, ఉపేక్ష అనేవి నాలుగూ మానవత్వ లక్షణాలు అనే విషయం మీకు విదితమే. అందులో మొదటిదీ, ముఖ్యమైనదీ అయిన కరుణ ఆయన కవితల్లో మనకు కనిపించే ప్రధాన లక్షణం.

"పసులను, జెట్టుచేమలను, బక్షితతిన్, గ్రిమికీటకాదులన్,
బుసుకున దాకినంత దలపోయవు స్నానము మాట; కాని, మా
నిసి నిను దాకినంత దల నిండుగ స్నానము ధర్మ మార్గమే?"

అంటూ కవిరాజు పథనిర్దేశం చేస్తే ఆ మార్గంలో నడుస్తూ కవి చక్రవర్తి "అనాథను" సృజియించాడు. అందులో

"తరుకోటరంబున వసించెడు పక్షుల నొక్కపక్షిగా" బ్రతుకును యీడ్చుకొచ్చే ఒక మాలెత స్పృహ తప్పి నడివీధిలో పడిపోతే ఒక సంసారి జాలిపడి ఆమెను వైద్యాలయానికి చేర్చి తన యింటికి తిరిగివచ్చేలోపల ఆయన భార్యకు ఆ సంసారి మైలబడిన తీరును చిలవలు పలవలుగా చేర్చి చెబుతారు అమ్మలక్కలు ఇంకేముంది ...ఆ ఇల్లాలు శివమెత్తినట్లు చిందులు వేసి భర్తతో తలంటు స్నానం చేయిస్తుంది. అంతా అయిన తరువాత ఆ సంసారి ఏమంటాడో తెలుసా-

"మాలదాని పిల్లల కడగండ్లు చూచి బహుళంబుగ దప్తమునొందు
నా మనో జలజము మైలవడ్డ దది స్నానము చెసెనె? వెఱ్ఱివాన!" అంటాడు.

సగుణుడో, నిర్గుణుడో; సాకారుడో, నిరాకారుడో ఎవరయితేనేంలే-ఎలా ఉద్భవిస్తాడో జాషువా మాటల్లో విందామా ?–

పరుల దుర్గతిగని గుండె గఱిగి వగచు
సదయ హృదయుల వీక్షణాంచలమునందు
బుట్టుచుండును కన్నీటి బొట్టువోలె!
ఏడి భగవంతుడని సంశయింతు వేల?

కనుక మానవత్వం లేని చోట భగవంతునికి కూడ మనుగడ లేదన్న మాటే!

క్రొత్తదనమన్నా, క్రొత్తమార్పులన్నా నిక్కనీయని, గడపద్రొక్క నీయని వారిని అనుసరించలేదు జాషువ.

అకలంకమైన మానవతావాదం, సత్యాన్వేషణాసక్తి, సాంఘిక కల్యాణ పిపాస ఆయన కవిత్వంలో అంతటా చోటు చేసుకున్నాయి.

భావాలలో ఆయన విప్లవ పథగామి– భాష విషయంలో ఎందుకో మరి మరమ్మత్తుల దగ్గరే ఆగిపోయాడు. పైగా వచన కవిత్వాన్ని గేలి చేయటం కూడ జరిగింది– నేటికైత అనే ఖండికయు-

"మొత్తముమీద నాంధ్రకవి ముఖ్యులు పెట్టిన కట్టుబాట్లలో
నుత్తమ మధ్య మాధమము లున్నవి వానిని కొద్దిగా మరా
మత్తొనరింప నౌననెడు మాటకునేనును సమ్మతింతు, నీ
చిత్తల తోకబీకుడు కవిత్వపు ఫక్కి ననాదరించెదన్"

ఇదంతా చూస్తుంటే, ఈ నవయుగ కవి చక్రవర్తి, ఆ కవిసమ్రాట్టు ఒక బడిలోనే చదువుకున్నట్లు కన్పిస్తున్నది! మర్చేపోయా- ఇద్దరికీ గురువు చెళ్ళపిళ్ళవారేకదూ!

అయినా పరితల్ని చెదరగొట్టే కవిత్వాన్ని నిరసించాడు జాషువా.

కావ్య సృష్టిలో రసదృష్టికి ప్రాముఖ్యాన్నిచ్చారు.

'అడుదిలేకయున్న గృతికందములేదని నమ్ము:కాలమిదికాదు పొ'మ్మని కరుణా పరిణద్ధ రసప్రబంధాల్ని ఆంధ్రజాతికి అందించారు.

బాపూజీ, బుద్ధుడు, క్రీస్తు నడచిన వజ్రమార్గంలో తానొక అజ్ఞాత ప్రవాసిగా మరణం లేని మానవతా వీణియను వ్యథాభరిత హృదయంతో మీటి కొంగ్రొత్త రాగాల నెన్నింటినో సృజించారు.

సామాజికరంగంలో అస్పృశ్యత, అనాదరణ, అసమానత, అమానుషత్వాలపై తమ "గబ్బిలము" ద్వారా తీవ్రమైన తిరుగుబాటు చేసిన విషయం మీకు విదితమే.

పాముకు పాలు, చీమకు పంచదార మేపుకొనే ఈ కర్మభూమిలో నాల్గుపడగల హైందవ నాగరాజు కడగొట్టువానిపై కసరి బుసకొట్టటం మహాపరాధంగా భావించి సాహితీ కురారానికి పదునుపెట్టి ఎదురైన ప్రతివాణ్ణీ ఐదవ కులస్తుడెవ్వడని నిలదీసాడు-

పుట్టుబానిసలుగా చూడబడిన కడజాతివారి దీనస్థితికి కుమిలిపోవటం ఒక ఎత్తు- కడజాతివారిలో ఒకరికొకరికి పడక ఒకరిపై మరొకరు కత్తులు దూసుకోవటం చూచి కన్నీరు కార్చటం మరో ఎత్తు.

ఒకే దేవునికి రెండు దేవళములు నిర్మించుకొని కులసమస్యతో కుమ్ములాడుమ్ము గావించుకొనే తన దౌర్భాగ్యపు జాతిలో ఒక్కడికీ చీమకుట్టిన బాధయినా లేనప్పుడు తన కెందుకీ చాదస్తమని మథనపడ్డాడు. అయినా మిన్నకున్నాడా ? అదను చూచుకొని చెప్పవలసింది చెప్తూనే వచ్చాడు.

మహిళాభ్యుదయాన్ని అమితంగా ఆకాంక్షించించాడు జాషువా.

పిల్లలకొరకు పుట్టలచుట్టు, గట్టులచుట్టు ప్రదక్షిణలు చేయు వెర్రిబాగులమ్మలనూ-

"అబలయన్న బిరుద మంటించి కాంతల
స్వీయశక్తి లదిమి చిదిమినారు
సబలయన్న బిరుదు సాధించి హక్కులు
గడనచేసికొమ్మ కష్ట చరిత"

పసుపు వ్రాసినా, ముసుగువేసినా మారుమాటాడని మందభాగ్యలను వెన్నుచరచి ఉద్బోధించటం జరిగింది.

వేడుక కోసమని ఈడు రాకముందే పిల్లలకు పెండ్లి తలపెట్టు తల్లిని జంగుబిల్లిగా చిత్రించాడు.

స్త్రీ కేవలము సంతాన యంత్రము కారాదని, విద్యా విభూషితపై ప్రకాశించాలనీ, అబల సబల కావాలనీ నొక్కివక్కాణించిన తీరుచూడండి.

అసమానతల్ని చెండాడి, విజ్ఞానాన్ని నాటే విద్యావిధానం పూర్ణ రూపంలో ఆనాడు లేదన్నాడు. ఇంకా నేటికీ స్థితి అలాగే వుంది. ఎందరు ఎంత కృషి చేసినా గొంగడి వేసిన చోటనే వున్నది:

అటు వున్నవాడూ, ఇటులేనివాడూ కూడ ఉన్నవాడి మానవేతరమగు మెహెర్బానీ కొరకు ప్రాకులాడే వాతావరణంలో విశ్వసౌఖ్యస్థాపన ఒక ఎండ మావి పొమ్మన్నాడు.

ప్రజలకామితాలు పాటింపలేని స్వరాజ్యమేల ? రామరాజ్యమేల ? అని సవాలు చేసాడు.

స్వాతంత్ర్యానంతరం మన దేశంలో "దొరలు దాటిపోవ దొంగలు మిగిలిరా" అని చురక వేసాడు.

అశాంతికాలవాలమైన లోకాన్ని చూచి జాషువా గుండె కరిగిన తీరును చూద్దామా-

"కత్తులు దాచిపెట్టుకొని కైతవపుంగవుగిళ్ళొసంగు గ
మ్మత్తు ప్రదర్శనల్ సలుపు మానవనాథుల నాటకాలచే
చిత్తము నొచ్చి సత్యసరసీరుహాసన శాంతి హంస యెం
తెత్తున గూడు గట్టుకొని యే గగనంబున దాగి యున్నదో!"

అటువంటి శాంతి హంసను వెతికి తెచ్చి మనమధ్యవుంచి బెదరకుండా చూడాలని విశ్వప్రయత్నం చేసాడు.

విశ్వకల్యాణానికి అడ్డుపడే పూజారులను ఒక కంట కనిపెడుతూ-

"మరణమునకు దక్క మరి తీరుబడిలేక
కలముదించనట్టి కవివరుని"

గా మానవకల్యాణాన్ని ఆకాంక్షించారు,

మంచితనానికి మసిపూయకుండా, చవటల్ని యింద్రులుగా చంద్రులుగా ఈ కవులు చెయ్యకుండా చూడాలన్నారు.

తనకు ఓటమిలేదనీ, తన ప్రయత్నం వూరికే పోదనీ, తన మాటలు ప్రజల మనస్సులను కదిలించి తీరుతాయనీ నమ్మి కులమతాలులేని బలమైన సమాజంగా మానవులను మార్చేందుకు కృషి చేసాడు.

తాను శాశ్వతంగా కాపురముండేందుకు గబ్బిలంతో తగిన చోటును వెతికిస్తాడు-

భోగులాహరించు భుక్తి కన్నుల జూచి
పరమపేదలు దుఃఖపడని చోటు,
సాంఘికాచార పంచాస్య గర్జనమున
బెదరక జ్ఞానంబు పెరుగుచోటు
జాతి వైషమ్య రాక్షస పదాహతి చేసి
కందక కళలు పెంపొందు చోటు
పరిపాలక క్రూరతరకరాసికి లొంగి
పోక స్వేచ్ఛాలక్ష్మి పొదలుచోటు

"అనద బిడ్డలు జూడ నెయ్యంపు సుతుల
ముద్దులాడని గుణనిధుల్ బుట్టుచోటు
చెప్పగదవమ్మ చూచివచ్చితివె నీవు
నిశ్చయముగ నివాసముండెదను నేను."

మానవత నెరిగిన గుండెలలో గూడుకట్టుకొని కాపురముంటున్న జాషువాను ఇలా పరామర్శించే అవకాశం కల్పించినవారికీ, ఓపికను ప్రదర్శించిన మీకూ నమస్కారాలు చెల్లిస్తూ- సెలవు.

# "నవయుగ సంఘసంస్కర్త జాషువా"

శ్రీ కె. సత్యనారాయణ

సంస్కృతోపన్యాసకులు, నాగార్జునవిశ్వవిద్యాలయము.

'నవయుగ కవిచక్రవర్తిగా తన రచనలద్వారా మానవత్వానికి మకుటం పెట్టిన మహామనీషి జాషువా. "నానృషిః కురుతేకావ్యమ్" అన్న ఆర్యోక్తిని నిజం చేస్తూ తన రచనల భూతభవిష్యత్ వర్తమానాలకు సాహితీ సౌరభాన్ని అందిస్తూ సమతావాదాన్ని దశదిశలకు వ్యాపింపచేస్తూ, విప్లవ శంఖాన్ని పూరిస్తూ, విజయదుందుభి మ్రోగించిన మహాసంఘసంస్కర్త జాషువా. తన రచనల్లో అనవరతం ఆలోచనా సౌధాలను నిర్మిస్తూ, మూఢాచారపిశాచాలను తరిమి తరిమి కొట్టటానికి హేతువాదమనే హేతిని తనచేత ధరించి అహర్నిశలు శ్రమిస్తూ సంఘంలో సామాన్యుడు కూడా మాన్యుడు కావాలని, కులమతాల గోడలన్నీ కూలిపోవాలని యత్నించిన గొప్ప ఋషి. ద్రష్ట, స్రష్ట, జాషువా. 'జాషువా' అనగా క్రైస్తవ మత ప్రకారము 'యెహోవారక్షణ' (Lordis salvation) అని అర్థం.

సెప్టెంబర్ 28వ తేదీ 1895 సంవత్సరం పుడమి తల్లికి పుణ్యదినం! జాషువాకు జన్మనివ్వటం!. గుర్రం వీరయ్య, లింగమాంబల, పుణ్యాలపంట జాషువా!. 'వినుకొండ' వెండికొండగామారి ఈ సాహితీ నిటలాక్షునికి జన్మస్థలమైంది! అందుకే జాషువా తన భక్తిప్రపత్తులను 'నాకథ' అనే కావ్యంలోని

"ననుగాంచిపెంచి నాలో
గానముం గవనంబు బాదుకొల్పిన తల్లీ
ననుమరచిన నిను మరువను
వినుకొండా ! నీకు నాపవిత్రపణతుల్"-

అనే ఈ పద్యం 'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ' అనే ఆర్యోక్తిని దృఢీకరిస్తూ మాతృభూమిపై జాషువాకుగల అపారప్రేమను వ్యక్తపరుస్తోంది.

కాలకడలిలో ఎన్నో కష్టనష్టాలకోర్చి విద్యాభ్యాసం చేసి తెలుగువాడిగా తెలుగువాడి విశ్వనాడిని తెల్సుకోవటానికి ప్రయత్నించి సఫలీకృతు

డైన మహామూర్తి! ఆలోచనాస్ఫూర్తి జాషువా!! "ఉదరార్థంబు ధరించినాడ మును పెన్నో వేసముల్"- అనే పద్యం ఉదరపోషణకై అతడు తిరిగిన ప్రదేశాలను, పడినపాట్లను, మన కండ్లకుకట్టినట్లు తెలుపుతుంది.

'సుకవి జీవించు ప్రజల నాల్కలందు' అన్నట్లు జాషువా అటువంటి సుకవి. తన పేదరికం, కులమతభేదం జాషువాకు సహనాన్నీ, సంఘాన్నీ ఎదిరించే శక్తినీయగా జీవితం నేర్పిన అనుభవపాఠాలను ఎన్నో కావ్యాలుగా మలిచిన మహాశిల్పి 'జాషువా'- అతడు కులం, మతం అనే సంకుచిత్వం నుండి బయటపడి తిరుగులేని విశ్వనరుడిగా ఎదిగి 'క్రొత్తలోకం' మొదలగు కావ్యాలద్వారా వినూత్న దృక్పథంతో 'విశ్వకవిసమ్రాట్' అయినారు. అనుభవాల రాపిడితో విశ్వవిపంచి యొక్క తంత్రులను సవరిస్తూ, కావ్యకథా వస్తువుల ద్వారా మానవాళిమధ్య మృగ్యమైన మానవతావాదాన్ని నాదంగా, వేదంగా మ్రోగించిన మహావైణికుడు జాషువా!!

సాహితీ జగత్తులో 65కు పైగా కావ్యఖండికలు నిర్మించి, దేశభాషలందు తెలుగు లెస్సన్న 'ఆంధ్రభోజుడు' 'కృష్ణదేవరాయల' కీర్తిని స్తుతిస్తూ 'గుంటూరుసీమ'లో 'భరతమాత'కు పుట్టిన ఆంధ్రుడై కవితా'శిల్పి'గా కళా హృదయంతో 'గిజిగాడు' 'సాలీడు'ల నైపుణ్యాన్ని మెచ్చుకొని, తన 'శిశువు'ను 'యుగంధరమంత్రి' వంటి ప్రజ్ఞాపాటవాలు కల్గి 'రారాజు' అయిన భారతవీరునిగా చేసి, మమతల 'కోకిల' గళమాధుర్యాన్ని, 'బుద్ధమహిమ' లోని అహింసావాద్యాన్ని. 'క్రీస్తు'లోని విశ్వమానవతా హృదయాన్ని 'స్మశాన వాటిక'లోని వైరాగ్యాన్ని, 'కృష్ణానది,లోని పవిత్రగుణాలను ప్రబోధించిన 'తెలుగుతల్లి' 'మాతృప్రేమ'ను పొగడి, అమరప్రేమకు చిహ్నమైన 'తాజమహాలు' నిర్మాణానికి 'చంద్రోదయం'లో చలువరాళ్ళను పేర్చి, 'వేమన'గా వేదాంతాన్ని బోధించి 'సంసారం సాగరం'లో 'బాష్పసందేశం' పంపి, కుల మత భేదాల 'అయోమయం'లో పడిన జనులకు 'వివేకానంద'గా విజ్ఞానాన్ని బోధించి, సాటిమనిషిని మనిషిగా ఆదరించనివారు 'జీవన్మృతులు' అనే ఆలోచనా 'తుఫాను' రేపి వారిని పశ్చాత్తాపం పొందునట్లు చేసి, సమాజంలో 'చంద్రునిలోమచ్చ'లా ఉన్న కులమేఘాలు కూల్చడానికి 'శల్యసారథ్యం' వహించి 'రెండంచులకత్తి'గా సంఘదురాచారాలను ఖండిస్తూ-'సమదృష్టి'కై

హెచ్చరికలు చేస్తూ, 'మేల్కొల్పు' ద్వారా యావజ్జాతిని మేల్కొల్పుతూ 'కొత్తలోకం'లో మానవాళి మధ్య అనురాగాల 'సూర్యోదయం' కోసం 'వీరపూజ'లు సల్పిన 'శబ్దశాసనుడు', నవయుగ వైతాళికుడు జాషువా!!

25కు పైగా తనచే రచింపపడిన కమనీయకావ్యాల అమనిలో జాతి నేత 'బాపూజీ' స్వప్నాలను 'స్వప్నకథ'లో తెల్పి, సమాజంలో 'తెఱ చాటు'న జరిగే అన్యాయాలను సైతం 'అనాధ' అయిన 'గబ్బిలం'తో నివేదించి, జీవనగమనంలో కులమత అడ్డంకులతో అలసిసొలసిన 'ముసాఫరుల'కు 'క్రీస్తుచరిత్ర' విన్పించి, ధైర్యవచనాలు చెప్పి విశ్వమానవ కళ్యాణానికై 'నేతాజీ'లోని ధైర్యసాహసాలను కలిగి, చేదుబాధల చిగురుటాకులు మేసి వాస్తవాల కవితల నాలపిస్తూ 'కొత్తలోకం' కోసం గొంతెత్తి కూసిన కవికోకిల, మా నవకోకిల, మానవతాకోకిల జాషువా !!

సాంఘికాభివృద్ధి జరగాలంటే మానవతావాదం మమతానురాగాలతో మనుష్యులమధ్య పెరగాలని, సాంఘికదురాచారాలు దూరమవ్వాలని, కళలకు కులమత కళంకం అంటరానిదని, మహిళాభ్యుదయం మరింత జరగాలన్నదే సంఘసంస్కర్తగా ఆయనఆశయం!! అదే ఆయన రచనల్లోని సారాంశం !!

**సాంఘికాభివృద్ధి మానవతావాదం :**

మానవుడు సంఘజీవి. సాంఘికాభివృద్ధి జరుగుటకు మానవత్వపు విలువల (Human values) పరిరక్షణ అవసరమని ఆయన నొక్కివక్కాణించారు. మానవుడే ప్రమాణాలను సృష్టించి, మార్చుకొని, అనుసరిస్తూ అతడే విలువలు నిర్ణయిస్తాడని, అక్కడ వివేచనాత్మకతకు ప్రాముఖ్య ముండాలని, మానవ సంక్షేమమే వాటి ధ్యేయం కావాలని, మానవతావాదాన్ని, మానవిలువలకు సన్నిహిత సంబంధం ఉందని ఆయన చెప్పారు. అట్టి మానవతావాదం సాంఘికాభివృద్ధికి సహకరిస్తుందంటారు. అందుకే ఆయన "మరణం లేని మానవత్వాన్ని కామించు కవితావీణపై నేను మ్రోయించిన వ్యథాతంత్రులే ఖండకావ్యాలు" అని అంటారు. ఏ ఒక్కరూ ఎవరికీ బానిసకాదని, కాకూడదని స్వేచ్ఛా వాయువులు ప్రతిఒక్కరూ పీల్చాలని కుల, మతాల కుమ్ములాటకు భరతవాక్యం పలకాలని, భారతవనం నందనవనం కావాలని ఆశించి ఆశలతోరణం చేసిన ఆజీవి. ఆశతోరణం

చేసిన అమరజీవి జాషువా!. మానవతావాదంలో నైతికవిలువలకు ఎంతో ప్రాముఖ్యం ఉన్నదని, సత్యాన్వేషణ స్వేచ్ఛాజీవనం, మానవాభ్యుదయానికి ప్రధానహేతువులని, వివేచన యనెడి శాస్త్రీయ పద్ధతిద్వారానే పలురంగాల్లో పౌరులకు స్వేచ్ఛ లభించగలదని, అప్పుడే సాంఘికాభివృద్ధి జరుగునని తన రచనల ద్వారా ప్రబోధించారు. మానవతావాదం సమసమాజ నిర్మాణానికి, సర్వమానవ సౌభ్రాతృత్వానికి పునాదులు వేస్తుందనేది ఆయన ప్రగాఢ విశ్వాసం. ఆధునిక యుగంలో భౌతిక పురోభివృద్ధిని సాధించిన మానవుడు ఊపిరిపోసే హృదయ వైఫల్యాన్ని పోగొట్టుకున్నాడని "ముసాఫరులు" అనే కావ్యంలో "అగియన్ రోదసిలో సునాయాసంబుగా జొచ్చి"....నేపథ్యంలో ఎంతో వ్యథచెందినారు. మానవాళి మధ్య మానవత్వపు విలువలు వృద్ధి నొందాలని 'ఖండకావ్యం'లో—

"రాక్షసంబైన స్వార్థజ్వాల చల్లారి విశ్వకర్మము కండబెట్టుచోటు,
వంచనాకవచంబు వ్రక్కలుగావించి, అలఘుసత్యజ్యోతి వెలుగుచోట,
పసిపాపమోముపై కుసుమించునవ్వులో వెలుగు సౌజన్యంబు మెలగుచోట
గురితప్పనట్టి దాశరథిబాణము పోలి దృఢదీక్ష జయము సాధించుచోట,
ఎదిరి కష్టము లెల్ల స్వీయములుగా
కోరినరుడు పంచుకొనెడు చోటు
చింతలేనిచోటు, సిరులుపండెడిచోటు,
వెదకికొందు, గుండె కుదుటపడగ!" అని తన నిర్ణయాన్ని ప్రకటిస్తారు.

"సర్వేజనాః సుఖినో భవంతు" 'పరోపకారాయ పుణ్యాయ పాపాయ పరపీడనమ్' "మా కశ్చిత్ దుఃఖ మాప్నుయాత్" అని విన్పించే ప్రబోధాత్మక సూక్తుల సారమే ఈ మానవతావాదం. దాన్ని జాషువా- 'ముసాఫరులు' అనే కావ్యంలో ఇట్లా చెప్పాడు.

"కోటానుకోట్ల నరులోక
మేటి జగన్మాతృసుతులు, మిత్రులని, మదిం
బాటింపు మీ సువార్తన్
చాటింపుము జీవితంబు సార్థక్యమగున్"-

అంటూ మానవజాతికి సందేశాన్నిచ్చారు. ఆయన పలికిన ప్రతివాక్కు జాతీయభావాలతో నిండి, సమైక్యతా సందేశాన్నిస్తూ మానవతావాద ప్రబోధన గావిస్తుంది.

సమాజంలోని అవాంఛనీయ పరిస్థితులను చూసి కలతచెందినజాషువా 'క్రొత్తలోకం' కోసం పరితపిస్తూ తన ఆవేదనను దేవునికి మనవిచేస్తూ—

"నీవు జగత్తుమీద పయనించి పరిస్థితులాకళించుకో,
లేవనుకొందు, సత్యము హుళక్కి, నిజాయితీ సున్నయేకతా,
భావము శూన్యమిట్టి దురవస్థకు లోనయియున్న భూమిలో
నీవు పదంబు మోపకుము, నిక్కము గుండియలాగి పోయెడిన్"!

అని అశ్రు నివేదన గావిస్తారు. పేదరికం పెద్ద వింత విద్యాశాలయని,దానిలో ఏమాత్రం లజ్జ కన్పించదనీ నగ్నసత్యాన్ని 'స్వప్నకథ' అనే కావ్యంలో చెప్పారు. "మాధవసేవకన్న మానవసేవమిన్న" అని 'గబ్బిలం' అనే కావ్యం ద్వారా ప్రబోధిస్తూ "సమస్త దేవతాసన్నిధి నారగింతువు ప్రసాదము లంతటి పుణ్యశీలవై, యన్నములేని పేదలగృహంబు జొచ్చితివేల బేలవై"- అని గబ్బిలాన్ని ప్రశ్నిస్తారాయన.

సమాజంలో గల వ్యవస్థ, అస్పృశ్యత, పనిదోపిడి, మొదలగు లోపములను నిర్భయముగా తన రచన ద్వారా ఎత్తిచూపి, వాటిని ఖండించారు- గబ్బిలంలో 'అరుంధతీసుతుని' పాత్రను చిత్రిస్తూ-

"ముప్పుఘటించి వీనికులమున్ గలిమిన్, గబళించి దేహమున్
పిప్పియొనర్చు నీ భరతవీరుని పాదము కందకుండగా
చెప్పులు కుట్టి జీవనము సేయునుగాని, నిరాకరించ తే
దెప్పుడు నప్పువడ్డది సుమీ, భరతావని వీనిసేవకున్"-

అని ఎంతో ఆవేదనాపూరిత హృదయులౌతారు. మానవ హృదయాన్నే దేవాలయంగా చేసి, సమతావాదమనే దేవుని ప్రతిష్ఠించి ఆత్మతోధ్యానం చేయాలని, అనాథులను దుఃఖార్తులను ఆదరించుటయే నిజమైన పూజయని ఎలుగెత్తిచాటారు. మానతావాదం వృద్ధిపొందినపుడే సాంఘికాభివృద్ధి సాధ్యం అనేది ఆయన ఆలోచన !!

సాంఘికాభివృద్ధి - దురాచారాల ఖండన :—

తరతరాలుగా నరనరాల్లో ప్రజలను పట్టి పీడిస్తున్న సాంఘిక దురాచారాలను తన రచల ద్వారా తరిమికొట్టి నవసమాజాన్ని స్థాపించి, జ్ఞాన జ్యోతిని వెలిగించి జనజీవనాల్లో కాంతిని వెదజల్లాలన్నదే జాషువా తపన! దానికై ఆయనలోని సంఘసంస్కరణ భావాలు, సంకుచితత్వంపై తిరుగు బాటు చేసి విశ్వమానవతవైపు వ్యక్తిగా, మహోన్నత శక్తిగా ఆయనను నడిపించాయి. అతని వేదన నిరుపేదల ఆవేదన. అతని వాదం వాస్తవాల వేదం.

'దైవపూజ నెపంతో ఎన్నో వేల రూపాయలు ఖర్చుచేస్తూ క్షుధార్తుడైన మానవునిపై మాత్రం కనికరం చూపకపోవటం చాలా హేయమైన విషయ'మని దాన్ని ఆయన 'గబ్బిలం' అనే కావ్యంలో గర్హిస్తూ—

"ప్రతిమల పెండ్లిచేయుటకు వందలు వేలు వ్యయింత్రుగాని దుః
ఖితమతులైన పేదల ఫకీరుల శూన్యములైన పాత్రలన్
మెతుకువిదల్ప దీభరతమేదిని ముప్పదిమూడు కోట్ల దే
వతలెగబడ్డ దేశమున భాగ్యవిహీనులక్షుత్తులారునే"- అని చెప్తారు.

మానవాళిమధ్య 'కులం' వ్యాకులాన్ని కల్గిస్తోందని, అస్పృశ్యత అనవతరం రాజ్యమేలుతోందని ఆవేదనాభరిత హృదయులై -

"కనపడలేదు దైవతముగాని పదార్థము భారతంబునన్,
కనపడలేదు వర్ణము కన్న మహాకళ భారతంబునన్,
కనపడలేదు సత్కులము కన్న పిశాచము భారతంబునన్,
కనపడలేదు 'పంచముని' కన్న నీచపు జంతువేదియున్"-

అని విలపిస్తూ ఖండిస్తారు. "తల్లిదండ్రులెపుడు బిడ్డలకెప్పుడు నేర్పగరాదు కులగోత్రములు, వాటి గొప్పదనము"-అని బిడ్డలను పెంచు తల్లిదండ్రులకు హితవు చెప్పారు.

'విగ్రహారాధన' ద్వారా లబ్ధిపొందు స్వార్థజీవులు ఎందరో ఉన్నారని,

ఈ విధంగా కొందరు విజ్ఞులు, అజ్ఞులను మోసగిస్తున్నారనే సత్యాన్ని- 'నేతాజీ' అనే కావ్యంలో ఖండిస్తారు.

"గొప్పదేవుడంచు గుండ్రాళ్ళ జొప్పించి
బాగుపడెడివారు పలువురుండ
ప్రాణమున్న బీదవాని కన్నులజూసి
బాగుచేయు ధర్మపరుడు లేడు" అని విగ్రహారాధనను నిరసిస్తారు.

లంచగొండితనం కూడా సమాజాభివృద్ధికి గొడ్డలిపెట్టు. అని దానిని ఎత్తిచూపుతూ 'నేతాజీ' అనే కావ్యంలో-

"ఉన్నతాధికారియు చిన్న యుద్యోగియు
చేయిసాచకుండ సాయపడరు,
లంచమీయకున్న మంచమెక్కనివారి
వ్రేళ్ళమీద లెక్కపెట్టవచ్చు"- అని విమర్శిస్తారు.

'అష్టావర్షా భవేత్కన్యా' అనే సనాతనుల సాంప్రదాయాన్ని పాటిస్తూ 'బాల్యవివాహాలు' చేయకూడదని, ఈ దురాచారాన్ని ఖండకావ్యంలో-

"ఈడురాకముందే వేడుకకోస మ
ర్థంబు లేని పెండ్లి తంతు నెరపి
భావిజీవితములు పాడుచేయువధూటి
తల్లిగాదు జంగుపిల్లిగాని"- అని ఖండిస్తారు.

మూఢాచారాలకు అజ్ఞానమే హేతువని, మరణానంతరం జరిపే శ్రాద్ధకర్మలను, ఆయన 'ముసాఫరులు' అనే కావ్యంలో—

"బ్రతికియున్నవేళ మెతుకు బెట్టనివారు
చచ్చెనేని దినముసల్ప గలరు
స్వర్గలోకమందు సద్గతుల్ గల్గుగా
విందుగుడువగలరు బంధు జనులు" అని నిరసిస్తారు.

సతీసహగమనం, మూర్ఖపు మొక్కులు సమాజప్రగతికి ఆటంకాలని చెప్తూ 'గబ్బిలం'లో ఇట్లు కవితాకరవాలాన్ని మూఢాచారాలపై విసురుతారు-

"మొక్కబళ్ళ నెపాన చక్కని పసిపాప లెందరు గంగలో నిమిడినారో,
సహగమనాచార దహనదేవత లెన్ని చిగురుకొమ్మల బూదిచేసె నొక్కొ,
చదువుచాచెడు దురాచార మెందరి కళాభ్యాసనాచాతురు గొంతుబిసికె నొక్కొ
పొందెరుగని బాహుబంధాలచే బాహు బలమెంతగా చచ్చుపడియె నొక్కొ!!"

అంటూ ఈ విధంగా నాగరికతా ముసుగులో జరుగుతున్న ఎన్నో దురాచాలను వెలికిదీసి నిట్టూర్చి, వాటిని రూపుమాపుటకు జ్ఞాననేత్రం దెరచి తన రచనల ద్వారా భస్మీపటలం చేయటానికి ప్రయత్నించిన అపర 'లయకారకుడు' జాషువా!. జాషువా కవిత 'గ్రీష్మంలో' వసంతం'– మండే ఎండలో 'చిరుజల్లు'- కటికచీకటిలో 'రాగరేఖ'. మానవుడి అహంకారానికి బలియై వెలియై పోయిన హీనజాతి హృదయాల్లో పల్లవించిన "జీవనరాగం" అని చెప్పటంలో అతిశయోక్తి లేదేమో!

సాంఘికాభివృద్ధి- కళలు :—

సాంఘికాభివృద్ధికి కళలు ఎంతో దోహదపడతాయని, కుల, మత బేధాలనే కళంకాలు కళలకు అంటరాదని, అనతికాలంలో అంతమయ్యేది జీవితమని, అనంతమైనది కళయని చెప్తూ వాస్తవచిత్రాలను అనుభవాల రంగులతో చిత్రీకరిస్తారు. 'నాకథ' అనే కావ్యంలో కళలను గూర్చి-

"కులమత విద్వేషంబుల్ తలసూపనితావులే కళారాజ్యంబుల్
కళలాయుష్మంతములై అలరారెడి నెలవు స్వర్గనుగు చెలికాడా"-

అని నిర్వచనం చెప్తారు. 'కవిత్వం' యొక్క లక్షణం చెప్తూ అది మానవ జీవనేతిహాసంలో మలుపులు త్రిప్పగల మహత్తు దానికున్నదని 'కొత్తలోకం' అనే కావ్యం

"కులమత రాజకీయములకున్, గురికాక సమస్తలోక మం
గళకరమైన సత్యమును, కమ్మని వాక్కుల నిశ్చయంబుగా
బలికినదే కవిత్వ" మని చెప్తారు.

కళలు సమాజాభివృద్ధికి ఉపకరిస్తూ విశ్వమానవ వృద్ధి చేయాలన్నదే ఆయన ఆలోచన. అనుభవాల బాధను తెలుపుతూ "పేదవానికి పెద్దరికం బిచ్చి గౌరవింపదెపుడు కటికజగము" అని చెప్పి కులమనే కుళ్ళు వ్యవస్థలో

'కళ'కు పట్టిన దుర్గతిని దుయ్యపట్టారు. 'కళలు' మానవత్వ విలువలను పరిరక్షిస్తూ సాంఘికాభివృద్ధికై 'శ్రీరామరక్ష' కావాలన్నదే ఆయన అకుంఠిత దీక్ష !

**సాంఘికాభివృద్ధిలో మత ప్రభావం :**

'మతం' అన్నది మానవతను హతమార్చే 'చితి'కాకూడని, మానవ మనుగడకు ఉపకరించునదియే మతమని, అదే అన్నిమతముల సారమని 'దేవుడు సర్వాంతర్యామి' యని, ప్రకృతిలోనే కాక, ప్రతి ఒక్క విశ్వమానవ హృదయంలో నిత్యం వసిస్తాడని, సర్వమత సమతా విజయకేతనం ఎగుర వేశారు."గుళ్ళగోపురాల కొరకు చందాలెత్తి పొట్టపోసుకొనుట పుణ్యమగునే" అని ఆయన ప్రశ్నిస్తారు. మతపిచ్చి తన రచనల్లో ఉండదని, కులమతాల కంచుకోటల మంటకలిపిన మానవతావాదినని ఆయన-

> "మతపిచ్చిగాని, వర్ణో
> న్నతిగాని, స్వార్థచింతనము గానీ నా
> కృతులందుండదు శబ్దా
> కృతి బ్రహ్మానందలక్ష్మి నృత్యమొనర్చున్" అని చెప్పి

'కొత్తలోకం'లో నిరూపించుకొంటారు. జాషువా అజ్ఞానతిమిరాలను తొలగించుటలో నాస్తికుడు. విజ్ఞాన విషయాలను మానవాళికి కలిగించటంలో ఆస్తికుడు! అని చెప్పవచ్చు.

**మహిళాభ్యుదయం ద్వారా సాంఘికాభివృద్ధి :**

సమాజంలో స్త్రీల బాధలను చూసి వారిపై సానుభూతి ఏర్పరచుకొని తన కావ్యాల్లో స్త్రీలకు ప్రత్యేకస్థానాన్ని కల్పించారు. ఎంతటి మేధావికైనా విజ్ఞతగల భార్య సహకారం ఉండాలని, స్త్రీలు విద్య నేర్చుట ఎంతో అవసరమని, సమాజంలోని మూఢాచారాలను, సాంఘిక వ్యత్యాసాలను దూరం చేయటంలో ఆమె పాత్ర ఎంతో శ్లాఘనీయమైనదని వక్కాణించారు. "యత్ర నార్యస్తు పూజ్యంతే రమంతే తత్ర దేవతాః" అనే ఆర్యోక్తులు కేవలం హిత వాక్యాలుగా అవనిలో మిగులు తున్నాయని ఇసుమంతయినా కార్యరూపం దాల్చటం లేదన్నదే జాషువా'గారి ఆవేదన!.క్షమారూపిణిగా, మూర్తీభవించిన

సహనంతో సమాజపురోభివృద్ధికి యావజ్జీవితం స్త్రీ పాటుపడుచున్నదని, ఆమెకు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలనిచ్చి మానవతా దృక్పథముతో సముచిరీతిని గౌరవించినచో సత్ఫలితాలు లభించగలవన్నది ఆయన ఆకాంక్ష! 'కొత్త లోకంలో' "స్త్రీకి మారు సమాన గౌరవవిభూతిన్ గాంతకుం గూర్చుమా"-అని అభ్యర్థిస్తారు. ఖండకావ్యం, అనాధ, ముంతాజ్‌మహల్, స్వయంవరం మొదలగు రచనల్లో ఆయన స్త్రీలను చిత్రించినతీరు అనితర సాధ్యం- "నారి లేని ఇల్లు నారిలేని విల్లు" అనే విషయమును ముసాఫరులు అనే కావ్యంలో "ఆడుతెగలేకున్న మగతెగకు పుట్టగతి లేదన్న", "ఆడుదిలేకుండిన నీరేడు జగంబులకు శోభయే లే"దనే వాక్కుల ద్వారా వర్ణించి చెప్పారు.

స్త్రీలయందలి సద్గుణాలను శ్లాఘిస్తూ, వారిలోని దుర్గుణాలనుకూడా ఎత్తిచూపి వాటికి దూరంగా ఉంటూ సమసమాజ స్థాపనకు కృషి సల్పుడు అని ప్రబోధించారు.

"నగలకై మగలతో జగడాలు నెఱపి, సౌఖ్యము గోలుపోవుగయ్యాళితనము
పొరుగు సంసారాల సిరికోర్వలేక, నిందలు చెప్పుకొను చుప్పనాతితనము
ముసలి మూఢాచార భూతాల మహిమలో లోకము నెరుంగనినూతి కప్పదనము
కలవారమను నహంకారాన పనిచేయ బద్ధకించెడి ఒళ్ళుబరువుతనము"-

వలదని స్త్రీజాతిని జాగృతం చేశాడు!

జాషువా కవి వాస్తవ చిత్రాలనేకాక వేదాంత విషయాలుకూడ కండ్లకు కట్టినట్లు చిత్రీకరించటంలో అతనికి గల నైపుణ్యం అనితర సాధ్యం. 'జాతస్యహిధ్రువో మృత్యుః' అనే వేదాంతాన్ని 'శ్మశానవాటిక' ద్వారా తెలుపుతూ సాంఘిక అసమానతలు పితృవనంలో ఉండవని అనుభవం చావక తప్పదని ప్రతీవారు మరణించిన పిదప అటకు చేరవలసినదేనని, బ్రతికి నన్ని రోజులు 'నీవలె నీ పొరుగువానిని ప్రేమించుము'ని హితబోధ చేస్తూ వైరాగ్యరచన గావించారు.

"ఇచ్చోటనే సత్కవీంద్రుని కమ్మని కలము నిప్పులలోన గఱగిపోయె
యిచ్చోటనే భూములేలు రాజన్నల యధికారముద్రికలంతరించె,
యిచ్చోటనే లేత యిల్లాలి నల్లపూసల సౌరుగంగలో గలసిపోయె
యిచ్చోట నెట్టిపేరెన్నికం గనుగొన్నచిత్రలేఖకుని కుంచియు నశించె"-

అనిచెప్పి దానవత్వం కరడుగట్టిన హృదయాల్లో సైతం మానవత్వ విలువల పరిరక్షణకై సాహితీ క్షేత్రంలో ఆలోచనా బీజాలు నాటి, ఈ అనంత విశ్వం సమతావిలువలతో సస్యశ్యామలం కావాలని కాంక్షిస్తూ ...

"తలితండ్రిలేని బిడ్డలచూసి కన్నీరు దానంబు చేయు నేత్రములు నావి,
జంతుకోటికిగల్గు స్వామిభక్తిని మెచ్చి తృప్తినందెడు నవ్యదృష్టి నాది,
సకల కార్మిక సమాజముల జీవిత కథానకము లాలించు కర్ణములు నావి
కఠిన చిత్తుల దురాగతములు ఖండించి కనికారమొలకించు కలము నాది".

"దొడ్డపదవు లెక్కి గడ్డిమేసెడివారి
నెత్తడుచు, చిత్తవృత్తి నాది
నిఖిలలోకమెట్లు నిర్ణయించిన నాకు
తిరుగులేదు. విశ్వనరుడ నేను!"- అన్న

విఖ్యాత సంఘసంస్కర్తకు అశేషజనం అనవరతం సమర్పిస్తోంది. ఘనమైన నీరాజనం !!



# శ్రీవిశ్వనాథ రేడియో నాటికలు తెలుగు సాహిత్యం - అనుశీలన

—ఆచార్య ఎస్. గంగప్ప

ఆధునికయుగంలో తెలుగుసాహితీ జగత్తులో శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారికొక ప్రత్యేకస్థానముంది. వివిధ సాహితీ ప్రక్రియల్ని సృజించి మహాకళాస్రష్టగా నిరూపించుకొన్నారు. ప్రప్రథమంగా తెలుగులో జ్ఞానపీఠ పురస్కారం పొందిన మేటి, ఆయన కవిసమ్రాట్.

విశ్వనాథవారు రామాయణ కల్పవృక్షం మొదలు కోకిలమ్మ పెళ్ళి దాకా, వేయిపడగలు మొదలు హాహాహూహూ దాకా, త్రిశూలం మొదలు రేడియో నాటికల దాకా, నన్నయ ప్రసన్నకథాకలితార్థయుక్తి మొదలు ఒకడు నాచన సోమన్న దాకా అనేక రచనలు చేసి కళావేత్తగా సాహితీ లోకంలో తమ గొప్పదనాన్ని నిలుపుకొన్నారు.

త్రిశూలం, నర్తనశాల, వేనరాజు, అనార్కలి మొదలైన ఉత్తమ నాటకాలతోపాటు రేడియో నాటికలెన్నో రచించారు. అందులో ప్రత్యేకించి తెలుగుసాహిత్యానికి సంబంధించి పది రేడియో నాటికలు రచించి రేడియోలో ప్రసారం చేయడమేగాక 'భారతి'లో ప్రకటించారు. ఆ నాటికలివి- భారతావతరణం, ఉభయకవిమిత్రం, పాల్కురికి శివభక్తి, నందికంత పోతరాజు, అద్వైత శేఖరం, వసంతోత్సవం, కనకాభిషేకం, నాటకోత్సవం, ఆతిథ్యం, హేతువాదయుగం- అనేవి. ఈ పది నాటికల్లో విశ్వనాథవారు కళాస్రష్టగా ఉత్తమ విమర్శకులుగా మనకు ప్రత్యక్షమవుతారు. ఈ పది నాటికల్లో నా యీ వ్యాసం ప్రత్యేకించి ఆధునికాంధ్ర సాహిత్య వైభవాన్ని వివరించే నాటకోత్సవం, ఆతిథ్యం, హేతువాదయుగం అనే మూడునాటికలకు మాత్రమే పరిమితం. అయినా ప్రాచీనాంధ్ర సాహిత్య సంబంధులైన మొదటి ఏడు నాటికలను గూర్చి స్థాలీపులాకన్యాయంగా పరిశీలించడం ఆధునికాంధ్ర సాహిత్యయుగ నాటికల విశ్లేషణకు పునాది కాగలదు. అంటే ఈ నేపథ్యంలో

విశ్వనాథవారు ప్రాచీన సాహిత్యాన్ని వివరించిన తీరు, దాని మూలాన తదనంతరకాలంలో పాశ్చాత్య ప్రభావంతో వెలువడ్డ వివిధ సాహిత్య ప్రక్రియల వివరణలో అమోఘమైన అవగాహన, తద్వారా విశ్వనాథవారి ప్రతిభాపాటవాలు, వీటన్నిటిని సమన్వయించేతీరు, సహృదయ హృదయతా ముద్ర అవగతమై విశ్వనాథవారి విరాట్స్వరూపం విదితమవుతుంది.

ప్రాచీనాంధ్ర సాహిత్య సంబంధి ప్రప్రథమ నాటిక భారతావతరణం. నన్నయ భారతాన్ని తెనిగించి ఆవిష్కరించడం ఇందులో విషయం. రాజరాజనరేంద్రుని ఆస్థానంలో ఈ ఆవిష్కరణ సభ జరిగినా స్వర్లోకంలో సరస్వతీదేవి, తదితరకవులు, బ్రహ్మ, మేనక మొదలైనవారిమధ్య సంభాషణ సాగినట్లు విశ్వనాథవారు కల్పించారు. తెలుగుభాషా విషయంలో అనాడు సంస్కృత పండితులలో ఉన్న తూష్ణీం భావాన్ని, ప్రవేశపెట్టిన బ్రాహ్మణుల సంభాషణలో వివరించి నన్నయ తనకు ప్రత్యర్థి అనీ, వ్యాసునే ఎక్కువ ప్రస్తుతించాడని వాల్మీకి తన వ్యథను సరస్వతీదేవితో వ్యక్తం చేస్తాడు. జీవద్భాషకు మార్పు సహజమని సరస్వతీదేవి చేత చెపిస్తారు. పైపెచ్చు సరస్వతీదేవి వివర్త శోభను తిలకించడానికి కాళిదాసు, భవభూతి, మురారి విచ్చేసినట్లు చెప్పించారు. నన్నయ "శ్రీవాణీ గిరిజాశ్చిరాయ.... శ్లోకంతో ప్రారంభించి "పాయక పాకశాసనికి ..." మొదలైన పద్యాలు చదివి విని పించాడు. కాళిదాస భవభూతు లిద్దరూ నన్నయగా అవతరించినట్లు సరస్వతీ దేవి చెబుతుంది. ఇందులో సరస్వతీదేవి పాదాలకు పారాణి పెట్టడానికని మేనకను ప్రవేశపెట్టారు విశ్వనాథ. అంతేగాదు సందర్భోచితంగా మేనక కాళిదాసుని ఎత్తిపొడుస్తుంది. "ఓయీ కాళిదాస భవభూతులారా ! నాశరీర కాంతి నన్నయ సంస్కృతము చేత, యో సంస్కృతము చేతవలెనే జిలుగులు మీరు చున్నది." అని సరస్వతీదేవి పలుకగా ఆంధ్రభారతానికి, ఆంధ్ర జాతికి, ఆంధ్ర సారస్వతానికి జయం కోరుతూండగా నాటిక ముగుస్తుంది.

రెండో నాటిక 'ఉభయకవిమిత్రం' తిక్కన భారతాంధ్రీకరణముగూర్చిన విషయ వివరణతో కూడినది. అయితే ఇక్కడ ఉభయకవి మిత్రుడు తిక్కన. ఉభయకవి శబ్దానికి సంస్కృతాంధ్ర కవులని గాక ఐహికాముష్మికాలు రెంటికి సంబంధించిన కవి అని వ్యాఖ్యానించినట్లు విశ్వనాథవారే వివ

రించారు. ప్రారంభంలో కాటమరాజుతో కలిగిన యుద్ధంలో ఖడ్గతిక్కన, బ్రహ్మరుద్రయ్యలు యుద్ధం చేసి ఇద్దరు మరణించడం ఈ నాటికలో చూపబడింది. ఇందులో తిక్కన భారతాంధ్రీకరణతోపాటు శ్రీగణపతిదేవ చక్రవర్తి ఆస్థానానికి రాయబారిగా వెళ్ళి మనుమసిద్ధికి పోయిన రాజ్యాన్ని సంపాదించిపెట్టినట్లు వివరించబడింది. పైపెచ్చు మనుమసిద్ధికి, కాటమరాజుకు పుల్లరి విషయంగా యుద్ధం జరిగిన సంగతి ఉంది. కానీ మనుమసిద్ధి తదనంతర కాలంలో అతని పుత్రుడు నల్లసిద్ధికి, కాటమరాజుకు యుద్ధం జరిగినట్లు పరిశోధనవల్ల తేలింది.

మూడో నాటిక 'పాల్కురికి శివభక్తి'. ఇందులో ప్రతాపరుద్ర మహారాజు పాల్కురికి గ్రంథాల్లోంచి శ్లోకాలు, పద్యాలు, ద్విపదలు, స్వయంభూ శివాలయంలో స్తుతిస్తూఉండగా వేంకటమఖి, రామభద్రసోమయాజి అనే బ్రాహ్మణులు పాల్కురికి భాష నాశనం చేశాడని, ఆతని సాహిత్యమంతా తప్పుల తడక అనీ నిందిస్తారు పంచయ్య, మల్లయ్య అనే శివశరణులు శివనింద చేసినవారిని, అంతకంటే శివభక్తుల్ని నిందించిన వారిని శిక్షించాలనీ అయితే గురువైన పాల్కురికికి తెలియకుండా అపని చేయకూడదని పాల్కురికి వద్దకు వెడతారు. రాణి వధ చేయరాదని బోధిస్తాడు పాల్కురికి. భయంకరమైన గొడవే జరగబోతుందనుకొన్న సమయంలో ప్రతాపరుద్ర మహారాజు క్షమాభిక్ష కోరగా ఉత్తమ శివభక్తుడైన కొప్పయ్యకి 'డోకిపర్తి'ని అగ్రహారంగ యిప్పించి క్షమిస్తాడు. ఇది ఇందలి కథ. ఇందులో పాల్కురికి సాహిత్యం, దేశిసాహిత్యమని, మార్గకాదని పాల్కురికి చేతనే పలికిస్తారు విశ్వనాథవారు.

నాల్గోనాటిక 'నందికంత పోతరాజు'. నందికంత పోతరాజనేది కత్తి పేరు. ఇది కొండవీటి రాజ్య చిహ్నం ఆకత్తి రెడ్డిరాజులవద్దనే ఉంటే రాజ్యోన్నతికి, లేకపోతే వినాశనానికి కారణమౌతుంది. శ్రీనాథుడు మహాకవి మాత్రమే కాక రాజ్యాన్ని నిలుపగల మహావ్యక్తిగా విశ్వనాథవారు ఇందులో వివరించారు. రాజమహేంద్రవరంలో ఉన్న నందికంత పోతరాజును అల్లాడ వేమారెడ్డి నడిగికొనితెచ్చి, కోమటివేమారెడ్డికి కొండవీటిలో అప్పగిస్తాడు. అదే రీతిగా ప్రౌఢదేవరాయలకు బంధీ అయి కోమటి వేమారెడ్డి కుమార్తె

హేమాంబకు భర్తగా నిర్ణయించబడిన సోమదేవచోడుని విడిపించుకొనిరావడం శ్రీనాథుని రెండు ఘనకార్యాలు. ఇవి యుద్ధం వల్ల సాధించేవిగావని విశ్వనాథ వ్యాఖ్యానం. అవచి తిప్పయ్యతోటి స్నేహాన్ని, వల్లభామాత్యుని పరిచయం, క్రీడాభిరామ కర్త వల్లభామాత్యుడే అయినా, శ్రీనాథుని పేర వెలసిన రీతిని చక్కగా వివరించారు. ఇంతేకాక రాజశిక్షితుల మెడలోదండలు, మొదలైన చిహ్నాలున్న వీధిని పోవడానికి అంగీకరించని మెత్తని హృదయుడైన శ్రీనాథుడికి చివరికి అదే ప్రాప్తిస్తుంది. దేనిని జీవుడు భయముచే పరిహరింపనెంచునో భగవంతుడు వానికి దానిని సంఘటించును"— అని దీనికి విశ్వనాథవారి వ్యాఖ్యానం.

ఐదో నాటిక అద్వైత శేఖరం. ఇందులో విశ్వనాథవారు పోతన భాగవతం రచించిన తీరును వివరించారు. పోతన తదనంతరం శిథిలమైన స్కంధాలను ఇతర కవులు రచించినట్లుకాక పోతన కాలంలోనే అతని అనుమతితో రచించినట్లు తమ అభిప్రాయాన్ని వ్యక్త చేశారు. ఇది కొంత మంది విమర్శకులు అంగీకరించిన అంశం. భాగవతంలో ఐదవ స్కంధం బొప్పరాజు గంగన, ఆరవ స్కంధం ఏర్చూరి సింగన, పదకొండు,పన్నెండు స్కంధాలు వెలిగంపల నారయ రచించారు. పోతన తక్కిన ఎనిమిది స్కంధాలు రచించాడు. పైన చెప్పిన విశ్వనాథవారి వాదం నిలిచినా నిలవకపోయినా ఆయాకవుల కవితాలక్షణాలు స్పష్టంగ విదితమవుతాయని విశ్వనాథవారి ప్రగాఢ విశ్వాసం. ఇందులోని పాత్రలు తండ్రి కేతన, పోతన అన్న తిప్పయ్యలను ప్రవేశపెట్టి వారి సూక్ష్మమైన మనస్తత్వాలను స్పష్టం చేశారు. ఇంకా అమె (గంగయజాత కూతురు)చేత భాగవత విషయాలను చక్కగా వ్యాఖ్యానింపజేశారు. నాటిక చివర సర్వజ్ఞసింగ భూపాలునికి ఈ కావ్యాన్ని అంకితమివ్వమని పోతనను కవులు కోరగా పోతన అంగీకరించడు. పైపెచ్చు ఇలాంటి మాటలు విన్నప్పుడల్లా సరస్వతీదేవి కన్నీటితో కన్పిస్తుందని "కాటుకకంటినీరు ... ...నమ్మభారతీ" అని పోతన పద్యంతో విశ్వనాథవారు ఈ నాటికను ముగించారు.

ఆరవనాటిక 'వసంతోత్సవం'. శ్రీకృష్ణదేవరాయలు భువనవిజయం భవనంలో అష్టదిగ్గజ కవులతోపాటు ఇతర కవులు పరివేష్టించి ఉండగా

కవితాసల్లాపం జరుపుతున్నట్లు తిరుమలదేవి, చిన్నాదేవి మధ్య సంభాషణ కొనసాగినట్లు ఆయాకవుల కవిత్వ పటుత్వాన్ని వసుబందు అనేవాడిచేత భువన విజయంలో జరుగుతూ ఉన్న కవితాకలాపాన్ని చెప్పించినట్లు వ్రాశారు. ఆవెనుక తిరుమలదేవి చిన్నాదేవి ఇద్దరు వసంతోద్యానవసంలో రాజునార్చి కలుసుకుంటారు. వంది జయజయధ్వానాలతో నాటిక ముగుస్తుంది. ఇందులో రాణులిద్దరూ కవిత్వపు సొగసులను గుర్తించిన కళాహృదయాలుగా విశ్వనాథవారు తీర్చిదిద్దారు.

ఏడవనాటిక 'కనకాభిషేకం'. ఇందులో విజయరాఘవనాయకుడిచేత రంగాజమ్మ కనకాభిషేకం చేయించుకున్న విషయాన్ని విశ్వనాథవారు వివరించారు. ఈ నాటికను కేతినాయుడు, సూత్రధారులచేత నడిపి వారు. రంగాజమ్మ కవిత్వకామనీయాన్ని విశ్వనాథవారు చక్కగా వివరించారు. అంతేగాక యక్షగాన విశేషాలను, తత్సంబంధమైన సాంకేతిక పదాల్ని విశ్వనాథవారు మిక్కిలి మనోహరంగా గుదిగుచ్చారు.

ఇంతవరకు ప్రాచీనాంధ్ర సాహిత్యానికి సంబంధించిన నాటికలను ప్రస్తావించడం జరిగింది. నన్నయ నుంచి దక్షిణాంధ్రయుగందాకా ప్రాచీనాంధ్ర సాహిత్యంలోని వివిధ సాహిత్య ప్రక్రియలను ఆయాయుగాల్లో ఉత్తమ కవుల వరివస్యను విశ్వనాథవారు సముచితరీతిని సద్విమర్శక శ్రేష్ఠుడుగా- తమ అభిప్రాయాలను అభివ్యక్తీకరించి సదవగాహనకు అవకాశం కల్పించడం మనకు విదితమవుతుంది.

ఆధునికాంధ్ర సాహిత్య వైభవాన్ని తక్కిన మూడునాటికల్లో చక్కగా వివరించి ఉత్తమ విమర్శకుడుగా నిరూపించుకొన్నారు.

ఎనిమిదోనాటిక 'నాటకోత్సవం'. ఇందులో నాటకోత్సవంలో వివిధ నాటక ప్రదర్శనలు జరుగుతూండగా గిరి, హరి అనే పాత్రల ద్వారా తెలుగు నాటకాలకు సంబంధించిన సమస్త విషయాలను విశ్వనాథవారు వివరించి ఇది వీరేశలింగయుగమనీ ఆయన సంఘ సంస్కరణోద్యమంలో భాగంగా ఎన్ని అడ్డంకులెదురైనా విధవా వివాహాలు చేసిన మహనీయుడనీ, నవలలు. నాటకాలు, చక్కటి గద్యమూ రచించిన ఆధునికాంధ్ర సాహిత్య నిర్మాత అనీ ప్రశంసించారు. అలాగే చిలకమర్తి ఉత్తమ నవలాకారుడనీ,

ఆయన గయోపాఖ్యాన నాటకకర్త అనీ ప్రశంసించారు. ధర్మవరం కృష్ణమాచార్యుల చిత్రనళీయం మొదలుకొని వడ్డాది, బలిజేపల్లి, కొక్కొండ, వేదం, తిరుపతి వేంకటకవులు, పానుగంటి, కోలాచలం మొదలైన నాటక కర్తలను, ముప్పిడి జగ్గరాజు, పెడన సుబ్బయ్య, హరిప్రసాదరావు ఉప్పులూరి సంజీవరావు, ముంజులూరి కృష్ణారావు, బుర్రా రాఘవరావు మొదలైననటులు, గిడుగు వ్యవహారికభాషావాద విషయమూ, ఇంకా వావిలకొలను, జనమంచి శేషాద్రిశర్మ, శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రి కవులను, మన సాహిత్యాన్ని ఉద్ధరించిన నాగపూడి కుప్పుస్వామయ్య, తంజనగరపు తేవప్పెరు మాళ్ళయ్య బ్రౌన్ పండితుడు- అనేవారిని పేర్కొనడం ఈ నాటికలోని విశేషాలలో విశేషం. అయితే విశ్వనాథవారు కొందరు ప్రముఖనటుల్ని పేర్కొనక పోవడమూ. ఒకరి రచనను మరొకరిదిగా పేర్కొనడమూ ఇందులోని లోపాలుగా తోస్తాయి. మొదటి దైన నెరసు అంటే నటులకు నటుడు బళ్ళారి రాఘవ ప్రశంస లేకపోవడం. ఏదైన మనం సమర్థించ దగ్గదే. కారణం నెల్లూరినగ రాజారావు ప్రశంసతోపాటు మరికొందరు ఉత్తమనటులు స్థానం, బంబా, జి. వి. సుబ్బారావు, డి. వి. సుబ్బారావు మొదలైన వారున్నారు. అంతేగాదు విశ్వనాథవారే 'హరి' అనే పాత్రచేత పల్కించినట్టు ఇద్దరుకాదు రెండువందలమంది నాటకకర్తలను, నటులను, కవులను మర్చిపోయినట్లు అనిపించారు గనుక ఈ విషయం మనం పట్టించుకోవలసిన పనిలేదు. కానీ కోలాచలం శ్రీనివాసరావు కేవలం నాటకాల్ని రచించడమే కాక' వేదవేదాంగోపనిషత్తులపై బ్రహ్మాండమైన పరిశోధనలు చేశారనీ ప్రశంసించడం బాగుంది. కానీ వారు వ్రాసిన నాటకం శ్రీనివాసకళ్యాణమనీ, ఆ నాటకంలో శ్రీ దొరస్వామి అయ్యవారు వేషధారి అని పేర్కొన్నారు. ఇక్కడ గమనించవలసిన అంశం కోలాచలం శ్రీనివాసరావు శ్రీనివాసకళ్యాణమనే నాటకం రచించలేదు. ఈ దొసగు ఎలా దొర్లిందో తెలియదు. శ్రీనివాసకళ్యాణ నాటక కర్త జైపూర్ మహారాజు విక్రమదేవవర్మ.

తొమ్మిదో నాటిక 'అతిథ్యం' ఇందులో ప్రధానంగా కనిపించే పాత్రలు మూడు. భావకవితా సరస్వతి ఆమె తమ్ముడు, అతిథి. వీరి సంభాషణల్లో ప్రధానమైన సకలాంధ్ర భావకవుల గళాలు వినిపిస్తాయి. ఆ అతిథిమీదుగా

అతిధ్య మనే పేరు ఈ నాటికకు పెట్టారు. భావకవితా సరస్వతి అతిధ్య మివ్వడానికి వచ్చినట్లు చెబుతుంది. ఇందులో భావకవులందరినీ విశ్వనాథ వారు పేర్కొన్నారు. అందులో ఆయా భావకవుల అత్యుత్తమ కవితల్ని ఉదాహరించడం విశ్వనాథవారి సహృదయతాముద్రకు చిహ్నం. కవయిత్రుల్లో విశ్వసుందరమ్మ, బసవరాజు రాజ్యలక్ష్మమ్మ, సీతాదేవి పేర్కొనబడ్డారు. కానీ ఇక్కడ రాయలసీమ కవులెవరినీ పేర్కొకపోవడం వింతగా ఉంది. చివడికి తెలంగాణా కవులెంతోమంది ఉన్నారనిచెప్పి, అభినవపోతన్న వానమామలై వరదాచార్యుల్ని పేర్కొన్నారు.

ప్రస్తుతం ఇద్దరు మహాకవులు విశ్వనాథ, జాషువాల శతజయంత్యుత్సవ సభలు జరుగుతున్నాయి గనుక విశ్వనాథ వారు జాషువా గురించి ఈ నాటికలో పాత్రలచేత పలికించిన మాటలు పేర్కొనడం ఎంతైనా సముచితం.

అతిథి : మరి హరిజనుల్లో ఎవ్వరూ లేరా?

తమ్ముడు : ఓరి నీకడుపుడకా ! ఎంత ప్రశ్నవేశావోయి. లేరా అంటావూ? భావ కవితా శారాపథంలో ధగద్ధగాయమానంగా వెలిగిన దివ్యతార ఉన్నాడోయ్ ఒకడు. అతనిపేరు జాషువా. అతడు తెలుగుదేశాన్ని తన మధుర కవితా ప్రవాహంచేత ఉర్రూత లూగించి వేశాడు.

అతిథి : అతని పద్యం ఒకటి చదువు.

తమ్ముడు : ఇదిగో 'శిశువు' అన్న శీర్షికలోని పద్యం.

బొటవ్రేల ముల్లోకములు చూచి లోలోన
నానందపడు నోరులేని యోగి
తల్లిదండ్రుల తనూ వల్లరీ ద్వయికి వ
న్నియబెట్టు తొమ్మిదినెలలపంట
అమృతంబు విషమును వ్యత్యాసమెఱుగనా
స్వాదింపజను వెఱ్ఱిబాగులాడు
అనుభవించుకొలది నినుమడించుచు మరం
దము జాలువారు చైతన్యఫలము

భాషరాదు వట్టిపాలు మాత్రమే త్రాగు
నిద్రవోవు లేచి నిలువలేడు
ఎవరెరుంగ రితనిదే దేశమోకాని
మొన్న మొన్న నిలకు మొరిచినాడు"

అని ముగిస్తాడు.

—చివరికి అతిథి ఇలా అంటాడు ...కానీ నాకొక్క అనుభవం ఉంది. వీళ్ళందరూ కవులే. చాలా బాగా వ్రాస్తారు. వీళ్ళు కవిత్వం వ్రాసేటప్పుడు మహానుభావులుగాని లోకంలో ప్రవర్తించడంలో అందరివంటివాళ్ళే. వాళ్ళ కవిత్వం వింటే మనమే మంచివాళ్ళ మనిపిస్తుంది." అని చెప్పగా "ఎందుకు లేరూ" అని "వ్యక్తిత్వ మెంత గొప్పదో కవిత్వమూ అంత మంచిదైన కవి తుమ్మల సీతారామమూర్తి చౌదరి" అని సమాధానం తమ్ముడు చెప్పగా అతిథి మెచ్చుకొంటాడు. ఇది ఆధునికాంధ్ర కవిత్వంలోని భావకవిత్వ మాధుర్యాన్ని ఆస్వాదించి, ఆస్వాదింపజేసిన ఉత్తమ విమర్శకులైన విశ్వనాథ వారి తీర్పు.

ఇంక చిట్టచివరిది పదోది అయిన నాటికి "హేతువాద యుగం" అనేది. అభ్యుదయ కవుల నేత శ్రీశ్రీ "ఆనందం అర్ణవమైతే; అనురాగం అంబరమైతే అనురాగపుటంచులు చూస్తాం: ఆనందపు లోతులుతీస్తాం" అనే గీతంతో ప్రారంభించి "మరోప్రపంచం; మరో ప్రపంచం పిలిచింది; పదండి ముందుకు పదండి తోసుకు అనే గీతంతో ముగించడం విశేషం. "ఈ క్రొత్త కవుల్లో ఒక్కడే మహాకవి. ఆయన పేరు శ్రీశ్రీ .... ఈ క్రొత్త కవితాయుగానికి హేతువాద యుగమని పేరుపెడితే ఆ యుగం అతని మీద నడుస్తున్నది". అని శ్రీశ్రీ ప్రాముఖ్యాన్ని వివరించి "అయితే శ్రీశ్రీ వంటి నవ్యకవిలోకూడ అలంకారాలుంట వంటవా?" అని ప్రశ్న లేవనెత్తి "అయ్యో! ఉన్నదే అతనికవిత్వంలో శబ్దాలంకారాలని ఉంటవి. ఒకదానిపేరు వృత్త్యను ప్రాసము. ఈ వృత్త్యను ప్రాసము యొక్క ప్రాబల్యమే శ్రీశ్రీ కవిత్వంలోని మొదటి సొగసు. అంత్యానుప్రాసకూడా ఒక శబ్దాలంకారం. అదిలేకపోతే వీళ్ళ నడకలేదుగా! శ్రీశ్రీ చంద్రవంకను చూచి కాళ్ళు తెగిన ఒంటరి ఒంటెలాగా ఉందన్నాడు. ఇది ఉపమాలంకారం. ఎట్లాంటిదె? మృచ్ఛ

కటికంలో నీటిలో మునిగి ఏనుగు ఎత్తిన రెండు దంతములవలె చంద్రవంక ఉందన్నాడే అంతగొప్ప ఉపమానం...." అని శ్రీశ్రీ ఉపమాలంకారానికి ప్రాచీన సాహిత్యంలోని మరో ప్రసిద్ధ ఉపమాలంకారంతో పోల్చి శ్రీశ్రీ కవితా గుణాన్ని మనసారా ప్రశంసించిన విశ్వనాథ సహృదయత మెచ్చ దగింది. ఆ వెనుక శ్రీ శిష్లా, నారాయణబాబు, పురిపండా, ఆరుద్ర, పట్టాభి, బెల్లంకొండ రామదాసు. అనిసెట్టి, బాలగంగాధరతిలక్, సోమసుందర్ అని పేర్కొని

హరి: — అడక్కపోయినా చెబుతాను విను. ఈ విప్లవాన్ని బాగా సాధించిన వాళ్ళు కొందరున్నారు. సుంకర, తుమ్మల వెంకట్రామయ్య, అవసరాల సూర్యారావు, రెంటాల, రమణారెడ్డి, రాంషా మొదలైన వాళ్ళు. ఇందులో తుమ్మల వెంకట్రామయ్య చాలా గడుసైన కవి. గొప్ప కవితాశక్తి కల వాడు. విప్లవాన్ని పరమ రమణీయంగా చెప్పకలవాడు, చక్కని పలుకు బడి కలవాడు'

గిరి : అయితే అతని పాట ఒకటి వినిపించు.

హరి : చెల్లీ.... అని ఒక పాట వ్రాశాడు.

చెల్లీ కన్నీరదేల?
తల్లీ గద్గదమదేల?
నీనెచ్చెలి గుండెనుండి దూసుకున్న తుపాకిగుండ్ల
కఠిన కర్కశ విలయధ్వనిలో
నీగాజుల మంజులరావం
నీకంకణ నిక్వాణం
నీనవ్వుల చిరుమువ్వలు వినరావో? ఇకతల్లీ
ఈశోకపు తెరవీడిపోయి
దానవలోకం సమయునులే
నవలోకం ప్రభవించునులే
మానవలోకం వెలయునులే
పగపేటికి తల్లీ పగబూనుము
నీపగ తీరునులే చెల్లీ....
నీపగ తీరునులే చెల్లీ....

"నిజం చెప్పాలంటే తుమ్మల వెంకట్రామయ్య అచ్చమైన తెలుగు కవి. ఇతరులు వ్రాస్తారు. శబ్దాలంకారాలుంటవి. ఫిరంగి ఢాంకారాలుంటవి. పాశ్చాత్యుల కవిత్వాలలోని కవి సమయాలుంటవి. ఇతని కవిత్వములో అచ్చమైన తెనుగు తనముంటుంది. యదార్థమైన విప్లవ భావముంటుంది." అని మిక్కిలి ప్రశంసించిన తీరు గమనించదగ్గ అంశం. సహృదయరంజకం.

ఇంకా ఇతరమైన కవితారీతుల్ని ప్రస్తావించారు. అందులో సంపత్, పుట్టపర్తి మొదలైన కవుల్ని, సినారె మొదలైన వారిని పేర్కొన్నారు.

ఆ వెనుక కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరి హేతువాద యుగానికి మూలపురుషుడనీ, సూత పురాణాన్ని కీర్తిస్తూ

"శ్రోత్రియ వరుడైన సోమయాజులు సాని
    కొంపతల్పులుచేత కొట్టుచుండ
వీరగంధముతోడ పెనగి పూనినమల్లు
    సానివాడ పచారు సల్పుచుండ
యజ్ఞయాగాదుల- ఆచరించిన యోగి
    లోపడుతుల ఇండ్లు రోయుచుండ
నిద్రించి తపములో నెగ్గిన జటిలుండు
    బాణుడుబోటుల కౌజుపొంతనుండ

జాడ తెలియక జడదారి తారుచుండ
కొంటె తెరగంటి కన్నెడన్ గొట్టుచుండ
నలుపు కాడట్టె వెడనవ్వునవ్వుచుండ
నల్లకల్లోలమై పోయెనాకపురము."

"ఆయన పద్యరచనాశైలి అంత మధురంగా ఉంటుంది. భావాలన్నీ పురాణాలకు వ్యతిరేకం. మొదట విప్లవం తెచ్చింది ఆయన. ఈవిప్లవవాదులు నిజంగా విప్లవవాదులైతే ఆయన కొక శిలా ప్రతిమ వేయవలె." అని పలికిస్తారు విశ్వనాథ. ఇలా కొనసాగుతుందీ విశ్వనాథవారి సహృదయ విమర్శ.

ఈ చివరి నాటికలో విశ్వనాథ చక్కటి విమర్శను గుర్తించగలము. ఇందులో ప్రముఖంగా మనం గమనించవలసిన అంశాలు కొన్ని ఉన్నాయి.

సమకాలిక కవులలో కొందరంటే విశ్వనాథకు పడదన్న అపోహ కొందరిలో ఉంది. కానీ ఈపై నాటికల్లో ప్రముఖంగా ఈహేతువాదయుగంలో విశ్వనాథ హృదయం అవిష్కృతం కావడం వల్ల ఆ అపోహలకు అవకాశం లేకుండా పోయిందని స్పష్టమవుతుంది. మొదటి అంశం: పూర్వోక్తమైనట్లు ఈనాటి శ్రీశ్రీ "ఆనందం అర్ణవమైతే" అనే గేయంతో ప్రారంభమై "మరో ప్రపంచం మరో ప్రపంచం పిలిచింది"తో ముగియడం అంతటితో ఆగక శ్రీశ్రీ కవితా గుణాల ప్రశంసజేయడం. రెండోది: జాషువాను స్మరించి ఆయన సర్వోత్తమ కావ్యఖండిక 'శిశువు' పద్యాల్ని పేర్కొవడం. మూడు: జీవితమూ,కవిత్వమూ రెండూ ఒకటిగ నిరూపించుకొన్న తుమ్మల సీతారామమూర్తిగారిని ఉదాహరించడం. నాల్గు : నిజమైన విప్లవకవి తుమ్మల వెంకట్రామయ్య అని అతని కవితలో తెలుగుదన ముట్టిపడుతుందని ప్రశంసించి 'చెల్లీ కన్నీర దేల' అనే కవితను ఉదాహరించడం. ఐదు : వీటన్నిటినీ మించి నిజమైన భావవిప్లవకారుడు త్రిపురనేని రామస్వామి చౌదరి' అని పేర్కొని 'ఈ విప్లవ వాదులు నిజంగా విప్లవవాదులైతే ఆయనకొక శిలాప్రతిమ వేయవలె' అని పల్కించడం ! వీటి ద్వారా విశ్వనాథవారి హృదయం విదితమవుతుంది.

ఇలాంటి విశ్వనాథ హృదయావిష్కరణ సమర్థమైన తెలుగు సాహిత్యేతి వృత్త ప్రధానాలైన ఈ పదినాటికలు త్వరలో అచ్చుపడవలసిన అవసరం ఎంతైనా ఉన్నది.

# జాషువ 'నాకథ' - రసవత్ప్రాప్యం

— ఆచార్య లకంసాని చక్రధరరావు,

ఎమ్.ఎ., పి. హెచ్. డి.

ఆంధ్ర విశ్వకళా పరిషత్, విశాఖపట్నం

కళాప్రపూర్ణ జాషువగారి స్వీయ చరిత్ర 'నాకథ'. 'స్వీయచరిత్ర' అనే పదసంపుటి తప్పనీ, "స్వకీయ చరిత్ర, సొంత చరిత్ర, స్వచరిత్ర" అనే పద సంపుటులలో ఏదో ఒకదానిని వ్యవహరించటం సరైనపద్ధతి అనీ బ్రహ్మశ్రీ కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు 'సరస్వతి' (మార్చి 1911)లో తెలిపారు. స్వీయచరిత్ర అంటే తన చరిత్ర అనే అర్థం రాదనీ తనకు హితమైన చరిత్ర అనే అర్థం మాత్రమే వస్తుందనీ పండితులు స్పష్టపరిచారు. శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారు తమ స్వీయ చరిత్రను రెండు భాగాలుగా రచించగా 1911 లో మొదటి భాగాన్ని 1915లో రెండో భాగాన్ని 'విజ్ఞాన చంద్రికా గ్రంథమాల' వారు ప్రచురించారు. 'స్వీయచరిత్రము' అనే పద సంపుటిని మొట్టమొదట తెలుగులో శ్రీగురజాడ శ్రీరామమూర్తి పంతులుగారు తమ 'కవిజీవితములు' (రెండోకూర్పు) గ్రంథంలో ప్రయోగించనప్పటికీ 'స్వీయచరిత్ర' పదసంపుటికి ప్రశస్తి ప్రాచుర్యాలు రావటానికి శ్రీకందుకూరి వీరేశలింగం పంతులుగారి 'స్వీయచరిత్ర' (రెండు భాగాలు) సంపుటులన టంలో సందేహం లేదు. 'స్వీయచరిత్ర' పదసంపుటి తప్పైనా ఒప్పైనా 'autobiogrophy' అనే ఆంగ్లపదానికి సమానార్థకంగా నేడు వ్యవహరించ బడుతోంది. శ్రీ కొక్కొండ వేంకటరత్నము పంతులుగారి "బిల్వేశ్వరీయము" (1893)లోను, శ్రీ మండపాక పార్వతీశ్వర కవిగారి "హరిహరేశ్వరశత కము" (1895)లోను వారివారి జీవిత చారిత్రికాంశా లున్నాయి. ఇవి పద్య కృతులు కావటం విశేషం. స్వీయచరిత్ర" అనేది ఆంగ్ల భాషాపరనప్రభావం వల్ల తెలుగులో ఏర్పడ్డ నూతన సాహితీ ప్రక్రియ. అనేకాధునిక సాహితీ ప్రక్రియలకు శ్రీకారం చుట్టిన శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారు ఈ స్వీయచరిత్ర ప్రక్రియకు కూడా శ్రీకారం చుట్టారు.

ఇంగ్లీషు భాషలో స్వీయచరిత్ర (autobiography)ను ఈ కింది

విధంగా నిర్వచించారు. "autobiography is a description of one's own life: a literary genre similar to memories but differing from them in a greater emphasis on the author's person and psychology" (Great soviet Encyclopedia vol. I p. 477). తన చరిత్రను తాను వివరించి చెప్పేది, వ్యక్తిని గూర్చి వ్యక్తి మనస్తత్వాన్ని గూర్చి ఎక్కువగా నొక్కిచెప్పే జ్ఞాపకాలను పోలిన సాహిత్య ప్రక్రియ స్వీయ చరిత్ర" అని గ్రేట్ సోవియట్ ఎన్సైక్లోపిడియా పేర్కొని "The life of the Archhriest Avvakum" (1672-75)ను మొదటి స్వీయ చరిత్రగా పేర్కొంది. ఆంగ్లంలో మొట్టమొదట 'autobiography' పదం 180?లో ప్రయోగించబడినట్లుగా "autobiography: n – Compounded of auto - and biography; first used by English poet and prose writer Robert southey (1774-1843) in 1809 with reference to the autobiography of the Portuguese painter Francisco Vieira (in Quarterly Review 1, 283)" (A comprehensive Etymological Dietionary of the English Language. Vol I p. 130) డాక్టర్ ఎర్నెస్ట్ క్లీన్‌గారి ఆంగ్ల వ్యుత్పత్తి కోశాన్నిబట్టి తెలుస్తోంది.

ఆంగ్లంలోని స్వీయచరిత్రలు వచనంలోనే ఉన్నాయి. కాని తెగులు లోని స్వీయచరిత్రలు గద్యాలుగాను పద్యాలుగాను కూడా ఉన్నాయి. శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారి స్వీయ చరిత్ర గద్యకృతికాగా బిల్వేశ్వరీయ, హరిహరేశ్వర శతక పండిత రాజాదులు పద్యకృతులు. జాషువగారి 'నాకథ' హృద్యపద్యాత్మకమైన స్వీయ చరిత్ర. తెలుగులోని పద్యాత్మకాలైన స్వీయ చరిత్రలన్నీ కవితాత్మకాలు కావటం విశేషం. మన జాషువగారి పద్యాత్మకమయిన 'నాకథ' తెలుగు స్వీయ చరిత్రలలో తలమానికమని తలచవచ్చు.

స్వీయ చరిత్రలు ఏ విధంగా ఉండాలో శ్రీ జాషువగారు 'నాకథ' మొదటి భాగోపోద్ఘాతంలో తెలిపారు.

"మహాపురుషులు నిత్యజీవితంలో వారనుభవించిన కష్టసుఖాలు,

పొందిన గౌరవాగౌరవాలు, వయః పరిపాకంలో నెదుర్కొన్న క్లిష్టసమస్యలు యథాతథంగా చిత్రించి తాము నడచిన త్రోవ సర్వజనసులభ సాధ్యమని వారార్జించిన కీర్తిప్రతిష్ఠలనన్య సాధ్యాలు గావని నిరూపిస్తూ ఒక ఆశాకిర ణాన్ని వెలిగిస్తూ యుంటారు. ప్రపంచ మహాపురుషుల జీవిత చరిత్రల్ని పరిశీలిస్తే ఈ సత్యం ఋజువౌతుంది. గాంధీ, నెహ్రూ, బోసు, టాగోరు ప్రభృతుల ఆత్మకథ లీ కోవలోని. వారి బాల్య యౌవన కౌమారఘట్టాలాద ర్శాల వలె స్వచ్ఛమై ఆయాకాలాలలో వారి మూర్తులను కన్నులగట్టుతూ హృదయంగమంగా యంటాయి. గౌరవభంగభయంతో వారు దాచుకొన్న స్వీయదోషాలందుండవు. స్వీయ చరిత్రలకీ లక్షణాలాయుర్దాయ కాలు-అలంకా రాలు" (నాకథ మొదటి భాగం 'ఒకమాట' పుట 4). జాషువగారు తమ స్వీయచరిత్రలో తాము తెలిపిన స్వీయ చరిత్ర లక్షణాలను 'తు.చ.'తప్ప కుండా పాటించారు. వారు తమ ఆర్త చరిత్రను పునః పునః స్మరించుకోవ టానికే ఈ రచన కానించినట్లు వ్రాకుచ్చారు (పైది పుట5). జాషువగారు తమ జీవితంలోని కొన్ని ప్రధాన ఘట్టాలనే స్వీయ చరిత్రలో వ్రాశారు.

"The word 'autobiogrophy' may also refer to brief chronological summary of the chief events of one's life".

(Great Soviet Encyclopedia Vol. I p 477)

అని గ్రేట్ సోవియట్ ఎన్ సైక్లోపిడియాలోని స్వీయ చరిత్ర లక్షణాన్ని బట్టి ఒకని జీవితంలోని ముఖ్య సంఘటనలను గురించి వ్రాసినప్పటికీ అది స్వీయ చరిత్ర ఔతుందని మనకు అవగత మౌతుంది స్వీయ చరిత్రలో రచయిత తన చరిత్రను తానే రచించటమనేది ముఖ్యం. కాబట్టి జాషువగారి 'నాకథ' స్వీయ చరిత్ర అని మనం నిశ్చయించవచ్చు'. సంస్కృత వాఙ్మయంలో బాణుని హర్ష చరిత్ర, అశ్వఘోషుని బుద్ధ చరిత్ర, కల్హణుని రాజతరంగిణి మొదలయిన చారిత్రిక గ్రంథాలు కొన్ని ఉన్నప్పటికీ అవి స్వీయ చరిత్రలు కావు. ప్రాచీనాంధ్ర కవులు తమ గ్రంథావతారికలలో తమ గురించి తామాశ్రయించిన రాజుల గురించి కొంత తెలిసినప్పటికీ అవి స్వీయచరిత్రలు ఏమాత్రమూ కాజాలవు.

పూర్వ కవుల గ్రంథాలను అశేషంగా అధ్యయనం కావించిన మన

జాషువగారిపై ఆ గ్రంథాల ప్రభావం పడటం సహజం. పూర్వాంధ్ర గ్రంథాలు పురవర్ణనతో ప్రారంభమౌతాయి. జాషువగారు తమ గ్రామమయిన 'వినుకొండ'ను 'నాకథ'లో విపులంగా వర్ణించారు. వినుకొండ ప్రస్తావనలో కళాప్రపూర్ణులయిన జాషువగారి నవయుగకవి చక్రవర్తిత్వం మనకు స్పష్టంగా అవగతమౌతుంది.

"నను(గాంచి పెంచి నాలో
గౌనబుం గవనంబు పాదు కొల్పిన తల్లీ !
ననుమరచిన నిను మరవను
వినుకొండా ! నీకు నా పవిత్ర ప్రణతుల్"

('నాకథ' కుశల ప్రశ్నలు 1)

వినుకొండ శ్రీ జాషువలో 'గౌనబుంగవనంబు పాదుకొల్పిన తల్లి'. కవిగారి వల్ల వినుకొండకు ప్రఖ్యాతి కలుగుతుందనే భావ్యర్థ సూచన ఇందులో ఉంది. "నను మరచిన నిను మరవను" అనే వాక్యం ఒక రసాత్మకమయిన కావ్యం. నను మరచినన్ (నన్ను నీవు మరచిపోయినా) నిను మరవను (నిన్ను నేను మరచిపోను) అని ఒక అర్థం కాగా ననుమరచిన నిను (నన్ను మరచిపోయిన నిన్ను) మరవను (మరచిపోను) అనేది ఇంకో అర్థం. ఈ పద్యపాదంలో కరుణరసం ఉంది. ఈ గ్రంథం కరుణరసాత్మకం అనే సూచన కూడా ఇందులో ఉంది. నవర్ణం పలుమారు లావృత్తికావటం వల్ల ఈ పద్యంలో వృత్త్యనుప్రాస అనే శబ్దాలంకారం, 'ననుమరచిన నిను మర వను' అనేచోట అర్థాలంకారమైన శ్లేష ఉన్నాయి. వైదర్భీరీతిలో ద్రాక్షా పాకంలో ఈ పద్యం రమ్యంగా కళాప్రపూర్ణులయిన శ్రీ జాషువగారిచే రచించబడింది. ఈ పద్యంలో ప్రసాదగుణం ప్రస్ఫుటం.

క్షేమసమాచారాలను అడిగేరీతిలో కవిగారు కవితాత్మకంగా పసందుగా వీనులవిందుగా వినుకొండ విశేషాలను వివరించారు.బాల్యంలోనే జాషువగారి ప్రకృతి సౌందర్యదిదృక్షాపేక్ష ఈ కింది సీసం వల్ల విదితమవుతుంది.

"దర్శనంబిచ్చె సీతాకోకచిల్క యె
క్కలలోన నాకు స్వర్గములగములు

కన్పట్టె నాకు నాకటివేళ మరపించు
రమ్యాలోకములు జీరంగి యందు
మెరసె నాలోన తొమ్మిది రత్నముల శోభ
నడయాడు పొన్నంగి నడక యందు
తాండవించె ననంత ధర్మాలు పలువన్నె
పికిలి పిట్టల నాఁటి వేట లోన

గడ్డిపూసలోన కాదంబములలోన
ప్రతిఫలించెనాకు ప్రణయ లతలు
కొదమనేత్రమిపుడు ముదిరి ప్రకృతిమీఁద
మోజుదప్పి మనసు బూజుపట్టె" (నాకథ పుట 23. 11)

బాల్యంలో తాము చేసిన దోషాలను శ్రీ జాషువగారు నిజాయితీతో ఒప్పుకొన్నారు.

"చేసినదోషమున్ దెలియఁజేసిన దోషము వాయు నండ్రు రా
కాసి తనంబు నం బలుఖగంబులఁ జంపితి పిన్ననాఁడు బా
ణాసనధారినై-పొడము నశ్రు జలంబులతో క్షమార్పణల్
దోసెడు పంపుచుంటి, దయతో ఖగ బంధుల కందఁజేయవే"
(నాకథ పుట 26 ప. 5)

వినుకొండలోని విహంగాలను తాను చంపినందుకు పశ్చాత్తాపపడి తమ క్షమార్పణలను వినుకొండ ద్వారా కవిగారు తెలిపారు.

"క్షేమంబేకద? నీకు నీసుతులకున్ శ్రీ కన్యకాంబా(కా)శికిన్
రామక్ష్మాపతి పాదముద్రల పవిత్రంబైన నీకొండకున్
నీ మేల్గోరెడు వాయునందనునకున్ నీ పూర్వమర్యాదలన్
సామర్థ్యంబు వచించు భాస్కరుని జీర్ణ స్వర్ణదుర్గాళికిన్.

టిప్పుసుల్తాను గట్టించిన నట్టింటి
మజ్జీదు మణికి క్షేమమ కదమ్మ?
రామలింగేశ్వరస్వామి సౌధమునందు
వెలిఁగింతు రేయ ఖండలమును దినము?

ఆరోగ్యవంతుఁడే మారుతాత్మజుఁడు ప
 శ్చిమదిశావాసి గస్తీ జనాను?
అగ్రహింపదుగదా అంకాళిదేవత
 అలఁతి సత్తులకు పెద్దక్కగారు?

తీగబావి పొంత తిష్ఠవేసిన యట్టి
కనకదుర్గ యింటిగడపఁ ద్రొక్క
తొంగిచూచువారు తొల్లి లే రిపుడైన
పలుకరింతురమ్మ పౌరజనులు (నాకథ పుట1, ప. 2,3)

వినుకొండలోని అలతిసత్తులకు పెద్దక్కగారైన అంకాళిదేవత, రామచంద్రుని పాదముద్రలచే పూతమైనకొండ, ఊరిలో పడమట గస్తీజవానుగా ఉన్న అంజనేయస్వామి, భాస్కరుని జీర్ణ స్వర్ణదుర్గాళి, టిప్పుసుల్తాను కట్టించిన మసీదు, రామలింగేశ్వరస్వామి ఆలయం, తీగబావి సమీపాన తిష్ఠవేసిన కనకదుర్గ పై రెండు పద్యాలలో పలకరించబడ్డారు. గుబ్బలమ్మగుట్టలు, సీతాకుండతీర్థం, తెల్లదొరలు శయనించిన సమాధులు, సంతర్పణలు, కురుచగోచుల దొంగలు, మొహరముదసరాలు, నెత్తుటికూటి కాల్పులు, పెసరచేలలోని నల్లనిబూబమ్మ, వల్లకాటి కిశానుదిశ, సమాధి చేయబడ్డ 'జాకి' మొదలైనవి అనేకం స్మరించబడ్డాయి. "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ" అనే సూక్తి శ్రీ జాషువ విషయంలో యథార్థమైంది.

"చెప్పికొంటిమి గండ శిలల జేగురురంగు
 సీతామహాదేవి చీరలనుచు
వాదించివా మంజనీదేవి తనయుండు
 తనయులఁ బుట్టించు దాతయనుచు
ఆశించితిమి గుబ్బలమ్మ గుట్టలవద్ద
 గజ్జెల ధనలక్ష్మి గదలు ననుచు
వాకొంటిమల్ల సీతాకుండ తీర్థావ
 నమరదంపతి స్నానమాడు ననుచు

ఔనఁనా దనలేని ప్రాయంబు నందు
మనసులో నీవు కరగిపోసిన చరిత్ర
మసలుచున్నది బురదలో మహిష మట్లు
ముదిరిపోయిన జన్మ భూమోహపటిమ

(నాకథ పుట10 ప. 3)

మనసులో నీవు కరగిపోసిన చరిత్ర, ముదిరిపోయిన జన్మభూమోహ పటిమ మసలుచున్నది బురదలో మహిషమట్లు" అనే చోట ఉన్న ఉపమ ద్వారా బాల్యంలో కట్టుకథలను ఏ విధంగా నిజమని భావించి అజ్ఞానంలో తాము ఆనందించిందీ కవిగారు తెలిపారు.

"కమ్మదనంబుతో చవులుగ్రక్కుచు బుగ్గలుదీసిపోని, నీ
నిమ్మలబావి నీరము కనిష్ఠ కుమారుల కందకగ్ర జ
న్మమ్ముల వారికే దొరుకునా? బులిపించుచు, నారికేళ పా
కమ్మునఁబడ్డ పిచ్చితలకాయల వారి కవిత్వముంబలెన్"

(నాకథ పుట 11 ప. 5)

నిమ్మలబావి నీరు అగ్రజన్ములకే లభ్యమయ్యేది కాని అందరికీ అందు బాటులో లేదని కవిగారు బాధపడ్డారు.

"నారికేళమ్మునఁబడ్డ పిచ్చి తలకాయల వారి కవిత్వ ముంబలెన్"అనే ఉపమ ద్వారా కఠిన కవిత్వం అందరికీ అందుబాటులో ఉండదనీ అందరికీ అవగతమయ్యే రీతిలో కవిత ఉండాలనీ శ్రీ జాషువగారి అభిలాష.

"భిక్షము వృత్తిగా వికృత వేషములన్ ధరియించు సోమరుల్,
కుక్షిపరుల్, నిరర్థకులు, గుప్పెడు గింజలవారు నీకుఁ బ్ర
త్యక్ష శివస్వరూపులు మహాత్ములు మంత్రవిదుల్, సుఖింతురే
దక్షిణ వీధి సత్రములు తావులుగా నగరీ వతంస సమా ?"

(నాకథ పుట 12 ప. 5)

సోమరుల్ని, కుక్షింభరుల్ని, నిరర్థకుల్ని, గుప్పెడు గింజల వారిని కవిగారు నిరసించి వీరు ప్రత్యక్ష శివస్వరూపులు, మహాత్ములు, మంత్ర

విదులుగా వినుకొండా! నీకు కనిపిస్తున్నారా? వీరిని బాగా ఆదరిస్తున్నావా? అని వ్యంగ్యంగా ప్రశ్నించారు.

పరమత సహనాన్ని అన్యభాషా మైత్రిని

"మొహరము దసరాల్ హిందూ
మహమ్మదీయుల నిసర్గమానవ ప్రకృతిన్
సహనమునుబాడుచేయక
సహవాసము గూర్చునే ప్రజా సుఖదములై"

"అరబీ కైతల సోకడల్ తురక కావ్యచ్ఛాయ లేర్పడఁగా
పరభాషా సహనం బెఱుంగని కళా పాషండ పాముషాల్
గరుగన్ దీయని గేయముల్ దెలుఁగునం గల్పించి విన్పించు ఖా
దరుఖానున్ స్మరియింతువే? కవుల ప్రస్తావంబులందేనియున్"

(నాకథ పుట 15- ప. 2,3)

అనే పద్యాల ద్వారా శ్రీ జాషువగారు ప్రకటించారు.

"గొరియల మేకల నెత్తుటి
ఖురముల నిర్ఘోషమునను జర్జరితంబై
కరిగినవి గిరులు శ్రుతగిరి
కరుగదనిన అపయశంబుగాదే మనకున్" (నాకథ పుట 16 ప.1)

అని శ్రీ జాషువగారు అహింసా ప్రాధాన్యాన్ని ప్రశంసించి విద్యాధికులు కూడా జంతుబలుల్ని గర్హించి నివారించక పోవటాన్ని నిరసించారు.

(నాకథ పుటలు 15, 16)

"ఒరులుగారుము క్తి నొనరించు ప్రభువులు
కూడు గుడ్డ గాదు కొఱత మాకు
సమతలేని రిత్తచదు వేల? పదివేల
మతము లేల ? నూరు వ్రతము లేల?" (నాకథ పు.21 ప.3)

అనే పద్యం ద్వారా నవయుగకవిచక్రవర్తి సర్వమానవ సమానత్వం అన్నిటికంటె ముఖ్యమని చాటి చెప్పారు,

'బాల్యస్మృతులు' శీర్షికలో తనను తన తమ్ముడయిన ఇస్రాయేలును రెండు కళ్ళుగా తల్లి చూచుకొనేది అనే విషయాన్ని కవికోకిల జాషువగారు కమనీయంగా తెలిపారు.

"నేను న్యాయనుజుండు దక్క, తనకున్ నేత్రాలు లేవంటకున్
నానగ్నంబగు జిహ్వ చాలదుపమానంబంచు వెన్నాడినన్
నానాడుల్ పదివేలు తీవియలుగా, నాదేహమేవీణగా
ఏనాడో సవరించి పాడితిని, మాతృశ్రీనివాసంబులన్"

(నాకథ పుట 31. ప. 2)

ఇదే శీర్షికలో 'కాజు'పిట్టను పాంథులనుంచి తానేవిధంగా దాచిపెట్టిందీ, చివరకు అది తనకు ఏ విధంగా దక్కకుండా పోయిందీ 'నీతిగీతి'ని వినిపించిందీ శ్రీజాషువగారు చక్కగా వర్ణనాత్మకంగా విశదపరిచారు.

విద్యార్థిదశలో తాముచేసిన కొన్ని కొంటెపనులను వీరు వివరించారు.

"పదనుగా చూపులబాణాలు గురిపెట్టి
విద్యార్థినులమీఁద విసరివైచి
చదివిన చదువెల్ల చాపచుట్టఁగఁజుట్టి
పంతుళ్ళ మోమునఁ బారవైచి
మాతాపితల నీతి మాటలు గుదెగట్టి
పాతాళగంగలోఁ బారవైచి
నీ మార్గమున కడ్డు నిలుచు వాఁడెవఁడైన
చెలికాండ్రఁ బురికొల్పి చిదుకఁగొట్టి

చదువుకొనవోయి ప్రణయశాస్త్ర ప్రపంచ
మధురమంజుల సాహిత్య మథన మనుచు
గట్టిగా నన్ను బలవంత పెట్టసాగె
గుండెలోఁ జేరి, యెవ్వఁడో కొంటెవాఁడు" (నాకథ పుట 47-ప5)

'నాకథ'లోని 'భాషాపరిశ్రమ'లో శ్రీ జాషువగారి భాషా పరిశ్రమ విశదీకరించబడింది. అష్టావధానశతావధానాలలోని కష్టాలు, ఛందో నిబంధనలు, పద్య రచనలోని అడ్డంకులు, ఇందులో తెలుపబడ్డాయి. జీవితం తొలి

దశలో తమకు ఎదురైన వ్యథా పూరిత ఘట్టాలను శ్రీ జాషువగారు పేర్కొన్నారు. కవిగా ఎదుర్కొన్న సమస్యలలో బ్రాహ్మణేతరులు కవిత్వం చెప్ప గూడదనటం ఒకటి. "పృథివిసురులుదక్క నితరజాతులు కైతలల్లరాదు నేర మండ్రు బుధులు" (నాకథ పుట 57-ప. 4) అనే వాక్కు కవికోకిలను బాధ పెట్టింది.

శ్రీ జాషువగారు శ్రీ పిచ్చయ్యశాస్త్రిగారు జంటకవులు కావాలను కొన్నారు. తిరుపతి వేంకటకవులవలె, వేంకటపార్వతీశ్వర కవులవలె వీరి పేర్లు జంటగా చెప్పటానికి కుదరలేదు.

"నా పేరుముందు పిల్వం
బాపంబదియేమొ జాషువా పిచ్చులగున్
నా పేరు చివరఁబిల్చిన
శాపంబిడినట్లు పిచ్చి జాష్వాలయ్యేన్" (నాకథ పు 60, ప. 2)

జాషువా పిచ్చికవులు, పిచ్చి జాషువా కవులు అనే రెండు పదబంధాలు బాగా లేవు. కాగా వీరు జంటకవులు కాక ఒంటి కవులయ్యారు.

'నాకథ' రెండో భాగంలో శ్రీ జాషువ గారు బడిపంతులుగాను, టూరింగ్ సినిమాహాలులో కథా కథకుడుగాను రాజమండ్రిలో పాఠశాలో పాధ్యాయుడుగాను అల్పవేతనంతో పని చేసి అనల్పవేదనకు గురయ్యారు. ఈ సందర్భాల్ని గుర్తు చేసుకొని కవిగారు

"ఇద్దరు సుతలుం గూరిమి
ముద్దియ మేరాంబ తోడ ముట్టెడు జీతం
బద్దెకు ముద్దుకు చాకలి
పద్దుకు సరిపోక పెక్కుపాట్లంబడితిన్" (నాకథ పుట. 75 ప. 2)

అని తమపాట్లను తెలిపారు.

ఆనాటి సుప్రసిద్ధ పండితులయిన శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారిని శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం గారిని కవికోకిల కలిసికొని తమ కవితను వినిపించి వారి ప్రశంసకు పాత్రులయ్యారు. శ్రీ వీరేశలింగం గారిని "తన మేధస్సును దేహదార్ఢ్యము సమస్తంబున్ వితంత్వాలయంబున

కున్ సాంఘిక విప్లవంబునకు సంపూర్ణంబుగా నిచ్చి" "చక్షులేటికి విజ్ఞాన చక్షువులకు" అని శ్రీ జాషువగారు ప్రశంసించారు. వీరు రాజమండ్రిలో ఉన్నప్పుడు పుష్కరాలు వచ్చాయి. చాలామంది భక్తులు పుణ్యంకోసం గోదావరిలో స్నానం చేయ సాగారు. "ఒక్క భక్తవరుని నొడిసి యెత్తుకు పోయె మొసలి యొకటి నీటమసలుచుండి, మేలుమేలు పర్వకాలానఁజచ్చుట, పున్నెమనిరి చూచుచున్నవారు" (నాకథ పుట. 89, ప. 4). పుష్కరస్నాన ప్రేక్షకుల మనోభావాలను తెలుసుకొన్న శ్రీ జాషువగారికి వారి భావనలు మూఢంగా తోచాయి. కాని మూఢ విశ్వాసాలను కవిగారు ఖండించలేదు.

"గ్రుడ్డినమ్మకాల కడ్డు చెప్పుటకన్న కొఱవితోడ గోకికోనుట మేలు" (నాకథ పు. 90 ప. 2) అని వీరికి తోచింది. 'నాకథ'లోని 'భూతపీడ'లో జాషువగారి సహధర్మచారిణికి దయ్యం పట్టినట్లు ఆదయ్యాన్ని ఒక మాంత్రికుడు పారదోలినట్లు శ్రీ జాషువ తెలిపారు. దీనిపై కవిగారి వ్యాఖ్య ఏమీ లేదు. నోట్ల కేసువల్ల గున్నేశ్వరరావుగారు ఖైదుకాగా శ్రీ జాషువగారికి రాజమండ్రితో ఋణం తీరిపోయింది. మెకాలే దొరగారి వల్ల గుంటూరులో 8 సంవత్సరాలపాటు ఉపాధ్యాయ వృత్తిని నిర్వహించి కుప్పుస్వామిగారి వల్ల 'బాపట్లబడి'కి పంతులుగా వెళ్ళి కొన్నాళ్ళకు వినుకొండకు వీరుమారారు. స్వగ్రామమయిన శ్రుతగిరిలో, విశ్రుతకీర్తి ఐన శ్రీజాషువగారికి శ్రీరమాకాంత తహసీల్దారుగారు సన్మానం జరిపించారు. ఇది కవిగారి జీవితంలో ఒక చిర స్మరణీయ ఘట్టం కాగా 'నాకథ'లో 'ఇంటిగెలుపు' పేర 6 పద్యాలు (నాకథ పుటలు 114, 115) రచించారు.

స్వీయ చరిత్ర మూడో భాగంలో వర్ణాంతర వివాహాన్ని ప్రశంసించి కట్నాలను, కానుకలను పెళ్ళిళ్ళలో వృథాఖర్చులను. శ్రీ జాషువ నిరసించారు సంఘసంస్కరణకూడా కవిత్వానికి ముఖ్య ప్రయోజనం కదా.

"పప్పన్నాలని లాంఛనంబులనుచున్ బంధుల్ కులస్వాములున్
తిప్పల్ పెట్టి ఋణాలుపైఁ బలిమి ఆస్తింబాస్తులమ్మించుచున్
జిప్పల్ చేతి కొసంగి పోయెదరు పేచీలెన్నియోపెట్టి యీ
ముప్పుం గూర్చెడు పెండ్లి పేరటపు డాబుల్వోవుటేనాటికో"

(నాకథ పు. 129 ప. 3)

శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డిగారు ముఖ్యమంత్రిగాను శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్యగారు సభాపతిగాను ఉన్న కాలంలో శ్రీ జాషువ ఎమ్.ఎల్.సి. అయ్యారు. శాసనసభ్యులపై వీరికి మంచి అభిప్రాయం లేదని

"పరిమిట్లిప్పించెదనని
ఖరుచుం బెట్టించి పంపు ఘనులుందురు పై
మెరుపుల దొరలచ్చట మో
టరు కార్లందిరుగు పచ్చి టక్కరి సభికుల్"

(నాకథ పు. 138, ప. 4)

అనే పద్యాన్నిబట్టి తెలుస్తోంది. రవర్ణం పలుమార్లు ఆవృత్తమై వృత్త్యను ప్రాసతో ఈ పద్యం హృద్యంగా ఉంది.

శ్రీ జాషువగారు అక్బరు సమాధిని చూచి

"పసిడిరేకులతో ముఖ ద్వారములకు
మెరుపులీనెడు దొడ్డ యగ్బరు సమాధి
నరసి యచ్చెరువంది తదంకికమున
పూరిగుడిసెలఁ జూచి వాపోయినాఁడ" (నాకథ పు. 140. ప. 1)

అని చెప్పిన పద్యం పేదవారి పట్ల కవిగారికి కల ఆర్ద్రభావాన్ని తెలుపుతుంది.

కంకిపాడు, కాకినాడ, గుంటూరు, ఢిల్లీ, బెజవాడ, మద్రాసు, వినుకొండ, హైదరాబాదు మొదలయిన పట్టణాలలో పద్మభూషణ జాషువగారికి సన్మానాలు జరిగాయి. కళాప్రపూర్ణులైన జాషువగారి కావ్యసంతతి కూడా దూషణభూషణ తిరస్కారాలకు లోనైంది. 'నాకథ'లోని చివరి పద్యం శ్రీ జాషువగారి వంతను తెలుపుతుంది.

"ఈదితివాఙ్మయాంబునిధినేఁబదియేడులు సర్వ పండితా
మోదముగా రచించితిని ముప్పది కావ్యము లిట్టి నీవు ని
ర్వేదము గల్గుధీఃకృతి లభించెడు దేశములోన నీకు నా
కేది శరణ్యమంచు తలయెత్తక చింతి లె కావ్యకామినుల్"

(నాకథ పు. 155, ప. 1)

కరుణరస నిర్భరమయిన రచన శ్రీ జాషువగారి 'నాకథ'.



# విశ్వనాథ సాహితీ వ్యక్తిత్వం

—చల్లా రాధాకృష్ణశర్మ

తెలుగుభాషా సాహిత్యాలు అతిప్రాచీనము లనడం నిర్వివాదం. సాహిత్యసంపద కూడా పుష్కలంగా ఉన్నది. అయితే గడప దాటక పోవడంవల్ల, అఖిలభారత స్థాయిలో రావలసినంత ప్రచారం రాలేదు. ఇందుకు ప్రధాన కారణం తెలుగు రచనలకు సమర్థములైన అనువాదాలు వెలువడకపోవడమే అనవచ్చు. అంతేకాని ప్రశస్త రచనలో, ఉత్తమ రచయితలో లేవనీ, లేరనీ ఎవరైనా భావిస్తే అది పొరపాటు తప్ప మరేమీ కాదు. ఈ సందర్భంగా నా అనుభవాన్ని తెలపడం అప్రస్తుతం కాదను కుంటాను.

ఆకాశవాణి తిరుచిరాపల్లి కేంద్రంవారు విశ్వనాథవారి వేయిపడగలు నవలలోని కథాసంగ్రహాన్ని తమిళశ్రోతలకు తెలుపవలసిందిగా కోరుతూ చాలా యేళ్ళక్రితం నాకో లేఖ వ్రాశారు. వెయ్యిపుటల ఆ గొప్ప నవలలోని కథను ఎలా సంగ్రహంగా చెప్పడమా? అని నాలో నేను తర్కించుకుని చివరికి ఆ కార్యం నిర్వహించాను 'ఆయిరంతలై నాగం' అన్న ఆ కథా సంగ్రహాన్ని ఏడువారాలపాటు ప్రసారం చేశారు. ఆ తర్వాత, అంటే 1963లో, అది పుస్తకరూపంగా వెలువడింది. పత్రికలవారికీ పాఠకులకూ నచ్చింది. ఒక తెలుగు నవలను ఆవిధంగానైనా తమిళపాఠకులకు పరిచయం చెయ్యగలిగాననే తృప్తి నాకు కలిగింది. కొన్నేళ్ళు గడిచిన తర్వాత అను కుంటాను, కనాసుగా ప్రసిద్ధుడైన కనా సుబ్రహ్మణ్యంగారు "ఆయిరం తలై నాగం" నవలను ప్రశంసిస్తూ ఒక తమిళ పత్రికలో వ్రాశారుగదా! విశ్వనాథ సత్యనారాయణగారిని గురించి నాకు అట్టే తెలియదు. ఆయన వేయిపడగలు కథ సి.ఆర్. శర్మ పుస్తకం ద్వారా నాకు పరిచిత మయింది. అది చదివిన తర్వాత విశ్వనాథ ఒక ప్రముఖ రచయిత అనీ నవలా రచయిత అనీ గ్రహించగలిగాను. తెలుగు రచనలకు తగినంత ప్రచారం ఇతర భాషా ప్రాంతాలలో లేకపోవడం వల్లనే తెలుగు సాహిత్యం గడపదాటలేక పోయిం దని తెలపడానికే యీ ఉదంతం తెలపడమయింది.

"నేను చాలా సోమరిని ... మరి నేను ఎంత సోమరిని అంటే- నిజానికి వేయిపడగలు. మా బాబు, చెలియలికట్ట, ఏక వీర వ్రాసి నవలాకారుణ్ణి అయినాను. తత్పూర్వం నేను అచ్చంగా కవిని. ఇప్పుడు చాలామంది 'ఆయన నవలాకారుడే కాని కవి కాదు' అనే వారున్నారు. ఇందులో భిన్నాభిప్రాయాలున్నాయి. తత్పూర్వం నేను వ్రాసిన కవిత్వం వారికి తెలియకపోవచ్చు. నేను వ్రాసిన కవిత్వం కవిత్వం కాదని కూడా అనుకోవచ్చు." (యువభారతి వారు ప్రచురించిన మహతిలో నేనూ- నా సాహిత్య రచనలు అనే వ్యాసం)

ఈ మాటలు కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారి వంటే చాలామందికి నమ్మకం కలగకపోవచ్చు. కవిగా, నవలా రచయితగా, నాటక కర్తగా, విమర్శకునిగా, వక్తగా ఎనలేని పేరు పెంపులు గడించిన విశ్వనాథవారు సోమరులంటే ఎవ్వరూ నమ్మరు. పై మాటలు ఆయన శతాధిక గ్రంథకర్త. సంస్కృతాంధ్రాలలో రచనలు సాగించిన సవ్యసాచి. అహరహమూ సాహితీక్షేత్రంలో వ్యవసాయం సాగించి బ్రాహ్మణ వ్యయసాయం చెయ్యక- రకరకాల పంటలు పండించిన ఉత్తమ హాలికుడు ఆయన. అందువల్లనే విశ్వనాథ సాహిత్యం వైవిధ్య విలసితమై, సుసంపన్నమై కనిపిస్తుంది, అలవోకగా పరిశీలించినా.

విశ్వనాథ వాఙ్మయ సూచిక ప్రకారం ఆయన వెలయించిన గ్రంథాల వివరం: 25 కావ్యాలు (చిన్నవీ, పెద్దవీ), 15 నాటకాలు, 57 నవలలు (కథానికా సంపుటులతో కలిపి), 9 విమర్శనములు, 8 సంపాదితగ్రంథాలు. సంస్కృతంలో కొన్ని కవితలూ నాటకాలూను. పత్రికాముఖంగా ఆయన సంతరించిన వ్యాసాలు, చేసిన సాహిత్య ప్రసంగాలు, ఇతరుల రచనలకు వ్రాసిన పీఠికలు మొదలైనవి చుబ్బనచూరలు. ఇవికాక సర్వేపల్లి రాధాకృష్ణన్ గారి కల్కి, స్వామి వివేకానందుని యతిగీతం, ఆదిశంకరుల ద్వాదశ మంజరి మొదలైన వాటిని తెలుగు చేశారు. ఈ వివిధ రచనలను స్థూలంగా పరిశీలించినా, విశ్వనాథవారు సోమరులంటే ఎవ్వరూ నమ్మరు. 1026 పుటల గ్రంథం వేయిపడగలు (10వ ప్రచురణ). సుమారు 2,200 పుటల బృహద్గ్రంథం శ్రీమద్రామాయణ కల్పవృక్షం! అలసత్వం ఆయన ప్రథమ శత్రువని నిర్ద్వంద్వంగా చెప్పవచ్చు.

ఆకృతిలో ఆలోచనలో, వేషభాషలలో ఆయన ముమ్మూర్తులా తెలుగు వాడు. తెలుగుదనంతో పాటు భారతీయత మూర్తీభవించిన ఒక సాహిత్య స్రష్ట. త్రికరణ శుద్ధిగా తాను నమ్మిన సిద్ధాంతాలను, ఇతరుల మెరమెచ్చులకో కోపతాపాలలో అనుగుణంగా, మార్చుకోడానికి ప్రయత్నించని విశిష్ట రచయిత. తనదైన వేషం, తనదైనభాష, తనదైన ఆలోచన ఆయన వ్యక్తిత్వానికి వన్నెచిన్నెలు సమకూర్చాయి.

విశ్వనాథ సాహిత్యంలో వైవిధ్యం గోచరించేలా, ఆయన శైలిలోనూ వైవిధ్యం గోచరిస్తుంది. ఒక్కొక్కసారి ఆయన రచన మధురమోహనంగా తెలుగు నుడికారానికి పట్టుగొమ్మగా ఉంటుంది. ఒక్కొక్కసారి ప్రౌఢ గంభీరంగా ఉంటుంది, కాగా ఆయన ప్రౌఢ కవిగా 'పాషాణ పాక ప్రభువు'గా ప్రథిత యశస్కులు కావడంలో ఆశ్చర్యం లేదు. ఏమైనప్పటికీ, తనకే సొంత మనదగిన ఒక విశిష్ట శైలిని ఆయన సంతరించుకున్నారు. ఇది ఆయన గద్య రచనకు ముఖ్యంగా వర్తిస్తుంది. వచన రచన ప్రౌఢం కాకపోయినా తత్తుల్యంగా కనిపిస్తుంది. తెలుగు పలుకుబడి ఆయన వచన రచనకు— అందులోనూ కథలకు నవలలకు- సహజత్వంతో పాటు సజీవత్వమూ ప్రసాదించింది. చిన్నచిన్న వాక్యాలు. గ్రాంథికంలో సాగినా వ్యవహారిక శైలికీ సన్నిహితంగా కనిపిస్తుంది. ఒక్కమాటలో చెప్పాలంటే గ్రాంథిక వేషం వేసుకున్న వాడుక తెలుగది!

విశ్వనాథ అనగానే నాకు ఓం ప్రథమంగా స్ఫురణకు వచ్చే రచన ఆంధ్ర ప్రశస్తి. ఇందులోనూ ఆంధ్ర పౌరుషంలోనూ అచ్చమైన ఆయన ఆంధ్రాభిమానం గూడుకట్టుకుంది. ఆంధ్ర రాజ్యముల పేరు చెపితేనే చాలు ఆయన హృదయం చలిస్తుంది; చిత్తవృత్తి ఆర్ద్రి మవుతుంది. కనకనే తెలుగు మాగాణమును పునీతం కావిస్తున్న జీవనదుల్ని పురస్కరించుకుని ఆంధ్ర ప్రశస్తిని తేటతెల్లం చేసిన తీరు చిరస్మరణీయం. ఆ పాత మధురమైన ఈ పద్యం అందుకు ప్రబల సాక్ష్యం.

'గోదావరీ పావనోదార వాః పూర
మఖిల భారతము మాదన్న నాడు

తుంగభద్రా సముత్తుంగరావము తోడ
    కవులగానము శ్రుతి గలయునాడు
పెన్నానదీ సముత్పన్న కైరవదళ
    శ్రేణిలో తెన్గు వాసించునాడు
కృష్ణాతరంగ నిర్ణిద్ర గానము తోడ
    శిల్పమ్ము తొలిపూజ సేయునాడు
అక్షర జ్ఞాన మెరుగదో ఆంధ్రజాతి ?
విమల కృష్ణానదీ సైకతముల యందు
కోకిలపు బాట పిచ్చుక గూండ్లుకట్టి
నేర్చుకొన్నది పూర్ణిమానిశలయందు'

తెలుగు నదులేకాదు, తెలుగు రాజులే కాదు, తెలుగు ఋతువులు సైతం విశ్వనాథ వారిని బహుధా ఆకర్షించాయి. ఆయన కవితలో మెట్టపొలాల మిసమిసలే కాక వేసవికాలపు రుసరుసలుసైతం కొట్టవచ్చినట్లు గోచరిస్తాయి. దండెం మీద ఆరవేసిన గుడ్డ కొంగుజారి కిందఉన్న సెగకు అంటుకుందట; దొడ్లో పొయ్యార్పగా అందులో ఏమూలనో మిగిలిన తవ్వగాలికి రగిలి పైకెగసిందట; దృష్టి తీసి మంటలో వెయ్యగా అందులోని మిరపతొడిమ మిలమిలా పేలి చూరు తాకిందట! ఇవన్నీ పరశురామ ప్రీతికి హేతువులు. నిశితమైన పరిశీలన విశ్వనాథ వారి రచనకు జిగినీ బిగినీ ప్రసాదించినదనడం సత్యసూక్తి. ఆయన వర్ణన సహజసుందరంగా ఉంటుంది. సహజ సౌంద ర్యంతోపాటు తెలుగు పలుకుబడి, మన ఆచారవ్యవహారాలను సందర్భానికి అనుగుణంగా మలచుకుని వివరించే ఆతీరు ఆయన రచనలను ఒక విశిష్టత సమకూర్చిందని నిస్సంశయంగా పేర్కొనవచ్చు. ఇంత ఆంధ్రాభిమానం ఉండడం వల్ల కాబోలు తెలుగు 'పరమోదాత్త సహజశక్తిగల' భాషగా ఆయ నకి గోచరించింది. వట్టిమాట కాదిది: గట్టిమాటే. విశ్వనాథ వారి తెలుగు భాషాభిమానమూ తెలుగు దేశాభిమానమూ, విశేషించి భారతీయ సంస్కృతి పట్ల గల ఆదరభావమూ, పేర్కొనదగినవి.

విశ్వనాథ గేయరచనలలో కోకిలమ్మ పెళ్ళి ఒకటి. కాని ప్రతుర ప్రచారం పొందిన రచన కిన్నెరసాని పాటలు, నదికి మనుష్యత్వం

ఆపాదించి కమనీయ కథను కల్పించడంలో విశ్వనాథ ప్రతిభ రెక్కలు విప్పు కుంది. ఆయన పేరు వినగానే కొందరికి కిన్నెరసాని పాటలే గుర్తుకి రావ డానికి ఇదొక కారణం కావచ్చు. గానానుకూలత, భాషా సారళ్యం గేయానికి ముఖ్యంగా ఉండవలసిన లక్షణాలు. ఇవేకాక భావగాంభీర్యం కూడా ఆయన రచనలో కానవస్తుంది. తెలుగు నుడికారపు సొంపు సరేసరి. ఇది ఆయనకి వెన్నతో పెట్టిన విద్య అనడం సాహసం కాదు.

కోకిలమ్మ పెళ్ళిలోంచి ఒకటి రెండు గేయాలు:

వానలన్నీ వెనుక పట్టి
కోనలన్నీ నీరు పట్టి
ఆకు రాలే కారు కూడా
అగి పోయిందీ.

చిన్న మొగమున కుంకు మిడినా
కన్నె పేరంటాలి మల్లే
చెలువుగా అడివంత క్రొత్తగా
చివురు తొడిగిందీ.

గోధుమావన్నె త్రాచల్లే
కొబ్బరి పాలల్లే అడవీ
చిన్నపూటా వొదగి వొదగి
చెన్ను వొలికిందీ....

ఆయన కావ్యాలెన్నో వెలయించినా, విశ్వనాథ సాహిత్యంలోనే కాక తెలుగు రామాయణాలలోనూ శ్రీమద్రామాయణ కల్పవృక్షం ఒక విశిష్ట రచనగా భావించబడుతోంది. 1934లో ప్రారంభమైన ఆ మహాగ్రంథం 1962లో పూర్తయింది. సుమారు మూడు దశాబ్దాలపాటు సాగిన రెండు వేల నూట ఎనభైతొమ్మిది పద్యాల బృహద్రచన మది! ఇతర రామాయణ కవుల వలె విశ్వనాథవారు కూడా వాల్మీకాన్ని అనుసరించినా, కథాసంవిధానంలో కొంత స్వాతంత్ర్యం వహించారు.

కల్పవృక్షంలో నాకు నచ్చిన ఘట్టాలలో ఒకటి శబరీ ఖండం. శబరిని

భక్తిరసపు ముద్దగా ఆయన అభివర్ణించారు. ఆమె శిరస్సు, "నివ్వరి వెన్నుల యట్లు ముగ్గుబుట్ట" వలె ఉందట. అది చూచి, అలా ముగ్గుబుట్ట కావడానికి కారణ మేమిటని రాముడు అడగ్గా-

"ప్రభువ ! నీయాత్మవాకిట రంగవల్లి
నించుటకు నింతగాగ పండిన ..."

దని శబరి సమాధానం చెపుతుంది. ఈ పాదద్వయంలో అనల్పమైన ఆమె భక్తిభావం కళ్ళకు కట్టినట్లు కానవస్తుంది.

తాను తెచ్చినపళ్ళు తినమని శబరి రాముణ్ణి ప్రార్థిస్తుంది.ఈనట్టడవిలో నన్ను నిలబెట్టి పళ్ళు తినమంటే ఎలా ? అని రాముడు కొంచెం తటపటా యిస్తాడు. నిత్యపవిత్రమూర్తి వయిన నీ కెందుకయ్యా, స్నానాదులు-అంటూ యిలా చెపుతుంది శబరి.

"చేతులునికిబూలు తెచ్చితిని స్వామి
చెట్లు కలవని పండ్లు తెచ్చితిని స్వామి
సతనువగుటను నేను వచ్చితిని స్వామి
చిత్త ముండుట నూహ చేసితిని స్వామి
నాదు ప్రాణములను నీకు మీదు కట్టి
నాదు నీవయి యిటు వచ్చినావు స్వామి
మ్రొక్కు చెల్లింతు, స్వీకరింపుము .."

శబరి ప్రదర్శించిన భక్తిభావం విశ్వనాథవారిని ఎంతగానో అల రించింది. నిజమే మరి! ఆమె సామాన్యురాలా ? రాముడంతటివాడే ఆమె యిచ్చిన ఎంగిలి పళ్ళని ఆరగించినట్లు మన విశ్వాసం. రాముని సమక్షంలో పునరావృత్తి రహితపదం పొందిన ఆ భక్తురాలిని ప్రశంసిస్తూ 'ఎంతని నే వర్ణింతును శబరీ భాగ్య'మని పేర్కొన్నాడు త్యాగరాజు వంటి ప్రసిద్ధ వాగ్గేయకారుడు !

విశ్వనాథ వాఙ్మయ సూచికా సంపాదకులు చెప్పినట్లుగా, "ఆయన రచన లన్నింటిలోనూ ఎడపెడగా విమర్శనకు విషయమైనది శ్రీమద్రామా యణ కల్పవృక్షము. ఆయన మహాకవి యన్నవారికిని అదే ఆధారగ్రంథము

కాదన్నవారికిని అదే ఆధార గ్రంథము." వాదోపవాదాల సంగతి ఎలా ఉన్నా, శైలి కొన్నిచోట్ల మరీ ప్రౌఢంగా కనిపించినా, ఇతి వృత్తం కథా సంవిధానం మొదలైనవాటిని పురస్కరించుకుని చూసినప్పుడు శ్రీమద్రామాయణ కల్పవృక్షం విశ్వనాథ సాహిత్యానికి తలమానికమని చెప్పడం సముచితం. తండ్రి ఆనతి, జీవుని వేదన- ఆ మహా రచన వెలువడడానికి కారణము లైనాయి.

చిన్నవీ పెద్దవీ కలుపుకుని దాదాపు అరవైదాకా ఆయన నవలలు వ్రాశారు. కొన్ని సాంఘికాలు, మరికొన్ని చారిత్రకాలు, కాశ్మీర, నేపాళ చరిత్రలు కూడా ఆయన్ని బహుధా ఆకర్షించాయి. కల్హణుని రాజతరంగిణి వంటి చారిత్రక గ్రంథాలను పురాణాలను సంప్రతించారు. కలాది విషయములలో కల్హణుడు పొరబడినట్లు ఆయన అభిప్రాయం. "చరిత్రలోని ప్రధానాంశములను వదిలిపెట్టలేదు.... ఇన్ని నవలలలో చరిత్రాంశములను తీసివేయ, కథలన్నియు నేను కల్పించినవే. వందలాది విలక్షణమైన పాత్రలు నేను సృష్టించినవే" అని కూడా ఆయన ఆత్మప్రత్యయంతో పేర్కొన్నారు. తమిళంలో చారిత్రక నవలలు వ్రాసి చిరయశస్సు గడించిన 'కల్కి' రా.కృష్ణమూర్తి వలె, విశ్వనాథవారు తెలుగులో చారిత్రక నవలా సాహిత్యాన్ని సుసంపన్నం చేశారు; లబ్ధ ప్రతిష్ఠులూ అయ్యారు.

ఈ సందర్భంగా, మనదేశ చరిత్రను పునః నిర్మించవలసిన అవసరం ఉన్నదని మన చరిత్రకారులు విశ్వసిస్తున్న విషయాన్ని ప్రస్తావించడం అప్రస్తుతం కాదు. భారతదేశానికి సముద్రమార్గం కనుగొన్న వాస్కోడగామా విషయంలో ప్రస్తుతం ప్రచారంలో ఉన్న అభిప్రాయాన్ని పరిశీలించవలసిన అగత్యం కలదంటూ ఒక చరిత్రకారుడు ఆమధ్య కోజికోడ్‌లో జరిగిన ఇండియన్ హిస్టరీ కాంగ్రెసు తాలూకు 37వ సమావేశంలో ఉద్ఘాటించిన విషయాన్ని విస్మరించకూడదు. అటువంటప్పుడు భారతదేశపు అతి ప్రాచీన చరిత్రను గురించి భారతీయ చరిత్రకారుల అభిప్రాయాలకూ పాశ్చాత్య చరిత్రకారుల అభిప్రాయాలకూ మధ్య వైరుధ్యం కనిపించడంలో వింతలేదు. కనుక విశ్వనాథవారు పేర్కొన్న చారిత్రకాంశాలు సహేతుకములనీ కావనీ పర్యాప్తంగా పరిశీలించకుండా చెప్పడానికి ప్రయత్నించడం అసమంజసం.

చారిత్రకాంశాలు ఎలా ఉన్నప్పటికీ, ఆయన నవలలు ఒకదానివలె మరొకటి ఉండకపోవడం ఒక గొప్ప విశేషం. అది ఆయన రచనాశక్తినీ భాషా వైదుష్యాన్నీ చాటుచున్నది. ఆయనే పేర్కొన్నట్లుగా, "నా పద్యప్రపంచక మెటువంటిదో నేను నిర్మించిన గద్యప్రపంచకము నట్టిదే. ఎంగిలికూడు లేదు." దీన్ని స్వాతిశయంగా భావించకూడదు. ఆయన ఆత్మవిశ్వాసానికి అది మచ్చుతునక!

ఆయన ప్రకటించిన పద్యాల సంఖ్య సుమారు ఇరవేలనీ, చించివేసి నవి యాభై వేలనీ ఆయనే పేర్కొన్నారు. "నేను సుకుమారంగా వ్రాసినానరే, మధురంగా వ్రాసినానరే, పద్య రచనలో జిగి తప్పదు, ప్రౌఢి తప్పదు. జిగిబిగి గల కావ్య రచన సాగించిన మహాకవి ఆయన!

విశ్వనాథ సాహిత్యానికి వైశిష్ట్యం కలగడానికి ప్రధానకారణం ఆయన కావించిన పాత్ర సృష్టి అని నా నిశ్చితాభిప్రాయం. ఆధునికాంధ్ర సాహిత్యం లో పాత్రలు సృష్టించిన రచయితలు పలువురు లేరనడం సత్యసన్నిహితం. ఆయన ఉపజ్ఞకిది నిదర్శనం. పాత్ర సృష్టి చేసి పరిపోషించడంలోనే ఒక రచయిత ప్రతిభ ద్యోతక మవుతుంది. చారిత్రక నవలల్లో ఆయా పాత్రల ద్వారా ఆనాటి వాతావరణాన్ని పాఠకుల మనోనయనం ముందు నిలప గలిగిన వాడే ఉత్తమ చారిత్రక నవలా రచయిత. ఈ విషయంలో ఆయన సిద్ధహస్తుడు. ఆ నవలలు చదువుతుంటే అప్పటి వాతావరణంలో సంచ రిస్తున్న అనుభూతి కలుగుతుంది.

ఇకపోతే వేయిపడగలు, ఏకవీర, చెలియలికట్ట మొదలైనవి ప్రచుర ప్రచారం గడించిన నవలలు. వేయిపడగలు ఒక చిన్న విజ్ఞాన సర్వస్వం. అందులో ఎన్నో విషయాలు ఉదాహృతాలు. పాతలో ఒక నమ్మకం, అదే సమయంలో కొత్తలో ఒక మోహం- ఈ రెంటికీ జరిగిన సంఘర్షణను ఈ నవలలో చూడవచ్చును. ఆకృతిలో చిన్నదయినా, అంతస్తత్వంలో గొప్ప నవలగా భావించబడుచున్నది ఏకవీర, స్వర్గానికి నిచ్చెనలు నవలలో ఆస్తికులమని భావించే వారి వంచన వివరించబడింది. మ్రోయు తుమ్మెద హిందూస్తానీ సంగీతానికి సంబంధించిన రచన. వీటిని అలవోకగా పరిశీ లించినా, ఇతివృత్త వైవిధ్యాన్ని గమనించవచ్చు.

నర్తనశాల, అనార్కలీ, అంతా నాటకమే, కావ్య వేద హరిశ్చంద్ర

ములు మొదలైన నాటకాలు కూడా ఆయన సంతరించారు. విశ్వనాథలేఖిని నుంచి సాహిత్య విమర్శ గ్రంథాలు, మౌలికమైనవి, వెలువడ్డాయి. నన్నయ గారి ప్రసన్న కథా కవితార్థయుక్తి, అల్లసానివాని అల్లిక జిగిబిగి, కావ్య పరిమళము వంటి గ్రంథాలు సుమారు పది రచించారు.

నాకు తెలిసినంతవరకూ విశ్వనాథవారి వలె, అపారమైన సాహిత్యాన్ని సృష్టించిన రచయితలు భారతీయ సాహిత్యంలో పలువురు వేరు. అంతేకాక తాను నమ్మిన సిద్ధాంతాలను మొగమాటము లేకుండా ఆయన తెలియజేశారు. ఆయన సత్యనిష్ఠ కిది తార్కాణం. అయితే ఆ సిద్ధాంతాలు కొందరికి నచ్చక పోవచ్చు. ఎలా వ్రాసినా, సమకాలికులు మెచ్చుకోరనే అభిప్రాయం ఒకటి ఉన్నా, రసహృదయులైన సద్విమర్శకులు కొందరైనా ఉంటారు. విశ్వనాథ సాహిత్యం అపారమయింది కనుక, సద్విమర్శలు వెలువడవలసిన అగత్యం ఎంతైనా ఉన్నది. అంటే, ఆయన అభిప్రాయాలను యథాతథంగా ఆమోదించమని కాదు నా అభిప్రాయం. సద్విమర్శలు వెలువడినప్పుడే ఆయన సాహిత్య సంపదకు సరి అయిన విలువ కట్టడానికి వీలు కలుగుతుంది.

'ఒక జాతి జాతీయతకు సంప్రదాయమ్ము ప్రాణభూతమ్మది ప్రాణశక్తి' అని త్రికరణశుద్ధిగా విశ్వసించిన సంప్రదాయ వాది విశ్వనాథ సత్యనారాయణ గారు.

ఆయన సాహిత్య సంపదలా, ఆయన పొందిన గౌరవాలు కూడా అపారం. భారత ప్రభుత్వం ఆయన్ని పద్మభూషణుని చేసింది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఆస్థానకవిగా గౌరవించింది. విశ్వవిద్యాలయాలు సముచితరీతిని సమాదరించాయి. సాహిత్య సంస్థలు, చిన్నవీ పెద్దవీ, సన్మానించాయి. కేంద్ర సాహిత్య అకాడెమీ ఆయన్ని విశిష్ట సభ్యునిగా (ఫెలో) ఎన్నుకుని గౌరవించింది. అకాడెమీ ఒక భారతీయ రచయితకు చేసే అత్యున్నత సత్కారమిది. భారతీయ జ్ఞానపీఠ్ వారి పురస్కారం పొందారు. ఇక ఆయన పాఠకులా ! కోకొల్లలు- నిజానికి ఒక రచయిత సిరిసంపదలు అతని స్థిర చరాస్తులు కావు. రసహృదయులైన పాఠకులే రచయితకు నిజమైన ఆస్తి. విశ్వనాథవారు అక్షరాలా ఆస్తిపరులు! ఆ కవిసమ్రాట్టుకి, ఆ ప్రతిభాగరీయస్సునికి శతజయంతి సందర్భంగా నమోవాకములు!

—శ్రీ చల్లా రాధాకృష్ణశర్మ

# 'జాషువా ముంతాజ మహలు కావ్యసౌందర్యం'

—డా॥ జి.వై. ప్రభావతీదేవి

"జయంతి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః
నాస్తి తేషాం యశఃకాయే జరామరణజం భయమ్"

జాషువా మహాకవి శతజయంతి సంవత్సరమిది. ఆ మహాకవిని సంస్మరించుకుని నాలుగుమాటలు నేను కూడ చెప్పగల్గే సదవకాశాన్ని నాగార్జున విశ్వవిద్యాలయాధికారులు ముఖ్యంగా తెలుగు శాఖాధిపతులు కల్పించినందుకు నా కృతజ్ఞతలు.

తెలుగు సాహిత్యానికి వెయ్యేళ్ళ పద్య వారసత్వం ఉంది. తెలుగువారికి పద్యరచన వెన్నతో పెట్టిన విద్య. తెలుగు పద్యానికి అద్భుతమైన లయ గతులు, చేతన ఉన్నా వెయ్యేళ్ళుగా వెయ్యివిధాలుగా ఆ సౌందర్యాన్ని ఉద్దీపింప జేసారు మన కవులు. నన్నయ, తిక్కన, శ్రీనాథుడు, పోతన, పెద్దన, సూరన ఇంకా అనేకమంది కవీశ్వరులు తెలుగుపద్యానికి అనేకానేక సోయగాలు చేకూర్చారు. ఈ శతాబ్దిలోనూ అటువంటి మహాకవులున్నారు. అట్టి తెలుగు సాహిత్యాంబరాన జాషువా పదహారు కళల పరిపూర్ణ చంద్రుడు. ఆయన పద్యం పండువెన్నెల.

పద్యరచనా శైలిలో జాషువా సాధించిన సరళత అమోఘమయినది. ఆయన వ్రాసిన వందలకొద్ది పద్యాలలో తెలుగుభాష ఆయన ఆదేశానుసారం నడిచింది. ఆయన ముద్ర తెలుగు పద్యంపై ఎంతగా పడిందంటే, పద్యం చదవగా పండితులు కానివారు సైతం "ఇది జాషువాగారి కవిత అని భావిస్తారు. అంతగా సమకాలీన జనజీవన భాషావేగాలను ఆయన అందుకున్నారు.

తెలుగుజాతి మసిపాతలో దాచుకున్న మాణిక్యం జాషువా. అదృష్ట

వశాత్తు ఆ పాతపేలికల్లోంచి బయటపడి ఆ మాణిక్యం ఆధునిక తెలుగు సరస్వతి మకుట మాణిక్యమయింది. ఈ మధుర కవి మనసు మధురం, నిర్మలం. తన దేశాన్ని, తనజాతిని, తన సాహిత్యాన్ని ఎంతో ప్రేమించి, ఆమెకు సంస్కారాలనూ క్షమించివేశారు. జాషువా పద్యాలు చదువుతూంటే అరమ్యతకు, సౌందర్యానికి ముగ్ధులైన పాఠకులు ఇతడొక శాపగ్రస్త గంధర్వుడని భావిస్తారు. ఆయన పద్యాలలోని సొగసులను, శ్రావ్యతను మెచ్చిన మాన్యులు, కవిశేఖరులు చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి "జాషువా! నీ కవిత్వమ్ము భేషభేషు" అని ప్రశంసించారు, జాషువా కవికి స్వయంగా గండపెండేరం అలంకరించారా మహానుభావుడు. ఇది చాలు. ఇక గజారోహణము, బిరుదులు, సత్కారాలు లెక్కలోనికి రావు.

జాషువా రచనలు కరుణరస ప్లావితాలైనా "ముంతాజమహాలు" కావ్యం ఒక విశిష్టతను సంపాదించుకొంది. చారిత్రకేతివృత్తాన్ని గైకొని కమనీయ కల్పనతో జాషువా రచించిన ముంతాజమహలు కరుణరసకావ్యంగా పలువురు పండితుల ప్రశంసల నందినది. షాజహాను ముంతాజుల అన్యోన్యానురాగం అమరం, "ఏకోరసః కరుణఏవ" అన్న ఆభాణకానికి ఆనవాలు ముంతాజమహాలు.

తాజమహల్ భారతీయ శిల్పఖండాల్లో అత్యద్భుతమైనది. ప్రపంచ ప్రఖ్యాతి పొందిన ఈ కట్టడం పేరు విన్నంతమాత్రానే ఈ సుందరమందిరం యొక్క తెల్లని ఆకృతి కన్నుల ముందర నిలుస్తుంది. ఎంతో ప్రాచీనమైన కట్టడాలను సైతం మరపింపజేసే పాలరాతి మహలు ఈ తాజమహాలు అత్యంత అపురూపమైనది.

కవిచక్రవర్తి జాషువా తాజమహాలును చూసి ఎరుగని ఈ విషయాన్ని ముంతాజమహాలు భూమికలో వివరించారు."తాజమహాలు సౌందర్యాకర్షమున బొడమిన యావేశమే నన్నీ కావ్యరచనకు బురికొల్పినది. కవితాజగత్తున నా యూహకొదవిన దృశ్యమే యిందు వర్ణితము".

మయూర సింహాసనాన్ని అధిష్ఠించి ప్రజారంజకం పరిపాలించిన మొగలాయీ నవాబులలో ప్రఖ్యాతుడైన షాజహాన్ వాదుషాకు త్రిభువన

సుందరిైన ముంతాజమహలు బహిఃప్రాణమగు వలపుటిల్లాలు. రసిక హృదయుడైన పాదుషా హృదయం కళలకు పుట్టినిల్లు. కళాపోషకుడైన ఈ నవాబు కులవిద్వేషాలు ఎరుగక, మతభేదాలను పాటింపక పరిపాలన చేస్తూ తండ్రికి తగిన తనయుడిగా ప్రఖ్యాతి పొందాడు. భారతీయ శిల్పసముద్ధరణ చేయడమేకాక పారశీ, అరబ్బీ భాషా కవిపోషణలోనూ రసజ్ఞుడిగా విఖ్యాతి పొందాడు. ఇంటను పురాతన రత్నసింహాసనాన్ని అవలకు నెట్టి అనంత రత్నశోభలు వెలుగొందు మయూర సింహాసనాన్ని నిర్మింపజేసి దానిపై కొలువుతీరుస్తూ ఉండేవాడు. మొగలాయీ చక్రవర్తులలో కెల్ల అత్యంత రసజ్ఞుడు, కళాపిపాసి పాదుషా. నిర్మల చరితుడుకూడ.

గుడిగడి సేవింపడు పా
ల్పడఁడు మజాసేయు మత్తు వస్తువులకు న
య్యెడయుడు పరికింపకు పెర
పడంతుకల నెఱపు నేకపత్నీవ్రతమున్.

మక్కామసీదునకు అధికధనం అర్పించి నిత్యం ఖురానులో చెప్పిన ప్రకారం ఆచరించే నిర్మలచిత్తుడు. ముంతాజమహలు సౌందర్యం అసమానమై కవివర్ణనలకుగానీ, చిత్రకారుల కుంచెలకు కానీ కానీ అందక ఎల్లవేళల పతిస్నిగ్ధ హృదయాన్ని అలరిస్తూ ఉండేది.

ఈ వివరణల తర్వాత షాజహాను సాంసారిక జీవితం, అతడు ముంతాజమహలుతో గడిపిన మధురక్షణాలు, వారి పదముగ్గురు సంతానం, ముంతాజ్ సౌందర్యం కళ్ళకు కట్టినట్లు వర్ణించారు జాషువా.

"పలువురు బిడ్డలు చుట్టుం
బలసి కొలువ మధుర మధుర బాహుకావ్య విభూ
షల నొప్పు శారదాంగన
వలె భారతరాణి నేత్రపర్వము సేయున్.

రత్నరుచులీను యవన సామ్రాజ్య రమకు
నగలు గీలించు రాణి సౌందర్యలహరి
ప్రభువు కన్నులు దాటి యావలికి రాదు
వలపు లూరింపకుండ నవ్వలికిఁ బోదు"

పదునాలుగో సంతానంతో ప్రసవవేదన శీతజ్వరమూ మహారాణిని బాధించనారంభించాయి. దానికితోడు పీడకల, దుశ్శకునాలు. స్త్రీ సహజమైన వెరపుచే ఆమె పెనుశోకమూర్తి అయింది. శోకమనే మాటకు అర్థం తెలియని ఆమె కన్నుల నుంచి ముత్యాల్లా కన్నీరు జాలువారింది. శత్రువుల ప్రాణాన్ని హరించగల చక్రవర్తి అయినా భార్యకు ప్రాణదానం చేయలేడు గదా!

"దాయమన్నీల ప్రాణముల్ దీయఁగలిగి
యీయలేడయ్యె నిజభార్యకాయువులను
చండశాసనుఁడగు మహాచక్రవర్తి
ఆత్మకధికారి గాఁడు న్యాయ్యంబుగాను."

ముంతాజ్ సంతానాన్ని దగ్గరకు తీసికొని గద్గద స్వరంతో పాదుషాకు బుద్బుదప్రాయమైన జీవితం అశాశ్వతమని, ఇచట ప్రేమలు క్షణికాలని, మరణం ప్రతిజీవికి తప్పదని తనకై విలపింపవద్దని చెప్పి కనులు మూసింది. ముంతాజమహలు మరణానంతరం రాణివాడ శోక సముద్రంలో మునిగి పోయింది. ఏకాకియై చక్రవర్తి షాజహాను తన రాణియగు ముంతాజమహలు గుణగణాలను, పాతివ్రత్యాన్ని-విశ్వసనీయతను మనసున తలచుకొని మిక్కిలి శోకతప్తుడయ్యాడు. చతురంగ బలసంపన్నుడు షాజహాను జీవితంలో ప్రప్రథమంగా భయకంపితుడయ్యాడు. నెమలిసింహాసనం, కోహినూరు వజ్రం మొదలైన అమూల్యమైన నిధులన్నీ అర్థరహితమై పోయాయి. జీవ రత్నమైన ముంతాజ్ గతించిన పిమ్మట అతడూ జీవచ్ఛవమైనాడు. పందొమ్మిది సంవత్సరాల దాంపత్య జీవనం ఆనాటితో అంతమైనందుకు మిక్కిలి వగచాడు. వగచి, వగచి తన అరవప్రాణమైన ముంతాజమహలు కడసారి మాటకు రూపకల్పన చేఁయ సమకట్టాడు.

ఆ దేశంలో ఒక నిర్భాగ్యుడు తనప్రియపత్నిని కోల్పోయి వియోగ వ్యథచే శ్మశానంలో పిచ్చివానిలా తిరుగుతూ అక్కడి బూడిదను ముద్దలు చేసి సమాధి బొమ్మల నమూనాలను చేస్తూ ఉండేవాడు. వాటిలో ఒకటి శిల్పరమకు సిగపూవులు అందంగా అతని కళాహస్తా నుండి ఆవిర్భవించింది. అందమైన ఆ నమూనాను చూడగానే ఆ వియోగి హృదయంలో అట్టి సమాధిని నిర్మించి తన ప్రణయదేవికి అంకితం చేయాలని కోరిక కలిగింది.

ఆ నమూనా చేతబట్టుకొని ఊరూరా భిక్షార్థం తిరుగుతూ తన కోర్కెను తెలుపుతూ వచ్చాడు. ఒక శిల్పి ఆ నమూనాను చూచి ఆశ్చర్యచకితుడై దానిని తీసికొని పాదుషాకు చూపించాడు. అందలి మనోజ్ఞతకు, భావసంపదకు చక్రవర్తి ముగ్ధుడై ఆ నమూనాను చేసి శిల్పిని రాజసభకు పిలిపించి మంత్రులు తాను ఎదురేగి తెచ్చి సగౌరవంగా సన్మానించాడు. పాదుషా సన్మానాన్ని కాతడు సంతోషించి చక్రవర్తి ఔదార్యసంపదను, కళాభిరుచిని ప్రశంసించి తన కిచ్చిన బహుమానాలు కళాసరస్వతీ దాసులకు పంచిపెట్టమని పలికి భార్యా వియోగియగు రాజునకు తన సానుభూతిని తెలుపుతూ మళ్ళీ పాదుషాకే ఆ సంపదను ఉడుగరగా ఇచ్చి వెళ్ళిపోయాడు.

"మొగలు నవాబు శేఖరుల పూజ్యసభాంతరమందు సత్కళా
జగమున నా పరిశ్రమ ప్రశంసితమయ్యె పసిండి పూజల
దిగులు సగంబు దీరె గరుణించి పరిగ్రహమాచరింపు డీ
నగదును క్రమ్మరం దమఘనంబునకు న్నజరాన వెట్టుదున్".

షాజహాను తన ప్రేయసి అమలిన ప్రేమకు చిహ్నంగా అమరమైన, అపూర్వమైన కట్టడాన్ని నిర్మించడానికి పలుదేశపు వాస్తు శాస్త్రజ్ఞులను, శిలలకు ప్రాణంపోయగల శిల్పులను రప్పించి పాలరాతిఫలకాలపై కార్మికుల కర్మజలంతో, ఘర్మజలంతో ప్రేయసి సమాధిపై ఒక మహలును నిర్మాణం చేయించాడు. అదే తాజమహలు. మహలుకు నలుదెసలా ఉద్యానవనం సుందరంగా తీర్చిదిద్ది రాజు తాజమహలు తేజస్సు ద్విగుణీకృతం చేయించాడు.

"తాకినఁ గందునోయను విధంబున ఱాలకు సొకుమార్యపు
బోకడలద్దు నేర్పరులు ముప్పది ముగ్గురు శిల్పులాత్తతో
కైక చమత్కృతుల్ బొదిగి యిర్వదియేండ్లు శ్రమించి భారత
ప్రాకృత శిల్పసంపదకుఁ బ్రాణము వోసిరి శాశ్వతంబుగన్"

ఒకవైపు యమున మరొకవైపు సరోవరం.

తాజ్ లావణ్యం యాభైఆరు వర్ణాలుగల తెలుగు. తెలుగు భాషకు సాధ్యం కాదంటే తదితర భాషలకు సాధ్యమవుతుందా? అని కవి చమత్కరించారు. ఖురాను నుంచి ముఖ్యమైన సూక్తులను, 'కలదే స్వర్గము లాతిచో

కలుగ నిక్కంబిద్దియే నీతిమంతుల విశ్రాంతి నికేతనంబు' అనెడి పంక్తులను నవాబుశేఖరుడు ద్వారబంధాలపై అతి సుందరంగా చెక్కించాడు.

పాదుషా వైభవం, వారి అనంత పరిమళాలు, వారి అనుకూల దాంపత్య ప్రణయ గంభీర గీతాలు, విరహవేదనతో డ పాదుషా భగ్న హృదయం అన్నీ కలసి నేటికీ తాజి కుడ్యాలమీద సాక్షాత్కరిస్తున్నట్లు కవి వర్ణించాడు.

పాదుషా కడగొట్టు కుమారుడైన ఔరంగజేబుని వర్ణనకూడ ఈ కావ్యంలో ఉంది. ఔరంగజేబు తండ్రిని చెరసాల యందుంచిన తీరు పరోక్షంగా షాజహాను కళారాధనను, ఔరంగజేబు హింసాకాండను వర్ణించి తాజమహలుకు, షాజహానుకు అపారమైన కీర్తి తెచ్చిపెట్టారు. నవయుగ కవి చక్రవర్తి జాషువా.

సనాతన భారతీయ గార్హస్థ్య ధర్మవైశిష్ట్యాన్ని ఆదర్శంగా గ్రహించి జాషువా ఈ కావ్యంలో ముంతాజు షాజహానుల దాంపత్యాన్ని వ్యాఖ్యానించాడు. సనాతనమూ పవిత్రమూ ఆదర్శప్రాయమూ అయిన భారతీయ గార్హస్థ్యధర్మాన్నే ఈ కావ్యంలో అతడు 'ప్రథిత సంసార రాజమార్గము'గా స్థిరీకరించినాడు. ఆ పవిత్ర ప్రణయ సందేశమునే ఈ కావ్యం ద్వారా జాషువా దంపతి లోకానికందించారు.

నూర్జహాన్‌గా ప్రసిద్ధిపొందిన మెహరున్నీసాకు మేనగోడలు ముంతాజి. సౌందర్య సేవధి. కవి ఈమె రూప సాక్షాత్కారాన్ని గావించిన తీరు.

"అతివ చక్కదనము నభివర్ణనము సేయ
కలము సాగదెట్టి కవివరులకు
చేయి యాడదెట్టి చిత్రకారులకును
చెలువ చెలువ మెల్ల జలుకరింప"

ముంతాజు పదముగ్గురు బిడ్డల తల్లి అయినా లావణ్య మిసుమంతైనా మాయ లేదట. కారణం

"జీవితంబున నొక దుష్టచింతలేని
సత్యవంతుల ప్రాయంబు జారదండ్రు"

అని అర్థాంతర న్యాసాలంకారంతో వివరించారు జాషువ సామ్రాజ్యరమకే సౌందర్యంగా ఉన్న రాణి సౌందర్యం-

"ప్రభువు కన్నులు దాటి యీవలికి రాదు,
వలుపు లూరింపకుండ నవ్వలికిబోదు".

శృంగార కరుణరసాలను అంగాంగి రసాలుగా ఈ వాక్యంలో పోషించిన జాషువా పుణ్యదంపతులైై ముంతాజు షాజహానుల సంతత ప్రణయానురాగాన్ని వర్ణిస్తూ

"ఆ సతీపతుల గాఢా శ్లేషముల నుండి
జారిపోయిన నిమేషంబు లేదు
ఆ దంపతులకు నాహ్లాదంబు గూర్పక
తొలగిన వెన్నెల తునకలేదు
ఆ ప్రేమజీవుల యనురాగ వృద్ధికై
రుతమొనర్పని పరభృతము లేదు
ఆ శుభాకృతులు నెయ్యంపు ముద్దులచేత
తీపికెక్కని ద్రాక్షదీగలేదు.

అవధిలేని వారి యానందకేళికి
దోడుపడని పూలదోట లేదు
వారి కూర్మి పెంపు నలచి వర్ణన జేసి
సుప్రసిద్ధి గనని సుకవి లేదు"

అంటూ నిర్వికల్పమైన ప్రణయబంధ ప్రతిపాదన గావించాడు.

చూలాలుగా ముంతాజు ఉత్తమ మాతృత్వ రాజ్ఞీత్వ గౌరవం గాంచింది. ఇక్కడ చక్కటి దాంపత్య శృంగారాన్ని వర్ణించాడు కవి. పదునాల్గవ గర్భమేర్పడగా చక్రవర్తిని భాగ్యబంధురమైన నిండుబండిలా నట్టింట సంచరిస్తూంది. ఇంతలో కవి దుశ్శకునాలను ప్రవేశపెట్టి స్త్రీ సహజమైన వెరపును ప్రదర్శించాడు.

తనకు మరణం తప్పదని భావించిన ముంతాజు పాదుషాతో క్ష్మావాస కథావిశేషాలు స్వాప్నికాలని, ఇవి మృత్యుదేవతా ధ్యాత విహారరంగమని

బోధించింది. ఈ తాత్విక దృక్పథాన్ని ముంతాజి ద్వారా వ్యక్తీకరించాడు జాషువా.

"అవిరియోడలో జలధియాన మొనర్చెడు బాటసారుల
భూవర రేవులందు దిగిపోయెదరించుక నెక్క ముందుగా
నీవసుధా పణంబు పనియెల్ల ముగించి స్వదేశగాములై
పోవుచు వచ్చుచుంద్రు సతమున్ ప్రజలీ నరజన్మవర్తకుల్"

ప్రపంచంలోని ప్రజలెల్లరు వర్తకులు. ఓడలలో పయనం సాగిస్తున్నారట. ఓడ జీవితానికి చిహ్నం. ఈ ప్రపంచంలో వ్యాపారం పూర్తిగావించి మరణం అనే రేవులో దిగిపోక తప్పదు.

ముంతాజి తుది వచనాలలో ఆత్మతత్వబోధ తొణికిసలాడుతూంది. మానవుని నశ్వర దేహాన్ని గూర్చి చక్కని బోధ ముంతాజి ముఖంగా మనకు ప్రసాదించాడు కవి.

ముంతాజి సహధర్మచారిణి అని చిత్రించారు. "కలుషంబింతయు లేని నీ మధుర ముగ్ధంబైన చిత్తంబు లోపల నిద్రింతు ననారతంబు" అనడంలో ముంతాజి షాజహానుల అన్యోన్యత ధ్వనిస్తోంది.

ముంతాజి అస్తమయాన్ని కవి సున్నితంగ సూచించారు.

"పట్టుపరదాల చీకటి వనములందు
ప్రభవమును గాంచి, శోభిల్లి రాలిపోయె
పరిమళంబొండు లోకాన బారజిమ్మి
మొగలు రేరాణి ముత్తైదు ముత్తియంబు"

ఆమెను రేరాణితో ఉపమించారు. 'ముత్తియంబు' అనే శబ్దం నిర్మలమైన, నిష్కళంకమైన ఆమె సౌశీల్యానికి ఉపలక్షకం. ముత్తైదువ అనేపదం ఆమె భర్త కళ్ళముందే దేహంచాలించిన పవిత్రురాలని చెప్పకయే చెబుతుంది.

భువనైకమోహిని స్వాధీన పతిక సుగుణాలరాశి ముంతాజి. లోకంలో ఎందరో మహారాజ చక్రవర్తులు పాదుషాలు ఉన్నారు. వారి హృదయం హరించిన ఇల్లాండ్రు ఉండవచ్చు. ప్రపంచంలో ప్రణతి చిహ్నంగా భార్యా

స్మృతికి భక్తిపూర్వకంగా తన అమూల్య సంపదను వెచ్చించిన ఇటువంటి మహోన్నత కళానిధిని ఒసగిన సహృదయ రసిక చక్రవర్తి కానరాడు. ముంతాజికి షాజహాను వరం కాగా, షాజహాను వరం ముంతాజి. వారి అన్యోన్యాలంబనమగు ప్రణయ ప్రసాదం తాజమహాలు. చివరగ అతడనుభవించిన ఆవేదనను బట్టి ఆమె గొప్పదనం ఔన్నత్యం మనకు స్పష్టమవుతాయి.

"ప్రియముగ దేవదూతలు చరించెడు మూడవ మిన్ను దాటిం
వ్యయమగు జీవనిర్ఝము వాఱు నొకానొక దీవికొంటిమై
బయనము గట్టితే యనఁగు భర్తను నన్ను బరిత్యజించి యె
ప్రియతమ తోడుగా నెగయ ఱెక్కలు గల్గునె నాకు దేవి"

షాజహాను సహజంగా లలితకళాప్రియ ప్రణయైకజీవి. కావున తన ముద్దులరాణి మాటకు పాదుషా ఎప్పుడూ ఎదురాడేవాడు కాడు.

ప్రేమ ఇతరులను గూర్చి ఆలోచింపజేస్తుంది. కాబట్టే దంపతీప్రణయంలో భర్తగా షాజహాను రాణికి జీవితంలో ఏమి కావాలో ఎల్లవేళల తెలిసికొని ముంతాజి పన్నెత్తి అడగవలసిన అవసరం లేదన్నట్లు కాపాడుకొన్నవాడు. జీవితంలో వలపులోని తరితీపు లెఱిగినవాడు. వియోగంలోని మంటలచేత అతని హృదయమే చితి అయింది. భార్యావియోగంలో వేదనా పద్యాలను షాజహాన్ ద్వారా కవి పలికించారు.

చక్రవర్తి ప్రణయతత్వవేత్త కావడంతోఁ దేనిచేతనూ ఆకర్షింపబడక భార్యా సమాధి నిర్మాణంలో నిమగ్నుడయ్యాడు.

"నీ మృదు పదంబులు కలదు కళింద జాతటిన్
జివుకని స్వర్గధామము రచించెద రమ్ము శుభ స్వరూపిణీ"

అతని ప్రణయహృదయం వల్లనే తాజమహాలు అమూల్యమైన అపురూప సౌందర్యమైన కళాధిదేవతగా అవతరించింది. పాదుషా శేషజీవితాన్ని ఈ విధంగా గడుపుతున్నాడు.

"నీవు వసించుచోట వసియింతును నేను దాచియుంపు మె
దేవి! యొకింత నేల చనుదెంచెద రేపట మాపటన్ నిరా
శా విషదహ్యమానమయి సౌఖ్య పరాఙ్ముఖమైనయట్టి నా
జీవిత శేషమంకితముఁ జేసెద నీ కవివాహితుండనై."

షాజహానుకు ముంతాజమహలు మీద గల ప్రేమకు, ఏకపత్నీవ్రత నియమానికిది నిదర్శనం. ముంతాజే షాజహాను హృదయం. షాజహాను హృదయమే తాజమహలు.

సంయోగవియోగాలచే పూర్ణత్వ మందిన పాదుషా ప్రణయ హృదయపు శోభయే తాజమహలు రూపంలో నేటికీ సౌందర్య పిపాసువులను తనియింప జేస్తూఉంది. మానవ ప్రతిభకు ప్రత్యక్షసాక్ష్యం ఈ తాజమహలు. పందొమ్మిది వత్సరాల దాంపత్య జీవితం మధురబంధంగా నాటుకుపోయింది. అట్టి దాంపత్యాన్ని పెకలించడం వల్ల కలిగిన, ఏవైద్యుడిచేత మాన్పరాని పాదుషా గాయానికిది స్మృతిచిహ్నం.

జాషువా కవి ఈ కావ్యభూమికలో ఇలా పేర్కొన్నారు.

"ప్రణయమూర్తియుఁ దన యర్ధాంగియు నగు ముంతాజి నలంకరించు చున్నట్లూహించుచు నిరువదిరెండేండ్లెత్తిన తలవాల్చక కట్టడమును సమాప్తి చేయించిన షాజహాను చేతలో నొక పవిత్ర ప్రణయ సందేశము, ఒక కళా పోషణ దీక్ష, ఒక యావేశ ఒక నిబుకు, ఒక మూగ సారస్వతము దంపతి లోకము కందించుచున్నదని నాయూహ. సతీవియోగమున నున్మత్తుడైన షాజహాను గాఢాంధకారబంధురమై సర్వశూన్యమైన తన జీవిత బ్రహ్మాండమున సందర్శించిన తేజః పుంజమీ తాజమహలు. ఆ పదార్థమున కితడు ప్రాణ ప్రతిష్ఠఁజేసి శాశ్వతుడైనాడు. ఐశ్వర్యమంతుడై యతడు శ్మశానము స్వర్గ ముగా మార్చివేయ గలిగినాడు.

"తచ్చంద్ర శిలా ధౌతములయిన కాళిందీ జలముల
యందా శుభదంపతుల యాత్మలు గుసగుసలు
వోవుచుఁ బ్రేక్షకుల కనంత భావపరంపరల బహుకరించుచున్నవి"

తదనుగుణంగానే ఈ "ముంతాజమహలు" కావ్యమున కద్భుతమైన ముగింపు.

"రాణి విడచిపోయె రాజు నొంటరిఁజేసి
రాజు విడచిపోయె రాజ్యరమను
రాజ్యరమయు విడిచె రాజులఁ బెక్కండ్ర
తాజి విడువలేదు రాజసంబు"



# జాషువా కోరిన జాతీయ సమైక్యత

—ఆచార్య గుజ్జర్లమూడి కృపాచారి
తెలుగు సంస్కృత శాఖాచార్యులు
నాగార్జున విశ్వవిద్యాలయం
నాగార్జుననగర్ : 522 510

మహాకవి, కవికోకిల, పద్మభూషణ్ యిత్యాది బిరుదాంకితుడైన శ్రీ గుఱ్ఱం జాషువా భారత జాతి కీర్తి పతాకను వినువీధుల్లో విహరింపచేసిన విశ్వనరుడు. ఆయన తవ్వుతున్న కొలది రతనాలు లభించే సాహితీగని. అయితే ఎవరి సామర్థ్యం వారికి, ఎవరి అవగాహనమేర వారికి అర్థమయ్యే సరస్వతీ ప్రియుడు. పదవిన్యాసంలోనూ, భావసంపదలోనూ, అలంకార ప్రయోగంలోనూ* ఒక్కమాటలో చెప్పాలంటే పుడమిపై గల ప్రతి వస్తువును స్పృశించి కావ్యత్వాన్ని కలిగించిన విశ్వకవి ఆయన. "జాషువా వ్యక్తిగత జీవితం సాహిత్యం రెండూ సంఘర్షణలో నుంచి ఉద్భవించాయి. ఆయన జీవితం సాహిత్యంతోనూ, ఆయన సాహిత్యం జీవితంతోనూ వేరు చేయలేనంత గాఢంగా ముడివడిపోయినంతగా రెండూ ఒకటే అన్నంతగా కలసిపోయాయి.[1]"

విశ్వనరుడైన కవి వినుకొండలో పుట్టి గుంటూరులో స్థిరనివాసి అయి ఆంధ్రవాణి గరగరల్ సవరించినా కులపిశాచి రక్కసి మధ్య ఆయన ఎన్నో వ్యథలను అనుభవించాడన్నది నిత్యసత్యం. అస్పృశ్యత అనే అంటు జాడ్యం వదిలించాలనే మాటల మూటలు, కాగితాల రాతలు అలానే ఉన్నా అంతరాంతరాల్లో అది గూడుకట్టి మూలుగుతూనే వున్నది. నాటికి నేటికి స్థాయిలో తప్ప.

---

* జాషువాకు రూపకాలంకారమంటె తగని మక్కువ. రూపకమే పద్యానికి రూపు తెస్తుందని ఆయన ఎపుడూ పలికేవారని జాషువా సన్నిహిత సహచరుడు, భక్తుడు రేపల్లెవాసి తన ఇంటికి జాషువా నిలయమని నామకరణం చేసిన శ్రీ గద్దె వీరరాఘవయ్య నాతో ఎన్నోసార్లు చెప్పారు.

1. సుధాకర్, ఎండ్లూరి, జాషువాకథ, పుటలు, 22-24,

విశ్వమానవ గోత్రేయ వీరులైన
కవులకుం గర్మబంధాలు కట్టిబెట్టి
పులుముచుందురు తలమీద కులమురంగు
దొలగిపోవదు లక్షసబ్బులకు గూడ (ముఫాఫర్లు)

జాషువా విశ్వమానవతా వాదిగ ఆవిష్కరించడంతోపాటు జాతి సమైక్యతకు ఆయన జీవితంలోని వ్యధాఘట్టాలు సాక్షాత్కరిస్తాయి. స్వాతంత్ర్యానికి పూర్వం ఆయన జననం. అస్పృశ్యతాజాడ్యం ఒకవైపు దుర్భర దారిద్ర్యం మరొకవైపూ- కవితా వ్యాసంగం యింకొకవైపూ- కావ్య ఆవిష్కరణం ఆవలివైపు. ఈ విధంగా జాషువా చతుర్ముఖ కవితాబ్రహ్మగా సాక్షాత్కరిస్తాడు.

ఖండకావ్యాల్లో అఖండఖ్యాతిని అనంతవ్యాప్తిని కూర్చినవాడు జాషువా. చదివినకొద్దీ చదివించేలా వుంటాయి జాషువా పద్యాలు. ఆయన ఖండికల్లో సమైక్యతా రాగం కన్పిస్తుంది. భిన్నదైవాలను, విభిన్నమతాలను చేసిన అక్యసంస్కృతిని, భారతదేశాన్ని చిందరవందర చేసింది. దీని వలన మానవసమాజంలో సంకుచితభావం ఏర్పడి మారణహోమం జరుగుతుందని దీన్ని మతాధిపతులు మరింత పెంచి పోషిస్తున్నారని కలతచెందారు.

"మతమొక కంచుకోటవలె మానవ దుష్కృతి గప్పిపుచ్చి మం
చితమగు నైకమత్యమును చిందరవందర జేసి భిన్న
దైవతములనని సంకుచిత భావములు బురిగొల్పి. స్వార్థ దూ
షితులగు పీఠికాధిపతుల జీవితమాత్రకు తోడు సూపెడిన్"
[స్వయం - 20]

మతం హితం కావాలనే భావన అంతర్లీనంగా ధ్వనిస్తుంది. కుల పిశాచమ్ముల కుమ్ములాటలోన స్రుక్కిపోయినది నాసుప్రతిష్ఠ (ఖండ, 3-18) అని వెతచెందాడు పైగా దేశమంతా ఒకటే కావాలని ఆశాభావం వ్యక్తం చేసాడు. నా దేశంబు ..... సమస్త మానవ సమానత్వంబు గుర్తించునో లేదో ... అని తలచి భావిభారత రథం బేమార్గమున్ ద్రొక్కునో" అని వేదన వ్యక్తపరచినాడు. మానవత్వం చాల గొప్పది మనిషికి ఉండవలసినది కూడ. అయితే ఇది గోచరం కానిది. ఆచరణలో చూపగలిగింది

మానవత్వం. ఎక్కడ మానవత్వం లోపిస్తుందో అక్కడ దానవత్వం రాజ్యం చేస్తుంది. దీన్ని సౌమ్యంగా వర్ణిస్తాడు జాషువ.

మతముకతన సాటియగు మనుజుల కెడవుగా
బ్రతుకుచున్న ప్రజల హృదయమందు
బందియైనది మానవత్వంబు పోరుగా
వించుగుట్టు గోచరించె సతికి (స్వయం. 28)

మానవత్వం హృదయంలో బందికావడం- దాన్ని విడిపించలేని అజ్ఞానంలో మానవుడు ఉన్నాడు అనే బాధను వ్యక్తం చేస్తాడు.

ఒకదెస మానవత్వము సహోదరభావము లాగుచుండ నిం
కొకదెస కాదుకాదని మతోగ్రపిశాచి బలాత్కరించగా
వికట భిన్నవేషములు వేసి చరించు ననంతకోటి వా
ర్గిక రసహీన జీవిత పరిస్థితు లాత్మగలంచె భామకున్ (స్వమం-34)

ఇది ఈ నాటికీ జరుగుతున్న మతపిశాచ కరాళ నృత్యానికి ప్రతీక. దీని వలన జాతి 'రసహీన' మవుతుందని హెచ్చరిస్తాడు.

పామరులు అజ్ఞానం వలన మతమౌఢ్య విశ్వాసాలతో బలి అవుతున్నా రన్నది జగమెరిగిన సత్యం. విజ్ఞానవికాసం విస్తరిల్లిన మేధావులూ మతం ముసుగులో ఎలా వుంటారో సూటిగా వాడిగా వేడిగా వడ్డిస్తాడు.

తలలో మరుపురాని రిత్త చదువులే ధర్మంబులుం బూజలెం
దులకీ చీకటి జీవయాత్ర కొకహద్దున్ పద్దు గన్పట్ట దా
చెలి! క్షుద్బాధితమై కరద్వయము సుంసాబెన్ దేశమేలాటి సం
స్థలు స్థాపించి దురంత దుర్ఘట సమస్యాపూర్తి గానింతువో
(స్వయం. 42)

ఈ చదువులు సంధ్యలు కులాల కుమ్ములాటల్లో విద్యాలయాలు, విశ్వవిద్యాలయాల్లోనూ ఎలా వున్నాయో తెలుస్తుంది. చదువులుచదివినా కుల కరాళ నృత్యాలకు దాసోహమనే 'పెద్దల'కు ఈ పద్యం ప్రతీక.

కులమతాలు కూకటి వేళ్ళతో పోవాలనే తపన ఆయనకుంది. స్వార్థ

పరుల ఆగడాలు అరికట్టవలసిన బాధ్యత యువత చేతిలో వుంది. అది జాషువ లేఖినిలో ఈ విధంగా ప్రతిబింబిస్తుంది.

సకలదేశ మహిత సౌభాగ్య సంపత్తి
మనకు గిట్టదనుచు మభ్యపరచి
కులమతాలు దొడ్డ గుండాలు ద్రవ్వించు
స్వార్థపరుల దండినరిగట్టె, దేశంబు
పరువు నిలుపుకొమ్ము; భరతపుత్ర! (ఖండ 5-8)

జాషువ క్రైస్తవుడు. బాల్యం నుంచి అఖండ స్వర్గసాహిత్యాన్ని, పాదిరీ బోధనలను విని అకళింపు జేసుకున్నాడు. పైగా క్రైస్తవ మత తత్త్వమైన ప్రేమ సిద్ధాంతాన్ని అవసరాన్ని బట్టి వ్యక్తం చేస్తాడు.

విశ్వమందు గల్గు ప్రేమ సర్వస్వంబు
ముద్దజేసి హృదయమును మలచి
మెరయు సత్యమెల్ల గరగి రాగిరేకులు గొట్టి
సృష్టిజేయుమయ్య జిహ్వకలను (కొత్తలోకము-26)

ప్రేమ హృదయంలో ముద్దజేయడం ఆత్మీయత అనురాగ చిహ్నాలకు తార్కాణం. సత్యాన్ని రాగిరేకులపై చెక్కించడం భవిష్యత్తరానికి భద్ర పరచడం. సత్యవాక్యపాలను భద్రం జేయడం. ప్రేమేనిత్యము- సత్యము నిరంతరము అనే విషయం విశ్లేషణం కన్పిస్తుంది.

జాషువ కోరిన జాతి సమైక్యతలో జీవనరాగం కన్పిస్తుంది. ప్రపంచం సర్వసుభిక్షం కావాలని ఆయన మతం ఎల్ల సోదరులు ఏకోదరులై నిరంతర ఆనంద జీవనం గడపాలని ఆయన కోరిక.

ఎనలేని దుఃఖ వహ్నికి ధ్యేయమైనట్టి
  తృష్ణనెల్లరు సంహరించుచోటు
నిరాపాయకరములై తిరుగు ప్రాణుల మేను
  కత్తుల కగ్గము గాని చోటు
ఎల్లజాతుల వారలేకోదరుల మట్లు
  ముద్దుముద్దుగ పొందిి పొసగుచోటు

వెలితిచే శుష్కించు పేదసాదల డొక్క
　　ముప్పూట లనువుగా బూడుచోటు
ఇంద్రియ విజేతలైన మునీంద్రుకోటి
మానసము డోలి కలతలు లేనిచోటు
ప్రేమరస వాహినులు వెల్లివిరియుచోటు
పరమగును, దానికొక స్థలాంతరము లేదు　　　(కాంవిశీకుడు-25)

జాషువ కవితల్లో భారతజాతీయ స్వప్రచారాన్ని పోషిస్తాడు. పురాణ ప్రతీకలుగా మునీంద్రకోటివంటి ప్రయోగం, అభ్యుదయ భావనలో పేద సాదల డొక్కలు ముప్పూటలనువుగా నిండాలని కోరుకుంటాడు. ఒక్క మాటలో ఎల్లరూచల్లగా వుండాలని విశ్వసిస్తాడు.

ప్రతివ్యక్తికీ పరమార్థ జీవితం (Above the human relations) కావాలంటాడు. పరమ పవిత్రమైన విశ్వప్రేమభావన (Universal love) కలిగి వుండాలంటాడు. ప్రేమకు, ప్రేమ వాంఛికి ఒక ప్రాంతం–ప్రవేశం లేదని ఖండితంగా చెప్తాడు. ఆయన కోరే నవ సమాజాన్ని కూడా కవితలో ఆవిష్కరిస్తాడు.

అకాలంకంబగు హేతువాదమును, సత్యాన్వేషణాసక్తి, సాం
ఘిక కల్యాణ పిపాస, పాక్షిక దావాగ్నిన్నెట్టు దుర్దాంత శా
బ్దిక పాండిత్యము నాదరింపని లసద్విజ్ఞాన మింటింట పా
దు కొనుంగాత విశాల భారతము నందున్ లోక విఖ్యాతమై
(ఖండ-4-19)

జాషువపుట్టి నేటికి వందేళ్ళు. ఆయన కవిత ప్రారంభం చేసి యింకా వందఏళ్ళు పూర్తి కాలేదు. ఆయన ఋషితుల్యుడు కనుక నాటికీ నేటికి ఏనాటికయినా ఆయన చెప్పినవి నిత్యసత్యాలుగా నిలుస్తాయి. అవి ప్రజలను ఆలోచింపచేస్తాయి. పదికాలాలపాటు నిలుస్తాయి. మరణం లేని మానవ త్వాన్ని కామించు కవితావీణపై నేను ప్రమోయించిన వ్యథాతంత్రులే ఖండ కావ్యాలు అని పేర్కొన్న జాషువ తెలుగు సాహితీ ప్రపంచంలో అమరుడు– అజరామరుడు.